


# రాక్షసి లోయ

పూర్వం బ్రహ్మపురమనే నగరానికి సమీపానగల అరణ్యంలో కేశవుడనే కాపు యువకు డొకడు పశువులను మేపుకుంటూ వుండేవాడు. వాడికి తల్లి లేదు. ముసలి తండ్రి మాత్రం వున్నాడు. ఆ ముసలివాడు రోజూ ఉదయం పశువుల పాలుపిండి, వాటిని నగరంలో అమ్మి, ఆ వచ్చిన డబ్బులతో ఇంటికి అవసరమయిన వస్తువులు కొని తెస్తూండేవాడు.

కేశవుడూ, అతని తండ్రీ అరణ్యంమధ్య ఒక చిన్న పూరిపాకలో నివసిస్తూండేవారు. వారున్న ప్రాంతానికి దాపులలో ఎక్కడా గ్రామాలులేవు. వాళ్ళు వుంటున్న అరణ్యం చుట్టూతా పెద్ద పెద్ద కొండలుండేవి. కేశవుడు రోజూ తన పశువులమందను కొండ దరికి తోలుకుపోయి, అక్కడవున్న పచ్చిక బీళ్ళలో వాటిని మేపుతూండేవాడు. అలాంటి సమయాల్లో అతడికి కొండ పైభాగానికి ఎక్కి చూడాలనిపించేది. కాని, తండ్రి అతణ్ణి కొండ ఎక్కవద్దని ఏనాడో శాసించాడు. కారణ మేమంటే, ఆ కొండమీది గుహల్లో పెద్ద పెద్ద సర్పాలూ, పులులూ, ఎలుగుబంట్లూ వుంటవని అతడి నమ్మకం.

ఒకనాడు పశువులను పచ్చికబీటి వైపుకు తోలి, కేశవుడు ఒక చెట్టు నానుకుని కూచుని విల్లంబులు తీసుకుని, బాణాలను దూరంగా వున్న అడివిచెట్ల బోదెలకూ, కొమ్మలపైన వున్న పకులకూ గురిచేసి వదులుతున్నాడు. వాడావిధంగా విలు విద్యాభ్యాసంలో మైమరచి వుండగా, కొండ పాదంలోని







రాతిబండల వైపునుంచి ఒక వికృతమైన ధ్వని వినిపించింది. కేశవుడు భయంవల్ల కంపించిపోయి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, ఆ వికృతధ్వని వచ్చినవైపుకు కళ్ళుతిప్పాడు. చూస్తూండగానే ఒక వింత జంతువు అక్కడ ఎత్తుగావున్న ఒక రాతి మీదికి ఛెంగున ఎగిరి నిలబడింది. దాని ఆకారం గుర్రాన్ని పోలివున్నది. కాని శరీరం మీద అడవి గాడిదలకు వున్నట్టుగా పెద్ద చారలున్నాయి. ముఖాన పొడవైన ఒకే ఒక కొమ్ము వున్నది.

ఈ వింత జంతువును చూసి కేశవుడు తబ్బిబ్బయిపోయాడు. ఇలాంటి జంతువు



లోకంలో వుంటుందనయినా వాడు ఎన్నడూ వినలేదు. ఇప్పుడేంచేయాలి? బాణం ఎక్కుపెట్టి దాన్ని గురిగా కొట్టగలిగితే బావుండును. ఆ వింతమృగం రాతిమీద నిలబడి తోకతో శరీరాన్ని దులుపుకుంటూ, మెడ మీది పెద్ద జూలును ఎగరవేస్తూ కేశవుడి కేసి తల తిప్పింది. ఇదే మంచి అదనను కుంటూ కేశవుడు వింటినారిని చెవివరకూ లాగి, ఒక బాణాన్ని దాని మీదికి వదిలాడు. బాణం ఝుం అంటూ వచ్చి శరీరాన్ని తాకే లోపల ఆ వింత జంతువు రాతిమీది నుంచి ఎగిరి పక్కకు దూకేసింది. కేశవుడు ఆశ్చర్యపడుతూ మరోబాణాన్ని వింటికి తగిలించబోయేంతలో, అది వాయువేగ మనోవేగాలతో దూకుతూ వచ్చి, కేశవుడి చేతిలో వున్న విల్లంబులను నోటపట్టి దూరంగా విసిరివేసింది.

తనకు ప్రాణాపాయం కలగనున్నదని కేశవుడు భావించాడు. ఆ క్షణంలోనే అతడికి ఎక్కడలేని తెగింపూ కలిగింది. అతడు చెట్టుకు అనించి వున్న తన చేతి కర్రను అందుకోబోయేలోపల, ఆ వింత జంతువు ఆవుకన్నకూడా సాధువులా తలాడిస్తూ వచ్చి, ముట్టెను అతడి భుజం మీద పెట్టింది.











కేశవుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ఈ వింతజంతువుకు మానవుల మనోగతాభిప్రాయాలు తెలుసుకునే దివ్యజ్ఞానం వున్నదేమో అనిపించిందతడికి. ఏది ఏమైనా, ఈ వింతజంతువు వాలకం చూస్తూంటే, అది తనకు హాని చేసేదిగా కనబడలేదు. ఆ కారణంవల్ల కేశవుడు ఉత్సాహంగా లేచి నిలబడి, దాని వెన్నుమీద అరిచేతితో గట్టిగా చరిచాడు. దానితో ఆ వింత మృగం గుర్రంలా కాళ్ళతో కదను తొక్కుతూ, తల పైకెత్తి పెద్దగా సకిలించింది.

"ఇది బహుశా గుర్రం జాతికి చెందిన జంతువై వుండొచ్చు," అనుకున్నాడు కేశవుడు. ఆ అభిప్రాయం అతడికి కలగగానే, దానిమీద స్వారి చేయాలన్నకోరిక కలిగింది. ఆ వెంటనే అతడు ఎగిరి దాని వీపుమీద కూచున్నాడు.

వింతజంతువు ఈసారి మరింత పెద్దగా సకిలించి, చిన్న చిన్న అడుగులు వేస్తూ కొండకేసి బయలుదేరింది. కళ్ళెం, జీనూ లేకుండానే దీనిమీద స్వారి చేయవచ్చు, అనుకున్నాడు కేశవుడు. కొండను సమీపిస్తున్నకొద్దీ దాని వేగం క్రమంగా హెచ్చసాగింది. కేశవుడు కింద పడబోయేవాడల్లా దాని జూలు పట్టుకుని ముందు కొరిగాడు. అదే సమయంలో అది బంతిలా ఎగిరి ఒక బండరాయి మీదికి ఎక్కింది. కేశవుడు భయపడిపోయాడు. "ఓహో, ఇది, నన్ను కొండమీదికి తీసుకుపోవాలని చూస్తున్నది. అక్కడి గుహల్లో పులులూ, ఎలుగుబంట్లూ...ప్రమాదం!" అనుకుంటూ అతడు దానిమీది నుంచి కిందికి దూకేశాడు. కేశవుడు కిందికి దూకగానే, వింత జంతువుకూడా రాతిమీది నుంచి కిందికి దూకి, అతడి చుట్టూ కదను తొక్కుతూ గిర్రున తిరగసాగింది. కేశవుడికి ఏమి చేయాలో తెలియలేదు. వాడు కాళ్ళీడ్చుకుంటూ మామూలుగా కూచునే చెట్టు





వద్దకు వెళ్లాడు. వింతజంతువు కూడా అతడికి వెనకగా అక్కడికి చేరింది.

కేశవుడు ఆలోచనలోపడ్డాడు. ప్రపంచంలోమాట ఏమోగాని, తను వుంటున్న రాజ్యంలో మటుకు ఇలాంటి జంతువు వున్నట్టు తను ఎన్నడూ వినలేదు. అది కొండ మీది నుంచి తను వున్నచోటుకు వచ్చింది. తను స్వారిచేయాలని ప్రయత్నిస్తే తనను కొండమీదికి తీసుకుపోవాలని ప్రయత్నించింది. అంటే, దాని నివాసస్థానం కొండ మీద ఎక్కడో వుండి వుంటుంది. దీనిని పట్టుకుపోయి బ్రహ్మపురంలో అమ్మితే తనకు చాలా ధనం రావచ్చు!



కేశవుడు యిలాంటి ఆలోచనల్లో తల మునకలైవుండగా, వింత జంతువు వాడి పశువుల మందలోకి వెళ్ళి, వాటితోపాటు పచ్చిగడ్డి మేయసాగింది. మొదట్లో, దాన్ని చూసి బెదిరిన ఆవులు క్రమంగా భయంపోయి, దానితోపాటు కలిసి తిరగసాగాయి. ఆ సాయంత్రం వరకూ తన ఆవులమందలో వుండి, సూర్యాస్తమయ సమయంలో, ఆ వింత జంతువు తిరిగి కొండమీదికి వెళ్లిపోతుందనుకున్నాడు, కేశవుడు. కాని, అలా జరగలేదు. చీకటి పడుతూండగా వాడు మందను ఇంటికి మళ్ళించుకు వచ్చేటప్పుడు, అదికూడా వాటితోపాటు వాడి పూరిపాక దగ్గిరకు వచ్చింది. కేశవుడు పశువులన్నిటిని ఒకచోటికి చేర్చి, వాటి చుట్టూ నెగడువేసి పాకలోకి వెళ్ళిపోయాడు. ఈ వింత జంతువు సంగతి తన తండ్రితో చెప్పటమా? మానటమా? అని ఆలోచిస్తూనే, వాడు ఆ రాత్రి భోజనంచేసి హాయిగా నిద్రపోయాడు.

మర్నాడు తెల తెల్లవారుతూండగానే తండ్రి కేశవుడి మంచం దగ్గిరకు వచ్చి, వాణ్ణి భుజంపట్టుకుని కుదుపుతూ, "కేశవా, లేలే! ఎంత ప్రమాదం జరిగిపోయింది! రాత్రి మన మందలోకి ఒక తోడేలు







వచ్చింది. చుట్టూ నెగళ్ళు వెలుగుతున్నా అదెట్లా లోపలికి వచ్చిందో నాకు తెలియటం లేదు," అన్నాడు ఆదుర్దాగా.

కేశవుడు ఉలిక్కిపడి లేచికూచున్నాడు. వాడికి చప్పున క్రితంరోజు ఆవులమంద దగ్గిరకు వచ్చిన వింత జంతువు గుర్తుకొచ్చింది. తండ్రి దాన్ని చూసి తోడేలనుకుంటున్నాడా? అతడికి పెద్దతనం వల్ల బాగా చూపు ఆనకపోయినా, గుర్రం అంత ఎత్తున్న ఆ వింత జంతువును చూసి తోడేలని ఎలా అనుకోగలడు? ఒకవేళ ఆ వింత జంతువే రాత్రి వేళ తోడేలుగా మారి తన ఆవుల్ని చంపి తిని పారిపోయిందేమో!



"ఆ తోడేలు ఎన్ని ఆవుల్ని పొట్టన పెట్టుకున్నది?" అని అడిగాడు కేశవుడు తండ్రిని.

"దేవుడి దయవల్ల అలాంటిదేమీ జరగలేదు. తోడేలు నన్ను చూస్తూనే నెగళ్ల మంట మీదిగా దూకి అడవిలోకి పారిపోయింది," అన్నాడు తండ్రి.

కేశవుడు ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, "నువు చూసింది తోడేలు కాదేమో! నిన్న సాయంకాలం మందలోకి కొండ మీదినుంచి ఒక వింతజంతువు వచ్చింది," అంటూ తండ్రికి దాన్ని గురించి అంతా వివరంగా చెప్పాడు. అంతా విని తండ్రి ఆశ్చర్యపడుతూ, "నువ్వు చెప్పిన వింతజంతువేదీ నాకు మందలో కనిపించలేదే! కొండమీంచి వచ్చిందంటున్నావు, జాగ్రత్త! అది జంతు రూపంలో వున్న ఏ మాయావి రక్కసయినా కావొచ్చు!" అన్నాడు.

తండ్రి మాటలకు కేశవుడు బిగ్గరగా నవ్వుతూ, "రక్కసైతే నన్ను పట్టుకుపోయేందుకు ఆ రూపంలోనే రావొచ్చుగా, ఈ వింత రూపం ఎందుకు ధరించాలి? నువ్వు చూసింది నిజంగానే తోడేలు, సందేహం లేదు. మంద వెంట మన ఇంటికి వచ్చిన వింతజంతువు రాత్రికిరాత్రే అడవిలోకి వెళ్ళిపోయివుంటుంది," అన్నాడు.












తరవాత తండ్రి పాలకావిడి ఎత్తుకుని నగరంకేసి వెళ్ళిపోయాడు. కేశవుడు అదరా బాదరా ముఖం కడుక్కుని, స్నానం చేసి చద్ది అన్నం తిని మందను కొండదరి పచ్చిక బీడులోకి తోలుకు పోయేందుకు పాకలోంచి బయటికి వచ్చాడు. ఆవుల్లో కొన్ని నెమరు వేస్తూ పడుకొనివున్నాయి, కొన్ని అంభా అని అరుస్తూ గంతులు వేస్తున్నాయి. కాని, ఎక్కడా వింతజంతువు జాడలేదు.

కేశవుడు ఆవుల మందను కొండదరికి తోలుకుపోయి, తను మామూలుగా కూచునే చెట్టు కింద కూచుని, బాణాలు ఎక్కుపెట్టి కొండ మీదికి ఝూం ఝూం ;అని ప్రతి ధ్వనించేలా వదులుతున్నాడు. హఠాత్తుగా అతడి వెనక వింతజంతువు వికృతంగా సకిలించిన శబ్దం వినబడింది. కేశవుడు తుళ్ళిపడి వెనక్కు తిరిగి చూశాడు. వింత జంతువు వెనకకాళ్ళమీద లేచి నిలబడి మరింత పెద్దగా సకిలించి, అతడి ముందుకు వచ్చి నిలబడింది.

"మళ్ళీ వచ్చావా? నీమాట మరచి పోయాను సుమా?" అన్నాడు కేశవుడు, మనిషితో మాట్లాడుతున్న ధోరణిలో. వింత జంతువు తలాడించింది. కేశవుడి ఆశ్చర్యానికి అంతులేదు. అంతలోనే అతడికి తండ్రి మాటలు గుర్తుకొచ్చినై. "ఇదేదైనా మాయ రక్కసి కాదుగదా?" అనుకున్నాడు మనసులో. అతడి మనోగతభావాలు అర్థమైనదానిలా వింతజంతువు గిరుక్కున వెను దిరిగి ఆవుల మందకేసి బయలుదేరింది. కేశవుడు దానికేసి కొంచెం సేపు అను మానంగా చూసి, విసుక్కుంటూ, అంబుల పొదిలోంచి బాణాలు తీసి ఎక్కుపెట్టి, ఈసారి చెట్లకొమ్మల మీదికి వదలసాగాడు.

ఈ విధంగా కొద్దికాలం గడిచింది. దూరంగా ఎక్కడో గుర్రాలు పరిగెత్తి వస్తున్న చప్పుడయింది. చూస్తూండగానే ఇద్దరు రౌతులు కేశవుడున్నచోటుకు వచ్చి,






ఆతడికేసి వింతగా చూస్తూ, "మహాసేనానీ, ఇక్కడెవ్వడో ఏకలవ్యుడున్నట్టుంది!" అని కేకపెట్టారు.

"ఏకలవ్యుడా? అయితే అలక్ష్య మెందుకు, వేళ్ళు తెగ్గొట్టండి!" అంటూ విలువైన దుస్తులతో, బాగా అలంకరింపబడిన గుర్రాన్నెక్కి వున్న ఒకడు అక్కడికి వచ్చాడు.

"ఏమిరా ఆ పొగరు! లేచి నిలబడవేం? ఈ వచ్చింది ఎవరనుకున్నావ్? బ్రహ్మపుర మహాసేనాని!" అన్నాడొక రౌతు.

కేశవుడు చప్పున లేచి నిలబడి, బ్రహ్మపురసేనానికి, చేతులెత్తి నమస్కారం చేశాడు. సేనాని అతణ్ణీ, చెట్టుకింద వున్న అంబుల పొదినీ, ధనువునూ పరీక్షగా చూసి మీసం దువ్వుకుంటూ, "ఏరా, నువ్వెవరివి? క్షత్రియుడివా? ఎవరి ప్రాణాలు తీయాలని, ఈ ధనుర్విద్య నేర్చుతున్నావ్?" అని కఠినంగా ప్రశ్నించాడు.

"అయ్యా, నేను కాపుకుర్రాణ్ణి. నాకీ లోకంలో శత్రువులెవరూ లేరు. ఏదో ఉబుసుపోక ఈ విల్లంబులు వెంట తెచ్చుకున్నాను. అదుగో, ఆ కొండ దరిని నా ఆలమంద!" అన్నాడు కేశవుడు వినయంగా.

సేనాని తల తిప్పి ఆలమందకేసి చూసే లోపలే, గుర్రపు రౌతుల్లో ఒకడు గగ్గోలు పడుతున్నట్టు గొంతెత్తి, "మహాసేనానీ, చూడండి, చూడండి! పంచకల్యాణి! దేవతాశ్వంలా వున్నది!" అంటూ వింతజంతువుకేసి చెయ్యెత్తి చూపాడు.

సేనాని ఆశ్చర్యపడుతూ ఆ వింత జంతువుకేసి ఓ క్షణకాలం చూసి, "అది పంచకల్యాణి కాదు, దేవతాశ్వమూ కాదు, అడవిగాడిదలా వున్నది! అడవిగాడిద అంత ఎత్తు వుంటదే! ఒంటి కొమ్ము ఏమిటి? ఇలాంటి జంతువు వుంటుందని వినసైనా వినలేదే! ఇటు మళ్ళించుకురండి!" అని భటులకు ఆజ్ఞయిచ్చాడు.—(ఇంకా వుంది)








# 2

[బ్రహ్మపురమనే నగరానికి దాపున గల అరణ్యంలో కేశవుడనే కాపు యువకుడు వుండే వాడు. వాడు ఒక రోజున కొండచరిని పశువులను మేపుకుంటూండగా ఒక వింత జంతువు అక్కడికి వచ్చింది. అడవిలో వేటకు వచ్చిన బ్రహ్మపుర సేనాని దానిని చూసి, ఆశ్చర్యపడి తన భటులతో దాన్ని తన దగ్గిరకు తోలుకు రమ్మన్నాడు. తరవాత—]

సేనాని ఆజ్ఞ వింటూనే భటుల్లో ఒకడు తన గుర్రాన్ని దౌడుతీయించి, వింత జంతువును అదిలిస్తూ సేనాని వైపుకు తరుముకు వచ్చాడు. సేనాని దానికేసి ఓ నిమిషకాలం కళ్ళార్పకుండా చూసి, "ఇదేదో అపూర్వమైన జంతువు! ప్రపంచంలో యిలాటిది మరొకటి వుంటుందని నమ్మటానికి లేదు. రాజుగారికి దీన్ని బహూకరిస్తే ఎంతగానైనా సంతోషిస్తారు." అంటూ కేశవుడికేసి తిరిగి, "ఏరా ఒరే! ఇలాంటి అపూర్వమైన జంతువును ఎక్కడ దొంగిలించావు? రాజ్యంలో దొరికే నిధినిక్షేపాలతో పాటు, ఇటువంటి అపూర్వమైన జంతువులూ, పక్షులూ— అన్నీ రాజుగారివే అన్న శాసనం సంగతి నీకు తెలియదా?" అంటూ ప్రశ్నించాడు.

సేనాని బెదిరింపులు వింటున్న కేశవుడికి ఎక్కడలేని కోపం వచ్చింది. కాని, దాన్ని అతడు బయటపడనియకుండా, "అయ్యా, ఈ జంతువును నేనెక్కడా దొంగిలించ లేదు. ఆ కొండ మీద ఇంత







చిన్నపిల్లగా నాకు దొరికింది. పెంచి, పెద్ద చేశాను. ఎప్పుడూ నా ఆలమందల వెంట తిరుగుతుంటుంది. నాకు చదువు సంధ్యలు రావు. పైగా ఎన్నడూ ఈ అరణ్యం వదిలి వెళ్లిన వాణ్ణికాను. అందువల్ల రాజుగారి శాసనం సంగతి నాకు తెలీదు," అన్నాడు.

"అలాగా, అయితే క్షమించాను. ఒరే, దాని మెడకు తాడువేసి నగరానికి తీసుకు రండి!" అంటూ సేనాని గుర్రాన్ని ముందుకు నడిపాడు. భటుల్లో ఒకడు ఉచ్చు బిగించివున్న పెద్ద తాడు నొకదాన్ని వింతజంతువు మెడకు పడేలా విసిరి, అది బిగుసుకోగానే, తాడు కొసను తను ఎక్కి



వున్న గుర్రం జీనుకు కట్టి, సేనాని వెనకగా బయలుదేరాడు. రెండవ భటుడు, కేశవుడి దగ్గిరకువచ్చి కత్తి ఝళిపిస్తూ, "జాగర్త. నేను మళ్లీ ఓనెల రోజుల్లో ఒంటిగా యిక్కడికి వస్తాను. ఈసారి కొండమీద దొరికిన పిల్లను నా కప్పగించకపోయావో, ఒళ్లు చీరేస్తాను," అని హెచ్చరించి మొదటి భటుడి వెంట బయలుదేరాడు.

సేనానీ, అతడి వెంటవున్న భటులూ ప్రదర్శించిన నీచవర్తన కేశవుడి రక్తాన్ని ఉడికించింది. అతడు అంబుల పొదిలో నుంచి ఒక బాణం తీసి వాళ్లకేసి ఎక్కుపెట్టి, "ఛీ, ఎంత శత్రువునైనా వెనకనుంచి దొంగదెబ్బ తీయకూడదు." అనుకుంటూ బాణాన్ని కిందికి జారవిడిచాడు.

భటులిద్దరూ వింతజంతువును వెంట తీసుకుని వెనక వస్తూండగా, ముందుండి అరణ్యంలో దారితీస్తున్న బ్రహ్మపురం సేనాని ఆనందం అంతా యింతా కాదు. ఆ జంతువును మహారాజుకు చూపి, దాన్ని పట్టుకునేందుకు అరణ్యంలో తనెన్ని సాహసకృత్యాలు చేశాడో నమ్మబలికి, రాజు నుంచి పెద్ద బహుమానం సంపాయించాలని అతడు ఆలోచిస్తున్నాడు. ఒక కాపు యువకుణ్ణి బెదిరించి, ఆ వింతజంతువును











పట్టుకొచ్చినట్టు నగరంలో ఎవరికీ తెలియ కూడదు. అందువల్ల తను ముందుగా తన భటులను హెచ్చరించాలి.

సేనాని యిలా అనుకుని, తన పథకం సంగతి భటులకు చెప్పేందుకు గుర్రాన్ని ఆపి వెనుతిరగబోయేంతలో హఠాత్తుగా అతడికి భటుడు వేసిన చావుకేక వినిపించింది. "అయ్యో, ఇదేదో రాకాసిగుర్రం! నా గుర్రాన్ని డొక్కలో పొడిచి చంపేసింది. నా మీదకు..." అంటూ కెవ్వుమన్నాడు.

సేనాని తత్తరపడుతూ తల వెనక్కు తిప్పాడు. ఒక భటుడూ, వాడి గుర్రం రక్తం మడుగులో విలవిలా తన్నుకుంటున్నారు. రెండో భటుడు గుర్రాన్ని పక్కకు తిప్పి అరణ్యంలోకి ఉడాయిస్తున్నాడు. సేనాని నిలువెల్లా వణికిపోతూ, గుర్రాన్ని ముందుకు దూకించ బోయేంతలో వింత జంతువు ఒక్క ఎగురున ముందుకు వచ్చి, తన ఒంటి కొమ్ముతో దాన్ని గుండెల్లో పొడిచింది. గుర్రం పక్కకు ఒరిగిపోయింది. దాని మీదినుంచి కిందికి దూకబోయిన సేనానిని, అతడు నేలను తాకక ముందే వింతజంతువు వెన్నులో గట్టిగా పొడిచింది.

"రక్షించండి, రక్షించండి, రాకాసి గుర్రం!" అని కేకలు పెడుతూ చావు తప్పించుకున్న భటుడు బ్రహ్మపురం చేరాడు. వాడు రాజవీధి వెంట ఇలాగే అరుస్తూపోవటం చూసిన జనులు, వాడికేదో పిచ్చెక్కిందనుకున్నారు. వాడు కోటద్వారం చేరి, అక్కడ కాపలా వున్న భటులను చూస్తూనే, "మన సేనాని చచ్చాడు, గుర్రం చచ్చింది. మన తోటివాడు చచ్చాడు, వాడి గుర్రమూ చచ్చింది. అందర్నీ ఆ రాకాసి గుర్రం పీక్కు తింటున్నది!" అని మరింత బిగ్గరగా అరిచాడు.

కాపలా భటులు చేతుల్లో వున్న ఈటెలు అడ్డం పెట్టి గుర్రాన్ని ఆపి, వాణ్ణి బలవంతంగా దాని మీదినుంచి కిందికి దించారు.









వాడు కిందికి దిగి యింకా కేకలు పెడుతూనే వున్నాడు. కాపలావాళ్లలో ఒకడు వాడి గుండెలమీద ఈటె ఆనించి, "ఇంక అరిచావే, పొడిచేస్తాను, జాగ్రత్త! సేనా నాయకుడెక్కడ?" అని గద్దించి అడిగాడు.

"ఇంకెక్కడి సేనానాయకుడు! అరణ్యంలో ఆయన్ని, మన భటుల్ని ఒంటికొమ్ము రాకాసిగుర్రం తినేసింది. నేను ప్రాణాలతో పారిపోయివచ్చాను," అన్నాడు భటుడు ఆయాసపడుతూ.

అంతలో అక్కడికి కాపలావాళ్ల నాయకుడు వచ్చాడు. అతడికి భటుడి వాలకం చూడగానే, వాడికి పిచ్చెత్తిందన్న నమ్మకం కలిగింది. కాని, వాడు ఉదయం సేనానాయకుడితో కలిసి అడవికి వేటకు వెళ్ళాడన్న సంగతి అతడికి గుర్తొచ్చింది.

"పిచ్చిగా కేకలు పెట్టకుండా, నిజంగా జరిగిందేమిటో చెప్పు. మహా సేనాని ఇంకా అడివిలోనే వున్నాడా?" అని అడిగాడు కాపలావాళ్ల నాయకుడు.

"అది రాకాసిగుర్రం! సేనానాయకుణ్ణి బొమికకూడా మిగల్చకుండా తినేసి వుంటుంది!" అన్నాడు భటుడు.

ఆ జవాబు వింటూనే కాపలావాళ్ల నాయకుడు పక్కన వున్న వాడి దగ్గిర్నుంచి ఈటె లాక్కుని, భటుణ్ణి పొడిచేందుకు పైకెత్తాడు. భటుడు ప్రాణభయంతో కంపించిపోతూ, "చంపేస్తున్నాడు, రక్షించండి!" అంటూ గావు కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే రాజభవనం రెండో అంతస్తులోని గది నుంచి మంత్రి బయటికి వచ్చి, "ఎవర్రా, ఆ కేకలు పెట్టేది?" అని కోపంగా ప్రశ్నించాడు.

"అయ్యా, వీడికి మతి చెడింది. సేనానాయకుణ్ణి అడివిలో ఒంటికొమ్ము రాకాసి గుర్రం చంపి తిన్నదని కేకలు పెడుతున్నాడు," అన్నాడు కాపలావాళ్ల నాయకుడు.









"అలాగా! వాణ్ణి నా దగ్గరకు పంపకండి!" అంటూ మంత్రి గదిలోకి వెళ్ళిపోయాడు.

భటుడు గది వాకిలిని సమీపించగానే మంత్రి నవ్వుతూ అతడికేసి చేయివూపి, "భయపడకుండా జరిగిందేమిటో వివరంగా చెప్పు," అన్నాడు.

భటుడు కాస్త స్థిమితపడి, అరణ్యంలో కాపుయువకుడు కేశవుడు కనబడటం దగ్గర నుంచి, సేనాని ఆ వింతజంతువును అపహరించి బయలుదేరటం, ఆ తరవాత దారిలో అది ముందు భటుణ్ణి, తరవాత సేనానిని చంపటం, తను పారిపోయిరావటం...అంతా వివరంగా చెప్పాడు.



మంత్రి కొంతకాలం ఆలోచిస్తూ వూరుకుని, "అయితే, ఆ యిద్దర్నీ వింతజంతువు చంపుతూండగా నువ్వు చేతులు కట్టుకుని దూరంగా నిలబడ్డావన్నమాట! నీకు ప్రాణభయం కలగలేదా?" అని అడిగాడు.

"ప్రాణభయమా! నా పై ప్రాణాలు పైనే పోయినై. నా తోటి భటుణ్ణి చంపేందుకు ఆ వింతజంతువు ఎగరగానే నేను అరణ్యానికి అడ్డం పడి పారిపోయి వచ్చాను," అన్నాడు భటుడు.

"అయితే, సేనాని చావటం నువ్వు చూడలేదన్నమాట!" అన్నాడు మంత్రి.

"అయ్యో, కంటితో చూడకపోతేనేం? 'చచ్చాను, రక్షించండి' అంటూ మహాసేనాని గావుకేకలు పెట్టటం నాకు వినిపించింది," అన్నాడు భటుడు.

భటుడి జవాబుకు మంత్రి నవ్వి, "అది ఏలో నువ్వేదో పిచ్చిపుచ్చకాయ తిన్నట్టుంది. నిజంగా సేనాని మరణించివుంటే, దానికి కారణం నువ్వు చెప్పినట్టు వింత జంతువుకాదు. అలాంటి జంతువు లోకంలో ఎక్కడా వుండదు. ఆ కాపు యువకుడు కేశవుడన్నావే...వాడు విలువిద్య నేర్చిన వాడు గదా? సరే, భటుల్ని కొందరిని అరణ్యానికి పంపి జరిగిందేమిటో తెలుసు









కుంటాను. దారి చూపవలసిన వాడివి నువ్వు!" అన్నాడు.

"అయ్యో, చిత్తం, చిత్తం!" అంటూ భటుడు తల వూపాడు. కాని, వాడికి అరణ్యం పేరు చెపితేనే గుండెదడ పుట్టుకొస్తున్నది. అయినా, మంత్రి ఆజ్ఞను ధిక్కరించేందుకు లేదు.

మంత్రి కోటద్వారం కావలావాళ్ల నాయకుణ్ణి పిలిచి, అడవిలో సేనాని కోసం వెదకవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు.




ఈలోగా నగరంలో సేనాని దుర్మరణాన్ని గురించి రకరకాల వార్తలూ ప్రచారం కాసాగినై. రాజవీధి వెంటవస్తూ భటుడు పెట్టిన గావుకేకలు చాలామంది ప్రజలు వినివున్నారు. ఏదో అపూర్వమైన వింతజంతువు...ముఖాన ఒంటికొమ్ము... పెద్దపెద్ద రెక్కలూ గలది...అరణ్యానికి వేటకు వెళ్ళిన సేనానిని పట్టుకుని ఆకాశానికి ఎత్తుకుపోయిందనికూడా పిలివార్తలు బయలుదేరినై.

పాలమ్మటానికి నగరానికి వచ్చిన కేశవుడి తండ్రి ఈ పుకార్లన్నీ విన్నాడు. అతడికి రాత్రి తన కొడుకు చెప్పిన వింత జంతువు సంగతి గుర్తు కొచ్చింది. సేనాని అంత వాణ్ణి చంపిన ఆ క్రూరజంతువు, తన కొడుకును మాత్రం ప్రాణాలు తీయకుండా వదులుతుందా?

ముసలివాడి మనసు ఇలాంటి అనుమానాలతో చీకాకైపోయింది. అతడు నగరాన్నించి హడావిడిగా తన ఇంటికి బయలుదేరాడు. సరిగా అతడు నగరద్వారం దాటుతూండగా మరి ఆశ్చర్యకరమైన పుకారు వినవచ్చింది: అరణ్యంలో ఆలమందలు కాయకు బతుకుతున్నట్టు నటిస్తున్న, ఒక శత్రుదేశపు గూఢచారి, సేనానాయకుణ్ణీ, అతడి వెంటవున్న భటుణ్ణీ చంపివేశాడట! అతణ్ణి వీలైతే ప్రాణాలతో పట్టుకురావలసిందిగా మంత్రి భటుల్ని పంపుతున్నాడు.






ఈ వార్త విన్నమీదట ముసలివాడికి నిజంగానే తన కొడుకు ప్రాణానికి ముప్పు వాటిల్లనున్నదని భయం కలిగింది. ఈపాటికే అతన్ని వింతజంతువు చంపివుండకపోతే, ఇంగితజ్ఞానంకూడాలేని మంత్రి పంపిన భటులు అతన్ని గూఢచారిగా భావించి తప్పక చంపుతారు. తను ముందుగా వెళ్లి అక్కడి పరిస్థితి ఎలావుందో చూసి, తన కొడుకును హెచ్చరించాలి.

ముసలివాడు ఆగమేగాలమీద అరణ్యం లోని తన పూరిపాక చేరాడు. అక్కడ ఎవరూ లేరు. ఎందుకైనా మంచిదని ఎంతో కాలంగా గోడకు తగిలించి వున్న తన తండ్రి కాలంనాటి కత్తిని తీసుకుని, తన కొడుకు ఆలమందను మేపే కొండ ప్రాంతానికి బయలుదేరాడు.

కేశవుడు మామూలుగా రోజూ కూచునే చెట్టు కింద కనిపించే సరికి ముసలివాడికి ప్రాణంలేచి వచ్చినట్టయింది. అతడు పరిగెత్తుతూ కొడుకును సమీపించి, "కేశవా! నిన్ను ప్రాణాలతో చూడగలుగుతాననుకో లేదురా, బాబూ! నగరంలో చాలా చాలా పుకార్లు బయలుదేరినై. అసలు నిజంగా యిక్కడ జరిగిన సంగతేమిటి?" అని ఆదుర్దాగా అడిగాడు.

తండ్రి ఆదుర్దా, అతడి చేతిలోని కత్తి కేశవుణ్ణి చాలా ఆశ్చర్యపరిచినై. నగరంలో బయలుదేరిన పుకార్లేమిటో అతడికి అర్థం కాలేదు. అతడు తండ్రికేసి విహ్వలంగా చూస్తూ, "కత్తి తెచ్చావెందుకు? పుకార్లేమిటి?" అని ప్రశ్నించాడు.

"బ్రహ్మపురం సేనానాయకుణ్ణీ, అతడి వెంట వున్న భటుణ్ణీ, ఒక వింతజంతువేదో అరణ్యంలో చంపిందని నగరంలో పుకారుగా వుంది. మారువేషంలో వున్న శత్రుదేశపు గూఢచారి అతన్ని చంపాడని మరికొందరు చెప్పుకుంటున్నారు." అన్నాడు తండ్రి.

—(ఇంకా వుంది)






## 3

[కేశవుడి ఆలమందలోకి చొచ్చిన వింత జంతువు బ్రహ్మపుర సేనానిని వెంటవున్న భటుల్లో ఒకణ్ణి చంపింది. బతికి బయటపడిన రెండో భటుడు నగరానికి పారిపోయాడు. నగరంలో రకరకాల పుకార్లు బయలుదేరినై. ఈ వార్తలన్నీ విన్న కేశవుడి ముసలి తండ్రి అరణ్యానికి వచ్చి కొడుకుతో ఆ సంగతులన్నీ చెప్పాడు. తరవాత—]

తండ్రి మాటలు వింటూనే కేశవుడు ఉలిక్కిపడ్డాడు. అతడు అంతదూరంలో మేస్తూవున్న వింతజంతువు కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "అయ్యో, ఇప్పుడు అంతా అర్థమైంది. రాత్రి నేను చెప్పిన వింతజంతువు యిదే! దాని కొమ్ముకేసి చూడు. ఎంత నెత్తురు గడ్డకట్టి వున్నదో!" అన్నాడు.

ముసలివాడు కొడుకుతో మాట్లాడే హడావుడిలో యింతవరకూ ఆ వింతజంతువు కేసి చూడలేదు. ఇప్పుడు అతడి దృష్టి దాని మీద పడింది. అతడు నివ్వెరపోయాడు. కేశవుడు తండ్రిని దాని దగ్గిరకు తీసుకుపోయి, దాని కొమ్ముకేసి వేలు చూపుతూ, "చూశావా, నెత్తురు! ముఖానకూడా... ఇదుగో ఇక్కడా... ఇక్కడా—ఇవి నెత్తురు మరకలు!" అన్నాడు.

"అయితే నగరంలో పుట్టిన పుకారు అబద్ధంకాదు. ఇది సేనానాయకుణ్ణీ, వెంటవున్న భటుణ్ణీ పొడిచి చంపింది. రాజభటులు అరణ్యానికి వస్తున్నారు. నువ్వు









"సరే, తప్పు ఎవరిదైతేనేం? రాజ భటులు వస్తే మనకు ముప్పు తప్పదు. నువ్వు ఎక్కడైనా పారిపో. ఇదుగో కత్తి. నీ తాత చనిపోయినప్పటి నుంచీ యిది గోడకు వేలాడుతున్నది. ఇది, నీ దగ్గిరవున్న బాణాలూ, నీ ఆత్మరక్షణకు ఉపయోగిస్తవి. రాజభటులకు బందీగా చిక్కి అవమానం పాలయేకన్న, ఆత్మరక్షణ చేసుకుంటూ అవసరమైతే ప్రాణాలు వదలటం ఉత్తమం!" అన్నాడు తండ్రి.

కేశవుడు తండ్రి దగ్గర నుంచి కత్తి తీసుకుంటూ, "నీ మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"నా మాటకేం? నా రక్షణ నేను చూసుకోగలను. కాకపోయినా ముసలివాణ్ణి, వెయ్యేళ్లు బతకబోవటంలేదు గదా. నేనూ, రాజభటుల కంట పడకుండా దాక్కుంటాను. అలమందను అరణ్యం మధ్యకు తరిమేస్తాను. అది వాళ్ల కంటపడకూడదు." అన్నాడు ముసలివాడు.

వాళ్లిద్దరూ యిలా మాట్లాడుకుంటూ వుండగా, అరణ్యంలో ఎక్కడో గుర్రాలూ, మనుషులూ కదులుతున్న కలకలం వినబడింది. ముసలివాడు కొడుకుకేసి ఆదుర్దాగా చూశాడు. కేశవుడు చప్పున వింతజంతువు

మారువేషంలోవున్న శత్రుదేశపు గూఢచారివని ఎవరో ఒక నీలివార్త వేశారు. భటుల వల్ల నీకు అపాయం తప్పదు." అన్నాడు ముసలివాడు నిస్పృహగా.

"ఇందులో నా నేరం ఏమీలేదు. సేనానాయకుడు కోరి కొరివితో తల గోక్కున్నాడు. ఈ వింతజంతువును బలవంతంగా మెడకు ఉచ్చువేసి పట్టుకుపోయాడు. బహుశా అది వాణ్ణి చంపి తిరిగి యిక్కడికి పారిపోయి వచ్చివుంటుంది. కొమ్ము నుంచి ఓడుతున్న నెత్తురుతో అది తిరిగిరావటం చూస్తేనే, ఏదో ప్రమాదం జరిగిందను కున్నాను." అన్నాడు కేశవుడు.









దగ్గిరకు వెళ్ళి దాని జూలు పట్టుకుని, "నేను రాక్షసుల చేతచిక్కకుండా పారిపోవాలంటే, ఏనీ మీద ఎక్కి సవారీ చేయక తప్పదు. నా దగ్గిర ఎందుకనో యిది చాలా సాధువుగా ప్రవర్తిస్తున్నది." అంటూ ఎగిరి దానిమీద కూచున్నాడు.

వింతజంతువు కళ్ళు అదోలాగా మెరిసినై. "ఊం, పరిగెత్తు. నీ యిష్టం వచ్చిన ప్రదేశానికి నన్ను తీసుకుపో," అంటూ కేశవుడు దాని జూలు పట్టుకుని లాగి, మడమల్తో డొక్కలో గట్టిగా పొడిచాడు. అది తుఫాను వేగంతో కొండకేసి పరిగెత్తసాగింది.

వింత జంతువు వేగానికి కేశవుడు భయపడి పోయాడు. తను ఎక్కడ పట్టుతప్పి కొండ రాళ్ళమీదపడి తునాతునియలై పోతానో అని అతడు కంగారుపడసాగాడు. వింత జంతువు పక్షిలా ఒక రాతిమీది నుంచి ఇంకొక రాతి మీదికి ఎగురుతూ కేశవుణ్ణి కొండ శిఖరానికేసి తీసుకు పోసాగింది.

ఆ కొండ ప్రదేశమంతా మహా భయంకరంగావున్నది. కొండమీద పొదలూ, పెద్ద పెద్ద చెట్లూ, గుహలూ—వాటిమీద కాలాడుతూ తిరిగే చిరతపులులూ, ఎలుగుబంట్లూ, మహా సర్పాలూ—వీటిని చూస్తూనే కేశవుడు తన ప్రాణాలమీద ఆశ వదులుకున్నాడు. ఈ క్రూరజంతువుల బారినబడి దిక్కులేని చావు చచ్చేకన్న, బ్రహ్మపుర సైనికులకు చిక్కి కారాగారంలో మరణించటం అతడికి సుఖంగా వుండేటట్టు కనబడింది.

"ఈ వింత జంతువు నన్ను మోసం చేసింది!" అనుకున్నాడు కేశవుడు. కాని అంతలోనే అతడికి జంతువు మోసంచేయుట మేమిటా అన్న సంశయం కలిగింది. తన తండ్రి చెప్పినట్టు యిదేమైనా మాయా రక్కసేమో అనుకున్నాడు కేశవుడు. ఏది ఏమైనా తను యిప్పుడు చేయగలిగిందేమీ లేదు. వింత జంతువు తనను ఎక్కడికి







తీసుకుపోతే అక్కడికి వెళ్ళవలసిందే. తన చేతిలోవున్న కత్తితో దాన్ని అప్పటికప్పుడు మెడనరికి చంపినా, తను క్రూరమృగాల మధ్య వుండిపోవలసి వస్తుంది. వాటినుంచి ప్రాణాలతో బయటపడటం అసాధ్యం.

కేశవుడు యిలాంటి భయాందోళనలతో ఉక్కిరి బిక్కిరవుతుండగా, వింత జంతువు ఒక ఎత్తయిన రాతిమీది నుంచి పల్లంలోకి దూకి, ఎదురుగావున్న గుహ ముందు చప్పున ఆగి పెద్దగా సకిలించింది. ఆ వెంటనే చీకటి గుయ్యారంగావున్న గుహలో మినుకు మినుకుమంటూ చిన్న కాంతి కనబడి, అంతలో పెద్ద కాగడా వెలుగూ, నల్లని



పొగా...హాం హ్రీం ఫట్ ఫట్ హుం అన్న భీకరమైన గొంతూ వినిపించింది. కేశవుడు నిలువెల్లా వణికి పోయాడు. మరుక్షణంలో అతడు ఒరనుంచి కత్తిదూసి, వింత జంతువు మీది నుంచి కిందికి దూకాడు.

గుహ మళ్ళీ ఎప్పటిలా చీకటి మయమై పోయింది. వెలుగూ, పొగా మటుమాయమయినై. మంత్రం పఠిస్తున్న గొంతుకూడా ఆగి పోయింది. అంతా నిశ్శబ్దం. ఈ వింత మార్పు కేశవుణ్ణి ఆశ్చర్యపరిచింది. గుహలో ఎవడోవున్నాడు, వాడు రాక్షసుడు కావచ్చు, మాంత్రికుడు కావచ్చు లేక నరమాంస భక్షకుడైన అడివిమనిషి కావచ్చు!

కేశవుడు ఒక్క త్రుటికాలంలో ఓ నిర్ణయానికి వచ్చాడు. గుహలోవున్న వాణ్ణి తను చీకటివల్ల చూడలేక పోయాడు గాని, వాడు వెలుగులోవున్న తనను చూసి వుంటాడు. తనను సునాయాసంగా పట్టుకునేందుకు వాడేదో పన్నాగం వేస్తున్నాడనే దాంట్లో సందేహం లేదు. కనక తను సాధ్యమైనంత వేగంగా అక్కణ్ణించి పారిపోవాలి. కేశవుడు యిలా అనుకుంటూనే వింత జంతువు కోసం చూశాడు. కాని అది అతడికి అందుబాటులో లేదు. అల్లంతదూరాన ఒక రాతి నానుకుని నిలబడి, ఎదురుగావున్న











మరో బండరాయిని కొమ్ముతో కుమ్ముతున్నది. కేశవుడు ఒక్క పరుగున వెళ్ళి దానిని పట్టుకునేందుకు ముందుకు దూకాడు. కాని కేశవుడు సమీపించేలోపల వింత జంతువు ఛెంగున ఎగిరి బండరాయి మీద నిలబడింది.

కేశవుడిలో కలిగిన నిరాశ అంతాయింతా కాదు. సరిగ్గా ప్రాణాపాయం కలిగే సమయంలో వింత జంతువు తనకు అందకుండా పోయింది. కాలినడకను అక్కణ్ణించి పారిపో ప్రయత్నించటం క్షేమం కాదు. రాళ్ళ చాటున పొంచివున్న ఏ క్రూరమృగమైనా తనను యిట్టే పట్టుకుని చంపి తినగలదు.

ఇప్పుడేం చేయాలి? కేశవుడు గుండె రాయి చేసుకున్నాడు. కత్తివున్న చేతిలోనే కొన్ని అంబులుకూడా పట్టుకుని, ఎడమ చేతితో విల్లు పట్టుకుని అతడు జాగ్రత్తగా గుహ ముందు నుంచి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు.

హఠాత్తుగా గుహలో పెద్ద కాంతి కనిపించింది. ఆ వెలుగులో కేశవుడికి సన్నని పొడవాటి గడ్డం, నల్లని ముఖం, నెత్తిమీద కుచ్చుకట్టిన శిరస్త్రాణం గల ఒక వికృతాకారుడు కనిపించాడు. అతణ్ణి చూస్తూనే కేశవుడు నిలుచున్నచోట ఆగిపోయాడు.

"వత్సా, భయపడకు, భయపడకు, అభయ మిస్తున్నాను! నిన్నేకాక, నీ ముసలి తండ్రినికూడా దుర్మార్గులైన రాజ భటుల నుంచి కాపాడేభారం నాది!" అంటూ ఆ వికృతాకారుడు గుహ లోపలినుంచి బయటికి వచ్చాడు.

ఆ వికృతాకారుడి మాటలు కేశవుడి శరీరాన్ని జలదరింపచేసినై. "ఎవడో గాని నా గురించి సర్వం తెలుసుకున్నాడు," అనుకున్నాడతడు. ఇప్పుడు తను పారిపోయే ప్రయత్నం చేయటం వృథా. అందువల్ల మేలుకన్న కీడే ఎక్కువ కలగవచ్చు. ఎంతో ప్రేమ కనబరుస్తున్న ఈ వికృతా









కారుడు తన నుంచి ఎలాంటి సహాయం ఆశించి తననూ, తన తండ్రిని రాజభటుల నుంచి కాపాడగలనని అభయమిస్తున్నాడు?

"వత్సా, నువ్వు నా శక్తి సామర్థ్యాలను శంకిస్తున్నావా? ఇటురా, గుహలోకి రా!" అంటూ వికృతాకారుడు వెనుతిరిగి గుహలోకి వెళ్ళబోయేవాడల్లా ఆగి, కదలక నిలబడివున్న కేశవుణ్ణి పరీక్షగా చూస్తూ, "నా వెంట గుహలోకి వచ్చేందుకు భయమా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న కేశవుడికి కోపం తెప్పించింది. తననేదో పిరికిపంద కిందకట్టి వీడు మాట్లాడుతున్నాడన్న అభిప్రాయం కలగగానే, కేశవుడు ధైర్యంగా ముందుకు నడుస్తూ, "నీ వెంట గుహలోకికాదు మరెక్కడికి రమ్మన్నావస్తాను. అడవిలోపుట్టి అడవిలో పెరిగినవాణ్ణి. భయం అంటే ఏమిటో నాకు తెలీదు. పోతే, నన్ను బాధిస్తున్న సంశయం ఏమిటంటే, నీకు నా గురించీ, నా తండ్రిని గురించీ ఎలా తెలుసా అని!" అన్నాడు.

"అంతేనా? అయితే గుహలోకిరా, సంశయ నివారణ చేస్తాను. గుహలోవున్న కాలభైరవుడి కళ్ళల్లోకి తొంగి చూశావంటే, లోకంలో ఎక్కడ ఏమి జరుగుతున్నదీ నీవు తెలుసుకోవచ్చు," అన్నాడు వికృతాకారుడు.



కేశవుడు అతడి వెంట గుహలోకి వెళ్లాడు. గుహ లోపల అంతా చీకటిగా వున్నది. ఆ చీకటిలో ఓ పదడుగులు నడిచిన తరవాత పక్కగా కొండరాతిలో తొలిచిన చిన్న బిలం ఒకటి కనిపించింది. అందులో అంత ఎత్తున్న ఒక కుక్క ఆకారం—రాతిలో మలిచినది వున్నది. దాని రెండుకళ్ళూ నిప్పు కణాల్లా మెరుస్తున్నవి.

"వీడే కాలభైరవుడు! ఉపాసకుల ఊడలమర్రి, శత్రులపాలిట బ్రహ్మ బిముడు! జై కాలభైరవా!" అంటూ వికృతాకారుడు మునివేళ్ళతో విగ్రహం కళ్ళను ఒకసారి తాకి, చప్పున వెనకడుగు వేస్తూ,







"కేశవా, ఇప్పుడు కాలభైరవుడి కళ్ళల్లోకి చూడు! అడుగో నీ తండ్రి, అవిగో నీ ఆల మందలు! రాజ భటులను చూశావా... విచ్చుకత్తులతో, అహ్హాహ్హా!" అంటూ బిగ్గరగా నవ్వసాగాడు.

కేశవుడు ముందుకు వంగి కాలభైరవుడి కళ్ళల్లోకి చూశాడు.

కేశవుడి ముసలి తండ్రి గుబురుగా వున్న ఒక చెట్టుకొమ్మల్లో కూచునివున్నాడు. ఆవులు అడవిలో చెల్లా చెదురుగా పరిగెత్తుతున్నవి. వాటిని అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టుతూ రాజభటులు గుర్రాలమీద తరుముకు వస్తున్నారు.

ఆ దృశ్యం చూస్తూనే కేశవుడికి ఎక్కడ లేని విచారం కలిగింది. తన తండ్రి ప్రాణభయంతో చెట్టుమీద దాక్కున్నాడు. తన ఆలమందను రాజభటులు పట్టుకు పోవాలని చూస్తున్నారు. ఆ పశువులు లేకపోతే తన తండ్రి అడవిలో ఆకూ అలమూ తిని బతకవలసిందే. సమయానికి తను ఈ కొండ మీద చిక్కుకు పోయాడు!

వికృతాకారుడు కేశవుడి మనోభావాలు తెలిసినవాడిలా నవ్వుతూ, "దిగులుపడకు కేశవా! నీ తండ్రినీ, నీ ఆలమందనూ కాపాడే భారం నాది," అంటూ గుహలో నుంచి బయటికి వచ్చి, "శిష్యా, శిష్యా, ఎక్కడ? నువు వెళ్ళి ఆ రాజభటులను తరిమి, మన కేశవుడి తండ్రినీ, ఆలమందనూ కాపాడు!" అంటూ కేకపెట్టాడు.

కాలభైరవుడి కళ్ళల్లోకి చూస్తున్న కేశవుడి దృష్టికి ఒక వింత దృశ్యం కనిపించింది. మనిషి తలా, గబ్బిలంలా రెక్కలూ వున్న ఒక నల్లని పెద్ద ఆకారం అడవిలో రాజభటుల తలల మీద ఎగురుతూ పల్టీలు కొట్ట సాగింది. ఆ భీకర స్వరూపాన్ని చూస్తూనే రాజభటులు, ప్రాణభయంతో కీచుకీచు మని అరుస్తూ అడవికి అడ్డంపడి పారిపోసాగారు. —(ఇంకా వుంది)





సంశయ నివారణ చేసుకోవాలి," అన్నాడు మాంత్రికుడు.

ఆ పనికి కేశవుడికి మాంత్రికుడి మీద ఎంతో కృతజ్ఞతాభావం కలిగింది. రాజ భటుల పాలపడకుండా తన తండ్రిని అతడు కాపాడాడని కేశవుడు నమ్మాడు. ఆ కారణంవల్ల మాంత్రికుడు అడగటమే తడవుగా అతడు భుజంమీది నుంచి అంబుల పొదిని పక్కకు లాగాడు. మాంత్రికుడు కేశవుడి భుజాన్ని కొద్దిసేపు కన్నార్పకుండా చూసి, "ఆహాహా! వత్సా, అదృష్టవంతుడివి. ఇది అమోఘమైన జాతకం. నీ దెబ్బకు తిరుగులేదు. మూపుమీద మహారాజ



యోగాన్ని చూస్తూ, ఈ లోకంలోకి వచ్చావు!" అంటూ కేశవుడి వీపు చరిచి, "అయినా, అవగింజంత సంశయం మాత్రం ఎందుకుండాలి? ఇప్పుడే తేల్చుకుందాం," అంటూ గుహ నుంచి బయటికి వెళ్ళాడు.

మాంత్రికుడికి అంత ఆనందాన్ని కలిగించిన విశేషం ఏమిటో చూసేందుకు కేశవుడు తన భుజాన్ని ముందుకు వంచి పరీక్షించాడు. అక్కడ ఏవిధమైన పుట్టుమచ్చలుగాని, ఇతర గుర్తులుగాని అతడికి కనిపించలేదు. తన కళ్ళకు కనిపించని గుర్తులేవో మాంత్రికుడికి కనిపించి వుండవచ్చని కేశవుడు అనుకుంటున్నంతలో, మాంత్రికుడు ఏదో ఆకులను అరచేతిలో నలుపుతూ అక్కడికి వచ్చి, "వత్సా, ఆ పుట్టుమచ్చ నీ కంటికి కనబడేదికాదు. ఇదిగో, ఈ ఆకు పసరు రాయనీ. నువ్వు కూడా దాన్ని చూడవచ్చు," అంటూ పసరును కేశవుడి భుజానికి రాశాడు.

పసరు తగలగానే కేశవుడి భుజంమీద పడగవిప్పిన నల్లనిపాము ఆకారం ఒకటి కనిపించింది. దాన్ని చూస్తూనే మాంత్రికుడు బ్రహ్మానందం పొంది, "వత్సా, కేశవా! ఇక మనకు వశ్యంకాని శక్తి అంటూ ఏదీలేదు. కాలభైరవుడు, ఆది భైరవుడు, ఉన్మత్త



భైరవుడు... అందరూ మన యింటి పాలేళ్ళు కాబోతున్నారు," అని పెద్దగా మంత్రం జపిస్తూ కాలభైరవుడి విగ్రహం ముందు సాష్టాంగపడి, చూస్తూండగానే ఉపాసనా తన్మయత్వంలో కళ్ళు మూశాడు.

కేశవుడు మాంత్రికుడు కళ్ళు తెరుస్తాడేమో అని చూస్తూ అక్కడే నిలబడ్డాడు. కాని, పావుగంట కాలం గడిచినా అతడిలో చలనం కనిపించలేదు. కేశవుడికి ఎందుకో హఠాత్తుగా భయం కలిగింది. ఒకవేళ మాంత్రికుడు తనను కాలభైరవుడికి బలి చెయ్యటానికి తెచ్చాడేమో అనుకున్నాడు. ఈ అనుమానం కలగ్గానే కేశవుడు అప్రయత్నంగా తన ఆయుధాలకోసం చూశాడు. కత్తి, విల్లంబులూ గుహ వాకిలి దగ్గిర అతడికి కనిపించినై. కేశవుడు ఒక్క దూకున అక్కడికి వెళ్ళి, వాటిని తీసుకునేందుకు వంగాడు. అంతలో, "ఆగు, కేశవా, తొందరపడకు!" అన్న హెచ్చరిక అతడికి వినిపించింది. కేశవుడు తల ఎత్తి ముందుకు చూశాడు. ఎదురుగా [illegible] యువకుడొకడు నిలబడి వున్నాడు.

"నువ్వెవరివి? ఇక్కడికెలా వచ్చావు?" అన్నాడు కేశవుడు ఆశ్చర్యంగా.



"నేను బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుణ్ణి. నేను ఎక్కడినుంచీ రాలేదు, ఇక్కడే వుంటాను," అన్నాడు యువకుడు.

"ఎవరు బ్రహ్మదండి మాంత్రికుడు?" అని అడిగాడు కేశవుడు.

"ఓయి అమాయకుడా, ఆ మాత్రం అర్థం కాలేదా?" అంటూ యువకుడు కాలభైరవుడి విగ్రహం ముందు సాష్టాంగపడి వున్న మాంత్రికుణ్ణి చూపించాడు.

"హఠాత్తుగా ఆకాశం నుంచి ఊడి పడ్డట్టు నువ్వు కనబడటంతో నేను కాస్త భయపడ్డాను, సుమా!" అన్నాడు కేశవుడు కత్తినీ, విల్లంబులనూ తీసుకుంటూ.








# 5

[వింతజంతువు ఆకారంలో వచ్చిన మాంత్రికుని శిష్యుడైన జయమల్లుద్వారా, కేశవుడు చాలా విషయాలు తెలుసుకున్నాడు. తన మంత్రశక్తి చేత భూకంపం తెప్పించాననీ, బ్రహ్మదండి మాంత్రికుడు కేశవుడితో అన్నాడు. తరవాత తన శిష్యుణ్ణి పిలిచి, ఏనుగుల కొలనులో కేశవుణ్ణి స్నానం చేయించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడి ఆజ్ఞ వింటూనే జయమల్లు కేశవుడి చేయి పట్టుకుని అక్కణ్ణించి నడిపించాడు. "అంతా నాకు అయోమయంగా వున్నది. ఇంత పెద్ద కొండను తన మంత్రశక్తి చేత ఈ బ్రహ్మదండిగాడు ఊగించ గలిగాడంటె ఎలా నమ్మటం?" అన్నాడు కేశవుడు.

"వాడు మంత్రశక్తి చేత భూకంపం తెప్పించాడంటె నేనూ నమ్మను. నా అనుమానం కొండ కింద గంధకంలాటి పదార్థమేదో వున్నదని. ఆ కారణంగా కొండ అప్పుడప్పుడూ అదరటం జరగవచ్చు. అలాంటి సమయాల్లో బ్రహ్మదండి అందుక్కారణం తన మంత్రశక్తి అని ప్రగల్భాలు కొడుతున్నాడేమో. ఏది తేల్చి చెప్పటం కష్టం," అన్నాడు జయమల్లు.

ఆ సరికి యిద్దరూ కొండ మీద పల్లంగా వున్న ప్రదేశంలో గల ఒక కొలను దగ్గిరకు







వచ్చారు. వాళ్ళు కొలనును సమీపిస్తుండగానే, దాని అంచున వున్న గుహలలో నుంచి సింహగర్జన వినిపించింది. ఆ వెంటనే జూలు ఆడిస్తూ ఒక సింహం గుహ నుంచి బయటికివచ్చి, మరింత పెద్దగా గర్జనచేస్తూ ఒక రాతి మీదికి ఎగిరి నిలబడింది.

"ఇదే ఏనుగుల కొలను, ఆ మెరుగుతున్నదే మచ్చల సింహం!" అంటూ జయమల్లు పెద్దగా నవ్వాడు.

"అన్నీ వింతలే! ఈ సింహానికి ఆహారం వెయ్యటానికి బ్రహ్మదండి మాంత్రికుడు నన్ను యిక్కడికి పంపలేదుగదా?" అనుకుంటూ కేశవుడు అనుమానంగా జయ



మల్లుకేసి చూశాడు. జయమల్లు తల ఎత్తి మచ్చల సింహంకేసి చూస్తున్నాడు. సింహం కోరలు చాచి, పంజా ఎత్తి కర్ణకఠోరంగా గర్జించసాగింది.

కేశవుడు సింహంకేసి ఓ క్షణకాలం పరిశగా చూశాడు. అది ఏ నిముషాన్నయినా రాతిమీది నుంచి దూకి తన మీదికి లంఘించవచ్చని అతడికి అనుమానం కలిగింది.

కేశవుడు యిలా ఆలోచిస్తూనే విల్లందుకుని పైకెత్తి మచ్చల సింహం తలకు బాణాన్ని గురిపెట్టాడు. అతడు వింటి తాడును బాగా లాగి బాణం వదలబోతున్నంతలో జయమల్లు, "హ్రీంకారి... హుంకారి... మృగశక్తి కట్టు..." అంటూ చప్పున కేశవుడికేసి తిరిగి, "ఏమిటి, నువ్వు చెయ్యబోతున్నది? నీ బాణంతో సింహాన్ని చంపగలనని అనుకుంటున్నావా? నేను కట్టుమంత్రం వేసి దాని నోరు మూయబోతున్నాను. అయినా సరే చూదాం, బాణం వదులు!" అన్నాడు పెద్దగా నవ్వుతూ.

కేశవుడు బాణాన్ని సింహం తలకు గురిచేసి వదిలాడు. బాణం రివ్వుమంటూపోయి దాని తలను తాకుతూనే గర్ర్ మంటూ కక్కింది, అంతదూరం గాలిలోకి ఎగిరి కొలనునీటిలో పడిపోయింది.









"మోసానా. ఏ జాలం ఒకటి వృథా అయింది తప్ప. సింహానికి ఏమీ ఉపశమనం కలిగి యినాలేదు. ఇది బ్రహ్మమంది మాంత్రికుని పెంపుడు సింహం. ప్రపంచంలో ఎక్కడా లేని ఈ మచ్చలసింహాన్ని తనే సృష్టించా నని వాడు చెప్పుకుంటాడు. కానీ నేను నమ్మను. వాడు మాంత్రికుడేగాని బ్రహ్మ దేవుడు కాడు గదా? దీన్ని చిన్నపిల్లగా వున్నప్పుడే పట్టుకుని పైన ఏ పసరుతోటో వర్ణాన్ని పుట్టిస్తుంటాడని నా అనుమానం." అన్నాడు జయమల్లు.

"అది అసంభవం. ఒక జంతువుకు మరో జంతువు చర్మాన్ని తెచ్చి కుడితే అది దాని శరీరంలో ఎలా కలిసిపోతుంది?" అన్నాడు కేశవుడు.

"అయితే, ఒకటి చేసివుంటాడు. ఇది చిన్నపిల్లగా వుండినప్పుడే దాని శరీరాన్ని అక్కడా యిక్కడా కాల్చివుంటాడు. అవి మానిన తరవాత మచ్చలయివుంటవి," అన్నాడు జయమల్లు.

"అలా జరిగితే జరిగుండొచ్చు. అయినా, ఈ చర్చ అంతా ఎందుకు? ఈ సింహం వల్ల నాకేమీ అపాయం లేదు గదా— ఆ మాట ముందు చెప్పు?" అన్నాడు కేశవుడు కొంచెం విసుగ్గా.

"అపాయం ఏమీలేదు! ఇన్నేళ్ళుగా మాంత్రికుడి కొలుస్తూ వుండి కనీసం మృగాలకైనా మంత్రకట్టు వెయలేనను కున్నావా? చూడు, దాని పోటు ఎలా తగ్గి పోయిందో. ఇంకా సెపటలో పిల్లిలా ఆ రాతిమీద బోర్లాపడుకుంటుంది." అన్నాడు జయమల్లు.

చూస్తూండగానే సింహం ఒక్కసారి గట్టిగా జూలు విదిలించి, ఆవలిస్తున్నట్టు పెద్దగా నోరు తెరిచి, బల్లిలా రాతిని అంటి పెట్టుకుని పడుకున్నది. కేశవుడు జయ మల్లు మంత్రశక్తికి ముగ్ధుడయాడు. నిజంగా వీడు తనకు స్నేహితుడైతే, బ్రహ్మ





కేశవుడు తన సందేహాల గురించి జయమల్లును అడుగుదామనుకున్నాడు. కాని, జయమల్లు కొలనులో చాలా దూరంపోయి గెంతులు కొడుతూ ఈతలు వేస్తున్నాడు. కేశవుడు మెల్లగా ఈదుతూ అతన్ని సమీపించి, తన సందేహాలను గురించి అడిగేందుకు పెదాలు కదిపేంతలో, కొలనుకు ఆ వైపునుంచి, రాళ్ళూరప్పులూ విరిగిపోతున్న ధ్వని, ఆ వెంటనే ఏనుగుల ఘీంకారాలూ వినిపించినై.

"ఏనుగుల మంద కొలనుకు వస్తున్నట్టున్నది?" అన్నాడు కేశవుడు.

"ఇది పెద్ద ఏనుగుల కొలను గదా, మరి యెండలో స్నానాలు చేసేందుకు ఏనుగులు రాక మరేం వస్తవనుకున్నావు?" అన్నాడు జయమల్లు నవ్వుతూ.

"అలా అయితే మనం త్వరగా యిక్కడ్నుంచి పారిపోవటం మంచిది. అవి వస్తే పడినట్టే, మనం వాటి కాళ్ళకింద తునాతునకలైపోతాం!" అంటూ కేశవుడు ఒడ్డుకేసి గబగబా ఈదసాగాడు.

జయమల్లు కేశవుడి భయంచూసి పెద్దగా నవ్వాడు. చూస్తూండగానే అయిదారు ఏనుగులు ఒకదాన్ని ఒకటి తోసుకుంటూ, తొండాలతో కొలను పక్కనవున్న చెట్ల

దండి మాంత్రికుడి నుంచి ప్రమాదం లేకుండా తేలిగ్గా పారిపోవచ్చుననుకున్నాడు.

జయమల్లు ఏనుగుల కొలనులో దిగి బుడుంగు బుడుంగుమని మునుగుతూ, "చూస్తావేం, కేశవా. దిగు, స్నానం చెయ్యి. మన కోసం బ్రహ్మదండి కని పెట్టుకుని వుంటాడు," అని కేకవేశాడు.

కేశవుడు విల్లంబుల్ని కొలను ఒడ్డున పడవేసి కొలను నీటిలో దిగి స్నానం చెయ్యసాగాడు. బహుశా తాను స్నానంచేసి శుచి అయిన తరవాత మాంత్రికుడు తనను కాల భైరవుడికి బలి యివ్వాలనుకుంటున్నాడని అతడికి తోచింది.







కొమ్ములను అలవోకగా పట్టివిడుస్తూ కొలను ఒడ్డుకు వచ్చినై. వాటిని చూస్తూనే జయమల్లు బుడుంగున నీటిలో మునిగి చప్పున పైకివచ్చి, పెద్దగా మంత్రం పఠిస్తూ, యింత బురదను ఏనుగులకేసి విసిరాడు. ఆ మరుక్షణం ముందువచ్చిన ఏనుగులూ, వాటిని అనుసరించి వస్తున్న మరికొన్ని ఏనుగులూ ఉన్నచోటునే కదలామెదలక స్థాణువుల్లా అయిపోయినై.

"చూశావా, మనశక్తి!" అంటూ జయమల్లు కేశవుడి కేసి పెద్ద కేకపెట్టి, నిదానంగా ఈదుకుంటూ కేశవుడున్న చోటికి వచ్చాడు. కేశవుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. నిజంగానే జయమల్లు గొప్ప మాంత్రికుడనుకున్నాడతడు.

కేశవుడి ఆలోచనల్ని పసికట్టిన వాడిలా జయమల్లు తల వూపి, "నోరూ వాయీలేని మృగాలనూ, పక్షులనూ లొంగదీసుకోగలగటం ఏమంత గొప్ప శక్తికాదు. ఇలాంటి స్వల్ప శక్తుల్ని బ్రహ్మదండిగాడు చెయ్యీ కాలూ కదపకుండానే ప్రదర్శించగలడు. రాకాసిలోయలో ప్రవేశించి, అక్కడవున్న గొప్ప గొప్ప నిధుల్ని కొల్లగొట్ట గల శక్తిని సంపాయించినప్పుడే మనం నిజమైన మంత్రవేత్తలం అవుతాం," అన్నాడు.

"ఆ రాకాసిలోయ ఎక్కడవున్నది?" అని అడిగాడు కేశవుడు.

"ఆ సంగతి తెలిస్తే యింక కావలసిందేముంది? అది తెలుసుకునేందుకే గదా, నేను యింత కాలంగా ఆ బ్రహ్మదండిగాణ్ణి సేవిస్తున్నాను," అన్నాడు జయమల్లు.

ఆ మాటలతో కేశవుడికి గురుశిష్యుల మధ్యవున్న వైరానికి కారణం ఏమిటో అర్థమయిపోయింది. ఆ రాకాసిలోయలో వున్న నిధులో లేక...వాళ్ళ ఆస్తికలో సంపాయించుకునేందుకు తను వాళ్ళకు సాయపడాలన్న మాట!





జయమల్లు పైపట్టతో ఒంటిని శుభ్రంగా తుడుచుకుని, కేశవుడికేసి తిరిగి, "ఇక త్వరగా కానియ్, బయలుదేరుదాం." అన్నాడు. కేశవుడుకూడా ఆదరాబాదరా ఒళ్ళు తుడుచుకుని, విల్లంబులు తీసుకుని బయలుదేరాడు. జయమల్లు రెండడుగులు వేసి చప్పున ఆగిపోయి, "పాపం, ఆ ఏనుగులు గొంతెండి చస్తే, మనకు పాపమొస్తుంది!" అంటూ వెనుదిరిగి ఏదో మంత్రం చదివి, "ఏయ్, గజరాజులారా, ఇక మీరు కొలనులో దిగవచ్చు," అంటూ అరిచాడు.

ఎవరో ఆజ్ఞ ఇచ్చినట్టుగా ఏనుగులు గుంపుగా ముందుకు కదిలి కొలనులోకి దూకినై. జయమల్లు అక్కడపడున్న ఒక చిన్నరాతిని చేతిలోకి తీసుకుని, మచ్చల సింహానికేసి విసురుతూ, "ఇక నువ్వుకూడా నీ కంఠశోష ప్రారంభించు," అని అరిచాడు. సింహం ఎగిరి రాతిమీద నిలబడి చెవులు చిల్లుపడేలా గర్జించటం మొదలుపెట్టింది. ఆ గర్జన వింటూనే కొలనులోని ఏనుగులు తొండాలెత్తి పెద్దగా ఘీంకారనాదం చేసినై.

"నేను కొలనుకు స్నానానికి వచ్చిన రోజల్లా ఇదే వరస. ఆ ఏనుగులూ, ఈ సింహం ఇలాగే గంటల తరబడి కచ్చేరించుకుని, చివరకు వేసారిపోయి అవి పోతవి." అన్నాడు జయమల్లు ఎంతో తృప్తిగా.

జయమల్లు ధోరణి కేశవుడికి చిరాకు తెప్పించింది. తనకు ఇంక కొద్ది గంటల్లో మాంత్రికుడివల్ల ప్రమాదం రాబోతున్నది. జయమల్లు కేమో చీమ కుట్టినట్టయినా లేదు.

"మన ఇద్దరం ఈనాటి నుంచి స్నేహితులమని చెప్పావు. అయినా, నాకు కలగనున్న ప్రమాదాన్నుంచి కాపాడేందుకు నువ్వు ఎలాంటి ప్రయత్నం చేస్తున్నట్టు లేదు." అన్నాడు కేశవుడు.

జయమల్లు తల ఎత్తి కొండ పైభాగానికేసి చూశాడు. అక్కడ ఒక పెద్ద బండ

రాయి నాసుకుని బ్రహ్మదండి మాంత్రికుడు తను కేసి చూస్తూండటం అతడికి కనిపించింది. వెంటనే జయమల్లు కేశవస్వామి హెచ్చరిస్తూ, "నువ్వెంత పెద్దగా మాట్లాడకు. వాడిది పాము చెవులు. నీకు ప్రమాదం కలగకుండా కాపాడటం నాకూ ఎంతో అవసరం. రాజానిలయంలో ప్రవేశించేందుకు అడ్డుపడే బ్రహ్మదండిగాడితోపాటు, నేనూ ఈ రోజునే తెలుసుకున్నాను. నీ భుజం మీదవున్న మచ్చ—పడగ విప్పిన పాము చూసిన తరవాత వాడు ఎంత సంతోషపడ్డాడో చూశావు గదా? ఈ రాత్రి నీకు ఏదో శక్తిని ఆవహింపచేసి, ఆ రాజా లోపలకు వెళ్ళాలి. అక్కడ నిధినిక్షేపాల సంగతి నీ చేత చెప్పిస్తాడు. ఆ వివరాలన్నీ తెలిసిన తరవాత మనం వాణ్ణి పరలోకానికి పంపిద్దాం, భయపడకు!" అన్నాడు.

"మనకంటె ముందే వాడు జాగ్రత్తపడి, మననే వాడు పరలోకయాత్ర చేయిస్తే? ఆ సంగతాలోచించావా?" అన్నాడు కేశవుడు అనుమానంగా.

"వాడా పని చేయలేడు. వాణ్ణిప్పుడు ధనపిశాచి, క్షుద్రభూతం పట్టి పీడిస్తున్నవి. అందువల్లే వాడిలో సంగీతజ్ఞానం లోపించింది. అలా కాకపోతే, వాడు నన్ను మునుపర్చి ఇలా కలిసి కట్టుగా తిరగనిచ్చే వాడు కాడు." అన్నాడు జయమల్లు.

కొండమీద రాతి పక్కన నిలబడి వాళ్ళ కేసి చూస్తున్న బ్రహ్మదండి మాంత్రికుడి పెదాలమీద చిరునవ్వు కదుల్లాడింది. వాడు చేవత్తి. "హిహ్హ జయమల్లూ, కేశవా! వచ్చేప్పుడు ఇద్దరూ ఎండు దిరిసెనపుల్లలా, ఇద్దరూ వెలగపళ్ళలా—సమిధాక్కలో పట్టుకు రండి. కాలభైరవుడు ఆకలితో నకనక లాడిపోతున్నాడు. పాపం, వెయ్యి సంవత్సరాల కొక్కసారి మాత్రమే ఈ ఉపాసకుల ఉపలమంత్రికి ఆకలివేస్తుంది!" అని కేకపెట్టాడు. —(ఇంకా ఉంది)






## 6

[బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుడైన జయమల్లుతో కలిసి, కేశవుడు ఏనుగుల కొలనుకు స్నానానికి వెళ్ళారు. అక్కణ్ణించి తిరిగి వచ్చేప్పుడు, జయమల్లు కేశవుడితో మాంత్రికుణ్ణుంచి రానున్న ప్రమాదాన్ని గురించి చెప్పాడు. వాళ్ళిద్దరూ గుహను సమీపిస్తుండగా, మాంత్రికుడు వాళ్ళను ఎండు పుల్లలు తేవలసిందిగా కేక పెట్టాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడు తమ కేసి చూస్తూ చిరునవ్వు నవ్వటం, కాలభైరవుడు ఆకలితో నకనక లాడిపోతున్నాడనటం, కేశవుడికి భయం కలిగించింది. ఒకవేళ తనూ, జయమల్లూ మాట్లాడుకున్న మాటలన్నీ, తన మంత్ర శక్తిచేత వాడు విన్నాడేమో అనుకున్నాడు కేశవుడు. ఇంక నాలుగైదు గంటల్లోపల తను మరణించటమో లేక బ్రహ్మదండి మాంత్రికుడు చావటమో తేలిపోతుంది.

కేశవుడు యిలాంటి ఆలోచనలతోనే జయమల్లుతో పాటు చెట్ల కింద పడివున్న ఎండు పుల్లలు ఏరాడు. అవి బాగా పెద్ద మోపుకు సరిపడ అయింతరవాత యిద్దరూ కలిసి, వాటిని నెత్తిన పెట్టుకుని మాంత్రికుడున్న గుహకేసి బయలుదేరారు. ఒక అర గంట గడిచిం తరవాత వాళ్ళు గుహను సమీపించేసరికి, లోపలి నుంచి బ్రహ్మదండి మాంత్రికుడు పఠిస్తున్న మంత్రాలు బయటికి వినబడుతున్నవి.





కొండమీది గుహలో మాంత్రికుడు కాల భైరవుణ్ణి గులకరాళ్లతో పూజించి ప్రసన్నుణ్ణి చేసుకోవాలని ప్రయత్నిస్తుంటే, అక్కడ బ్రహ్మపురంలో ప్రజలూ, రాజుగారూ కూడా, పొరుగు రాజ్యపు సైన్యాలు తమమీద ఏ క్షణాన వచ్చి పడతవో అని గగ్గోలుపడి పోతున్నారు. రాజుగారూ, మంత్రికూడా కొండ మీద శత్రుసైన్యాలేవో చేరినవని నమ్మారు. ఆ నమ్మకం వల్లనే వాళ్ళు కొంత సైన్యాన్ని కొండ మీద ఏమున్నదో చూసేందుకూ, శత్రుసైన్యం వుంటె వాళ్లను హతమార్చేందుకూ పంపారు. కాని, అను కోని విధంగా సైన్యాలు కొండ ఎక్కే సమ యానికి, కొండ అంతా కంపించిపోయి, పెద్ద పెద్ద రాళ్ళు మీద పడటంతో సైనికులు చాలా మంది మరణించారు. చావగా మిగిలిన సైనికులు తిరిగివచ్చి కొండ మీద తాము చూచిన దాన్ని గురించి రకరకా లుగా చెపుతున్నారు.

రాజుగారి రహస్య మందిరంలో ఆయ నతోపాటు మంత్రి, కొత్తగా నియమింప బడిన సేనానాయకుడూ, రాజ గురువుకూడా వున్నారు. సేనానాయకుడూ, మంత్రీ చెప్పింది విన్న తరవాత రాజు తన గురువు కేసి తిరిగి, "గురువర్యా, అంతా విన్నారు

కేశవుడూ, జయమల్లూ ఎండు పుల్లల మోపులను గుహముందు పడవేసి, అడు గులో అడుగు వేసుకుంటూ, చప్పుడు చెయ్యకుండా గుహలోపలికి వెళ్ళారు.

బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి విగ్రహం ముందు బాచిపట్టు వేసుక్కూచుని, పెద్దగా మంత్రాలు చదువుతూ, మధ్య మధ్య చేతిలో వున్న చిన్న చిన్న గులక రాళ్లను విగ్రహం కేసి విసురుతున్నాడు. ఇదేం పూజ చెయ్యటం? అన్నట్టు కేశవుడు జయమల్లు కేసి సౌంజ్ఞ చేశాడు. అతడు పెదాల మీద వేలు వేసుకుని, మాట్లాడకు అన్నట్టు వురిమిచూశాడు.











గదా? సైనికులు చెప్పేదాంట్లో మనం ఏది నమ్మాలి? ఆ కొండమీద పందలసంఖ్యలో శత్రుసైనికు లున్నారన్న మాట నమ్మాలా? లేక శరీరం అంతా నెత్తురు పూసుకుని, నిప్పులు చెరిగే కళ్ళతో, నెత్తిన పెద్ద శిఖతో భయంకరంగా వున్న మాంత్రికుడున్నాడన్న మాట నమ్మాలా? నా కేమీ పాలుపోవటం లేదు," అన్నాడు.

రాజగురువు ఓ క్షణకాలం ఆలోచించి తృప్తిగా తలాడిస్తూ, "ఈ రెండు మాటలూ నిజమే అని మనం ఎందుకు నమ్మగూడదు?" అని అడిగాడు.

"మాంత్రికుడికీ, శత్రుసైనికులకూ పొత్తెలా కుదురుతుంది? ఆ మాంత్రికుడు కూడా శత్రురాజుకు సహాయం చేయవచ్చిన వాడని మీ అభిప్రాయమా?" అన్నాడు రాజు అనుమానంగా.

"ఆ సంగతి మాత్రం నేను యిదమిత్థమని తేల్చి చెప్పలేను. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ కొండ దగ్గరకు వెళ్ళిన మన సైనికులందరికీ మతులు పోయినై. పందల సంఖ్యలో శత్రుసైనికుల్ని చూసినవాళ్ళ మాట అటుంచి, అక్కడున్న మాంత్రికుడే కొండలో భూకంపం పుట్టించాడనికూడా కొందరు నమ్ముతున్నారు. పైగా, ఆ వింత జంతువు ఒకటి!" అంటూ రాజగురువు చిరునవ్వు నవ్వాడు.

"అలాంటి జంతువు వుండే అవకాశమే లేవంటారా? నేనూ మొదట నమ్మలేదు. కాని, ఆ మాంత్రికుణ్ణి గురించి విన్న తరవాత......" అంటూ మంత్రి నీళ్ళు నమిలాడు.

"మంత్రీ, నేనూ కొద్దో గొప్పో మంత్ర శాస్త్రం చదివినవాణ్ణే!" అంటూ రాజగురువు చిరుకోపంగా మంత్రికేసి చూశాడు.

"గురువర్యా, అందుకేగదా మిమ్మల్ని యిక్కడికి రావలసిందిగా కోరింది. మీ సహాయం లేకుండా మేము చేయగలి









గిందేమీ లేదు," అన్నాడు రాజుగారు బతిమాలుతున్నట్టు.

"సరే, కేవలం ఊహించిన వాటి సాయంతో మనం ఏం నిర్ణయాలు చేయగలం? తమ అంగరక్షకుడి నాయకత్వాన కొండ దగ్గరకు వెళ్ళిన సైనికుల్ని తిరిగి రానివ్వండి," అంటూ రాజగురువు లేచి గది బయిటికి వచ్చారు.

రాజుగారు పంపగా, కొండమీద ఎవరున్నారో, అక్కడి పరిస్థితు లెలా వున్నవో చూచి వచ్చేందుకు బయలుదేరిన ఆయన అంగరక్షకుడు, వెంట వున్న ఇద్దరు సైనికులతో కొండ దాపున గల అడవిలోకి చేరాడు.



అల్లంత దూరాన భూకంపానికి ఎగుడు దిగుడుగా, ఒక రాయి మీద యింకో రాయి పడి వింత ఆకారాలు దాల్చి వున్న కొండను చూస్తూనే వాడి గుండెలు పీచుపీచుమన్నాయి. వాడి వెంట వున్న సైనికుల భయాన్ని గురించి చెప్పవలిసిందేలేదు.

"మీలో ఎవరైనా లోగడ ఈ కొండ ఎక్కారా? దారి మార్గాలు తెలిసిన వాడు ఒక్కడుంటే ఎంత బావుండును!" అన్నాడు రాజుగారి అంగరక్షకుడు.

అతడి వెంట వున్న సైనికుల్లో ఒకడు పూర్వం ఆ కొండ ఎక్కినవాడే. కాని, శత్రుసైనికుల్ని గురించిన కథలూ, వింత జంతువూ, మాంత్రికుడూ – ఇవన్నీ జ్ఞాపకం వచ్చి, వాడికి శరీరం జలదరిస్తున్నది.

"అయ్యా, మనం కొండెక్కి చూసేదేముంటుంది? ఒకవేళ అక్కడ శత్రు సైనికులు గాని, మాంత్రికుడుగాని వుంటే, మనం ప్రాణాలతో అక్కడి సంగతులు రాజుగారికి చెప్పేందుకు బతికివుండం. ఒక వేళ అలాంటి వాళ్ళెవరూ అక్కడ లేకపోతే, మనం పని కట్టుకుని ఆ కొండ ఎక్కటం వృథా," అన్నాడా సైనికుడు.

అంగరక్షకుడికి ఈ మాటలు బాగానే వున్నట్టు తోచినై. తను తిరిగి వెళ్ళి రాజు








గారితో కొండమీద ఎవరూ లేరని చెపితే సరిపోతుంది. కాని, తన వెంట వున్న సైనికుల్ని నమ్మటం ఎల్లా? రాజుగారి నుంచి మెప్పు పొందేందుకు, వాళ్ళు తను కొండే ఎక్కలేదని ఆయనతో చెప్పేస్తే, తనకు ప్రాణాపాయం తప్పదు!

"ఊహుం, అదేం లాభంలేదు. మనం కొండ ఎక్కి అక్క డెవరున్నారో చూడ వలసిందే. శత్రువుల చేతిలో చచ్చామా, వీరస్వర్గం. బతికి బయటపడ్డామా, రాజు గారి నుంచి గొప్ప బహుమానాలు పొంద వచ్చు. అయినా...ఎవడైనా ఒక్కడు దారి చూపేవాడుంటే బావుండునే..." అంటూ అంగరక్షకుడు తల గోక్కుంటూ కొండకేసి చూడసాగాడు.

అంగరక్షకుడూ, సైనికులూ, ఏ చెట్టు కింద అయితే నిలబడి వున్నారో, ఆ చెట్టు మీదే కేశవుడి ముసలి తండ్రి కూచుని వున్నాడు. అతడు, తన కొడుకు వింత జంతువు నెక్కి కొండ మీదికి పారిపోయి నప్పటి నుంచి, అక్కడ జరుగుతున్న సంగతులేవో చాలావరకు చూశాడు. మాంత్రి కుడు గుహలో నుంచి బయటికి రావటం, తన కొడుకూ, అదే వయసువాడైన మరి ఒకడూ కలిసి మాట్లాడుకుంటూ వుండటం—బ్రహ్మపుర సైనికుల దాడి, కొండలో పుట్టిన భూకంపం—సర్వం అతడు చూశాడు.

తన కొడుకు ఎవడో మాంత్రికుడికి చిక్కి పోయాడన్న నమ్మకం ఆ ముసలివాడికి కలిగింది. తను ఒంటరిగా వెళ్ళి అతణ్ణి రక్షించటం ఎలాగా అని అతడు ఆలో చిస్తున్నాడు. ఇప్పుడు ఈ సైనికులు చెట్టు కిందికి వచ్చి, ఆ కొండ ఎక్కాలని మాట్లాడు కుంటూ వుండటం, దారి చూపేవాడు వుంటే బావుంటుందని చెప్పుకోవటం, ముసలివాడికి ధైర్యం కలిగించింది.

ముసలివాడు పిల్లిలా చెట్టు కొమ్మల్లోంచి మెల్లిగా కిందికి దిగి, ఆ పక్కనే వున్న



మరో చెట్టు కిందికి వెళ్ళి వెల్లకిలా పడుకుని, కళ్ళు మూసుకుని, నిద్రలో ఏదో కలవరిస్తున్నవాడిలా శబ్దం చేశాడు. ఆ శబ్దం వింటూనే రాజుగారి అంగరక్షకుడికీ, సైనికులకూ పై ప్రాణాలు పైనే పోయినై. ముగ్గురూ ఒక్కసారి ఎగిరి గంతేసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. వాళ్లకు చెట్టు కింద ముసలివాడు కనిపించాడు.

"వీడే మాంత్రికుడై వుంటాడు! ఆ పాడ వాటి గడ్డం చూశావా? వాడు నిద్రలో వున్నట్టుంది, గొంతు కోసేస్తే పీడా వీరగడవుతుంది," అన్నాడొక సైనికుడు.

ఈ మాటలు వింటూనే, తనకు అనుకోని ప్రమాదం ఏదో కలగనున్నదని గ్రహించిన ముసలివాడు, ఆవిలిస్తూ లేచికూచున్నాడు. ముసలివాడి వాలకం చూసి, వాడు మాంత్రికుడై వుండడని వూహించిన అంగరక్షకుడు, చప్పున ఒరలో నుంచి కత్తి దూసి, అట్టహాసం చేస్తూ అతడి దగ్గిరకు వెళ్ళి, "ఎవర్రా నువ్వు? ఈ కొండ దగ్గిర అడవిలో నీకేం పని?" అని పళ్ళు కొరుకుతూ ప్రశ్నించాడు.

ముసలివాడు జవాబు చెప్ప బోయేంతలో సైనికుల్లో ఒకడు, "నువ్వు మాంత్రికుడివా?" అని అడిగాడు. రెండోవాడు, "నువ్వు శత్రుదేశపు సైనికుడివా?" అని రెట్టించాడు.

"అయ్యా, నేను మీరనుకునే వాణ్ణెవర్నీ కాదు. ఈ అడివిలో కందమూలాలూ, ఆకలములూ తిని బతికే ఒక ముసలి వగ్గును. నన్ను చూసి మీరు శత్రుసైనికు డనుకోవటం వింతగావున్నది," అన్నాడు ముసలాడు.

"అలాగా, అయితే నీ ప్రాణానికి అపాయం కలగదని నేను అభయం యిస్తున్నాను. నేను స్వయం బ్రహ్మపుర రాజుగారి అంగరక్షకుణ్ణి! ఈ కొండమీద రాజద్రోహులెవరైనా వున్నారేమో, వుంటే హతమార్చాలని వచ్చాను. నీకు కొండమీది దారి తెరువు లేమైనా తెలుసా?" అని అంగరక్షకుడడిగాడు.







ముసలివాడు తన అరచేతిని, వెడల్పుగా చాచి, "ఇక్కడున్న గజిబిజ రేఖలలా, గుంటలూ సొట్టలూ ఎంతబాగా తెలుసో, కొండ మీది దారులు నాకంత బాగా తెలుసు," అన్నాడు.

"ఆహా, అవసరానికి భలే వాడివి కనబడ్డావ్. అయితే, ముందుండి కొండమీదికి దారి తియ్యి. ఇవ్వాళో రేపో కాటిక ప్రయాణం కట్టే వాడివిలా వున్నావుగాని, లేకపోతే రాజుగారికి చెప్పి, నీ కెన్ని బహుమానాలైనా యిప్పించే వాడిని," అన్నాడు అంగరక్షకుడు.

ముసలివాడికి అంగరక్షకుడనే మాటలు చెవి కెక్కటంలేదు. ఈ బ్రహ్మపుర సైనికుల సాయంతో తన కొడుకు కేశవుణ్ణి, మాంత్రికుడి బారి నుంచి రక్షించు కోవాలన్నదే అతడి ఆరాటం. అతడు కొండకేసి నడవసాగాడు. కొంచెందూరం అతణ్ణి అనుసరించి పోయింతరవాత, అంగరక్షకుడికి ముసలివాడి చేతిలో వున్న కత్తి కనబడింది. వాడు ఆశ్చర్యపోతూ, "అడవిలో కంద మూలాలు తిని బతికే నీకు ఈ కత్తి ఎందుకు?" అని అడిగాడు.

"నేనూ, ఒకప్పుడు బ్రహ్మపుర రాజుగారి దగ్గిర సైనికుడుగా వున్నాను—ఈ రాజుగారు కాదు, ఈయన తండ్రిగారి కాలంలో. అప్పటినుంచీ ఈ కత్తి నా వెంటనే వుంటున్నది," అన్నాడు ముసలివాడు విసుగ్గా.

ఆ మాటలు వింటూనే సైనికులు గుసగుస లాడారు. అంగరక్షకుడు వాళ్లకేసి ఉరిమి చూస్తూ, "మన ప్రాణాల కొచ్చిన భయం ఏమీలేదు. వాణ్ణి నమ్మలేకే ముందు దారి తియ్యమన్నాను. ఏదైనా మోసం జరిగేలా వుంటే, వెనక నుంచి వాడి మెడ నరికేద్దాం," అన్నాడు మెల్లిగా.

ముసలి వాడికి ఈ మాటలు వినిపించినా, వినపించ నట్టే నటిస్తూ కొండ ఎక్కటం ప్రారంభించాడు. —(ఇంకా వుంది)








# 7

[బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి ముందు హోమం చేయసాగాడు. ఈ లోపల బ్రహ్మపురరాజుగారి అంగరక్షకుడు ఇద్దరు సైనికులతో కొండ దగ్గిరకు వచ్చాడు. అక్కడ వాళ్ళకు కేశవుడి తండ్రి అయిన ముసలివాడు కనిపించాడు. సైనికులు అతణ్ణి కొండ మీదికి దారితీయమన్నారు. వాడు కొండ ఎక్కటం ప్రారంభించాడు. తరవాత—]

ఎత్తుగా వున్న ఒక చోట, రాళ్లచాటుగా నిలబడి కొండ కిందికి చూస్తున్న జయమల్లుకు నలుగురు మనుషులు కొండ ఎక్కటం కనిపించింది. గుహలో బ్రహ్మదండి మాంత్రికుడు, కాలభైరవుడి ముందు ముగ్గులు వేసి, వాటి మధ్య కేశవుణ్ణి కూచో పెట్టి హోమం చేస్తూ మంత్రాలు పఠిస్తున్నాడు. కేశవుణ్ణి కాలభైరవుడు ఆవేశించబోతున్నాడనీ, ఆ స్థితిలో అతణ్ణి చూడటం ప్రమాదం అనీ చెప్పి, అతడు జయమల్లును గుహ నుంచి బయిటికి పంపేశాడు. కాని, జయమల్లు వీలు దొరికినప్పుడల్లా గుహ దగ్గిరకు వెళ్ళి లోపల జరుగుతున్న తతంగం అంతా చాటుగా వుండి చూస్తూనేవున్నాడు.

జయమల్లు తెలుసుకోవాలనుకుంటున్న దేమిటంటే; కాలభైరవుడు ఆవేశించినప్పుడు కేశవుడు ఏమి చెపుతాడన్నది. రాకాసి లోయకు వెళ్ళే మార్గం, అక్కడున్న ధనరాసులో మరేవే వున్న చోటూ, మాంత్రికుడు తెలుసుకోవాలని చూస్తున్న సంగతి అతడికి







లోగడే తెలుసు. ఒకసారి, ఆ రహస్యం తెలుసుకున్న తరవాత మాంత్రికుడు, కేశవుణ్ణి చంపేస్తాడన్న అనుమానంకూడా జయమల్లుకు వుంది. కనక, తాను రాకాసి లోయకు వెళ్ళే మార్గం ఏదో వినాలి. కాలభైరవుడు ఆవేశించినప్పుడు కేశవుడు చెప్పే మాటలు, వాడు వదిలిపోయిన తరవాత, అతడికి జ్ఞాపకం వుండే అవకాశంలేదు. కనక తనే విని జ్ఞాపకం వుంచుకోవాలి.

జయమల్లు యిలా ఆలోచిస్తూ, కొంత దిగువకు చూసేసరికి, కొండ ఎక్కుతున్న నలుగురిలో నుంచి ఒకడు వెనుదిరిగి, వేగంగా అడవిలోకి పరిగెత్తి పోతున్నాడు.



తతిమ్మా ముగ్గురూ శిలా ప్రతిమల్లా కదలా మెదలక నిలబడి, కొంత పైకి చూస్తున్నారు.

ఆ ముగ్గుర్నీ అంత ఆశ్చర్యా పరిచిన సంగతేమిటా అని జయమల్లు వెనుదిరిగి చూశాడు. గుహలో నుంచి నల్లని పొగ బయటికి వచ్చి, తాటిచెట్టు ప్రమాణాన ఆకాశంలోకి లేచింది. కొండ ఎక్కుతున్న ముగ్గుర్నీ, ఆశ్చర్య పరిచిన దృశ్యం అదేనని జయమల్లు గ్రహించాడు. ఇప్పుడు తనేం చెయ్యాలి? బ్రహ్మదండి మాంత్రికుడితో, చెప్పాలా? చెపితే...చెప్పక పోతే......

ఈ లోపల రాజుగారి అంగరక్షకుడు కొండ దగ్గిర నుంచి పంపిన సైనికుడు బ్రహ్మపురం కేసి వాయువేగ మనోవేగాలతో పరిగెత్తుతున్నాడు. వాడికి అదృష్టం కొద్దీ దారిలో, గుర్రాన్నెక్కి పోతున్న ఒక శత వృద్ధు కనిపించాడు. ఇదే అదననుకుంటూ సైనికుడు కత్తి దూసి, ఆ వృద్ధుణ్ణి భయపెట్టి గుర్రం మీంచి కిందికి లాగి, దాన్నెక్కి నగరం కేసి దౌడు తీశాడు.

కోట ముఖద్వారం దాటి ఆవరణలోకి అడుగు పెడుతూనే, సైనికుడు, "మహారాజా, మహారాజా!" అంటూ కేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే కొత్తగా నియమితుడైన సేనానాయకుడు భవనంలో









నుంచి బయటికి వచ్చి, "ఏమోయ్, నోరు ముయ్! ఏకంగా మహారాజుగారినే కేకలు పెట్టి పిలుస్తున్నావే, నీకేమన్నా మతి పోయిందా? ఏమిటి సంగతి?" అని గద్దించి అడిగాడు.

సైనికుడు దానితో అదురుకుని, "సేనానీ, రాజుగారి అంగరక్షకుడు నన్ను పంపాడు. కొండమీద వున్న ఒక గుహలో నుంచి నల్లని పొగ బయలుదేరి ఆకాశం ఎత్తు లేస్తున్నది. గుహలో మాంత్రికుడు దాకున్నాడని, వాడే లోగడ సేనానాయకుణ్ణి చంపాడని, ఒక ముసలివాడు చెప్పాడు. ఆ వార్త రాజుగారికి చెప్పి, మరికొందరు సైనికుల్ని వెంటపెట్టుకు రావలసిందిగా అంగరక్షకుడు నన్ను పంపాడు," అన్నాడు.

"అది చెప్పవలసిన తీరు! ఒక్క గుక్కలో అన్ని వివరాలూ చెప్పేశావే. ఇక నోరు మూసుకుని నా వెంట రా," అంటూ సేనానాయకుడు, సైనికుణ్ణి వెంటపెట్టుకుని రాజుగారి దగ్గిరకు వెళ్ళాడు.

రాజుగారూ, రాజగురువూ సేనానాయకుడు చెప్పినదంతా విని, సైనికుణ్ణి, "ఆ ముసలివాడెవడు?" అని ప్రశ్నించారు.

"వాడు మాకు అడివిలో కనిపించాడు. తను అడివిలో కందమూలాలూ, ఆకులూ తిని బతుకుతుంటానని చెప్పాడు," అన్నాడు సైనికుడు.

"గుహలో నుంచి పొగరావటానికి కారణం మాంత్రికుడే ఎందుకై వుండాలి? శత్రుసైనికు లెందుక్కాగూడదు?" అని ప్రశ్నించాడు రాజగురువు.

"కాదని ఆ ముసలాడే చెప్పాడు. తను అడవిలో ఆ మాంత్రికుణ్ణి చాలాసార్లు చూశాడట. వాడుండే గుహకూడా తనకు తెలుసునన్నాడు," అన్నాడు సైనికుడు.

"వింత జంతువును గురించి ఆ ముసలాడి కేమైనా తెలుసా?" అని రాజుగారు ప్రశ్నవేశారు.









"ఆ వింతజంతువు ఆ మాంత్రికుడి సృష్టేనని ముసలాడి నమ్మకం. తను మాత్రం ఆ జంతువును చూడలేదన్నాడు, మహారాజా," అన్నాడు సైనికుడు.

"గురువర్యా, ఏమిటి కర్తవ్యం?" అన్నాడు రాజుగారు.

రాజగురువు ఓ క్షణకాలం ఆలోచించి, "ఆ కొండ మీది గుహలో ఎవడో మాంత్రికు డున్నాడనేందుకు సందేహం లేదు. శత్రు సైనికులైతే అంత తెలివి తక్కువగా గుహలో నుంచి పొగ బయట పడనివ్వరు. అలా జరిగితే వాళ్ళ రహస్యం మనకు తెలిసి పోతుందిగదా. కనుక, అంత తెలివితక్కువ శత్రువులుండరు. ఇప్పుడు నా అనుమానం ఏమిటంటే, ఆ మాంత్రికుడు ఏదో పెద్ద ఎత్తున గుహలో హోమం చేస్తున్నాడని. లేకపోతే అంత పొగ ఒక్కసారిగా బయట పడేందుకు వీలులేదు. వాణ్ణి మనం ప్రాణాలతో పట్టుకోవాలి," అన్నాడు.

"వాడు దుష్ట మాంత్రికుడుగదా. మనం రహస్యంగా వెళ్ళి వాణ్ణి పట్టుకోగలమా?" అన్నాడు రాజుగారు నిస్పృహ కనబరుస్తూ.

"అదంతా నాకు వదలండి. నేను మంత్ర శాస్త్రం తెలిసిన వాడినైనా, ఇంత వరకూ దాన్ని ఉపయోగంలో పెట్టలేదు. ఆ దుష్టుడి మంత్రశక్తిని హరించి, వాణ్ణి ఎలా చేజిక్కించుకోవాలో నాకు తెలుసు," అంటూ రాజగురువు, సేనానాయకుడి కేసి తిరిగి, "సేనానీ, మెరికల వంటి వాళ్ళను ఓ పదిమంది సైనికుల్ని ఏరి వెంటనే బయలుదేరేందుకు సిద్ధం చేయి," అన్నాడు.

పది నిమిషాలు గడిచీ గడవక ముందే రాజగురువూ, సేనానాయకుడూ, సైనికులూ గుర్రాలెక్కి, నగరం వదిలి అడవి మార్గాన కొండ దగ్గిరకు బయలుదేరారు. అంగరక్షకుడు పంపిన సైనికుడు దారి తీస్తున్నాడు.

గుహ ముందు కాపలివున్న జయమల్లు కొండను సమీపిస్తున్న రాజగురువునూ, ఇతర





సైనికులనూ చూశాడు. ఇంతకు ముందు అడివికి అడ్డం పడి పరిగెత్తిపోయిన సైనికుడు, వీళ్ళందర్నీ వెంటపెట్టుకు వస్తున్నాడని అతడికి అర్థం అయింది. గుహలో నుంచి బయటికి వెలువడుతున్న పొగ మాంత్రికుణ్ణి పట్టించింది. వాడు రాకాసి లోయలో వున్న వేటకోసమో చేసే ప్రయత్నంలో మైమరిచి, తన గొంతును వురి తాడు పడనున్న సంగతే గుర్తించటంలేదు!

జయమల్లు చప్పున వెనుదిరిగి గుహ దగ్గిరకు వెళ్లాడు. లోపల కంచులా మోగుతున్న బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు చప్పున ఆగిపోయింది. ఆ వెంటనే



కేశవుడి గొంతు వినిపించింది. అతడు చెపుతున్నాడు: "వింధ్యారణ్యాల కవతల ఒక గొప్ప కొండలోయ వున్నది. అదే రాకాసి లోయ. ఆ లోయలో ఒకచోట ఎత్తయిన ఒక రావిచెట్టు. దాని కింద ఒక పాము పుట్ట......" బ్రహ్మదండి మాంత్రికుడు ఎక్కడలేని ఆనందంతో పెద్దగా నవ్వుతూ, "ఊఁ కాలభైరవా, చెప్పు, త్వరగా చెప్పు," అంటూ కేశవుడి భుజంమీద మంత్ర దండంతో గట్టిగా చరిచాడు.

"ఎండి మోడుగా వున్న చెట్టు వెన్నెల రాత్రి ఫల పుష్పాలతో నిండిపోతుంది. పులి రాజును చంపి, చర్మం వలిచి, దాన్ని..." కేశవుడు మాట మధ్యలోనే ఆగి, చేత్తో గొంతు గట్టిగా పట్టుకుని వణికిపోతూ వెనక్కూ ముందుకూ ఊగసాగాడు.

కేశవుడి వాలకం చూస్తూనే, బ్రహ్మదండి మాంత్రికుడు గుహ దద్దరిల్లేలా, "ఆఁ ఎవడు వాడూ? నా మీదే మంత్ర ప్రయోగం చేశాడా? కాలభైరవుడి నోరు కట్టుబడేలా చేశాడా?" అంటూ హుంకరించాడు. జయమల్లు ఒక్క గంతులో గుహ ముందు నుంచి పరిగెత్తి కొండ దిగువకేసి చూశాడు. గుర్రాల మీద వచ్చిన వాళ్ళల్లో నుంచి, ఒకడు కిందికి దిగి, కమండలంలో నుంచి











నీళ్ళు తీసుకుని, కొండ రాళ్ళ మీద చల్లుతూండటం అతడికి కనిపించింది. అతడు రాజగురువు!

బ్రహ్మదండి మాంత్రికుడితో పాటు, తనూ, కేశవుడుకూడా రాజభటులకు చిక్కిపోతామని జయమల్లు భయపడ్డాడు.

"గురురాయా, గురురాయా!" అంటూ జయమల్లు గుహలోకి పరిగెత్తి, "బ్రహ్మపుర సైనికులు కొండ ఎక్కి వస్తున్నారు," అన్నాడు మాంత్రికుడితో.

మాంత్రికుడు పళ్ళు పటపట కొరికి, "వాళ్ళు సైనికులయితే మనకేం భయంరా, శిష్యా. వాళ్ళవెంట తుచ్ఛ మాంత్రికుడెవడో ఒకడున్నాడు. వాడు మన ఉపాసకుల ఊడలమర్రి నోరు కట్టేశాడు. సరే, ఆ తుచ్ఛుణ్ణి కాలభైరవుడికి బలిపెట్టక మానను," అన్నాడు.

"ఆ తుచ్ఛమాంత్రికుడు నోరు కట్టేసే లోపల మనకు కావలసిన సంగతులన్నీ, కాలభైరవుడు చెప్పేశాడా, గురురాయా?" అని అడిగాడు జయమల్లు.

హఠాత్తుగా బ్రహ్మదండి మాంత్రికుడి కనుబొమలు ముడిపడినై. అతడు అనుమానంగా జయమల్లుకేసి చూస్తూ, "నీవేమైనా చాటున దాగివుండి, గుహలో జరుగుతున్నదంతా చూశావా ఏరా, శిష్యా?" అని అడిగాడు.

"అదేమిటి గురురాయా! నన్ను బయట కావలి వుండమన్నారు గదా? మీ ఆజ్ఞ పాలించబట్టే, నేనా బ్రహ్మపుర సైనికుల్ని చూడటం తటస్థించింది. గుహలో జరుగుతున్నదేమిటో చూస్తూ కూచుంటే, కొండను సమీపిస్తున్న శత్రువుల నెలా చూడగలిగేవాడిని?" అన్నాడు జయమల్లు అమాయికంగా.

అప్పటివరకూ మైకంలో వున్న వాడిలా అటూ యిటూ ఊగుతున్న కేశవుడు, చప్పున లేచి నిలబడి, చుట్టూ కలయచూస్తూ,







"నే నెక్కడున్నాను? నే నెవణ్ణి?" అంటూ కేకలు ప్రారంభించాడు.

మాంత్రికుడు అతణ్ణి సమీపించి భుజం పట్టుకుని కుదుపుతూ, "నువ్వు కేశవుడివి. మహామాంత్రికుడైన బ్రహ్మదండి గుహలో వున్నావు. తెలిసిందా? అడుగో చూడు, ఉపాసకుల ఊడలమర్రి, ఉన్మత్త భైరవుడు!" అన్నాడు ఆవేశంతో.

కేశవుడు కాలభైరవుడి విగ్రహం కేసి చూసి, "కాలభైరవుడి కళ్ళల్లో వెలుగు కొంచెం తగ్గినట్టుందేం?" అన్నాడు.

జయమల్లు ఏదో చెప్పబోయేంతలో మాంత్రికుడు అతణ్ణి వారించి, "మరేం లేదు, కేశవా. నేను అజాగ్రత్తగా వున్న సమయంలో, ఒక తుచ్ఛ మాంత్రికుడు, నా మీద దొంగదెబ్బ తీశాడు. నువ్వేమీ భయపడకు. వాణ్ణి కొద్ది క్షణాలలో కాలభైరవుడికి బలిపశువును చేస్తాను," అంటూ హుంకరించాడు.

"గురురాయా, మనం యిక్కడ కాలయాపన చేసేందుకు లేదు. ఎటైనా పారిపోదాం. మార్గం చూపండి," అన్నాడు జయమల్లు.

"పారిపోవటమా? ఈ మహామాంత్రికుడు బ్రహ్మదండి, శత్రువులకు భయపడి పారిపోవటమా? ఎంత మాటన్నావు, శిష్యా! కాలభైరవుడే నాకు రక్ష! ఇక్కణ్ణించే, నా మీద దొంగ దెబ్బ తీసిన నీచుణ్ణి హత మారుస్తాను. వాడి పాఠం వాడికే ఒప్ప చెపుతాను. మీ యిద్దరు మాత్రం ఎక్కడికైనా దూరంగాపోయి దాక్కోండి," అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి విగ్రహం కేసి నడిచాడు.

కేశవుడు తన విల్లంబులు తీసుకున్నాడు. ఆ తరవాత జయమల్లూ అతడూ కలిసి, గుహ నుంచి బయిటికి వచ్చి, రాళ్ల వెనకగా నక్కుతూ, ఏనుగుల కొలను కేసి పారిపోసాగారు. —(ఇంకా వుంది)






## 8

[ కాలభైరవుడి విగ్రహం ముందు, బ్రహ్మదండి మాంత్రికుడు చేసిన హోమం వల్ల పొగ లేచి, గుహనంతా చుట్టి వేసింది. ఆ విధంగా వాడున్న చోటు రాజు పంపిన సైనికులకు తెలిసిపోయింది. మంత్రశాస్త్రం తెలిసిన రాజగురువు స్వయంగా వచ్చి, కాలభైరవుడి నోరు కట్టేశాడు. మాంత్రికుడు కేశవుణ్ణీ, జయమల్లునూ ఎక్కడైనా పారి పొమ్మన్నాడు. తరవాత—]

కొండ ఎక్కుతున్న బ్రహ్మపుర సైనికుల్లో ఒకడు, కేశవుడూ, జయమల్లూ గుహ నుంచి బయటికి రావటం చూశాడు. వాడు రాజగురువుతో, "అయ్యా, గుహలో వున్నది ఒకడు కాదు, ఇద్దరు మాంత్రికులు, అదిగో చూడండి!" అంటూ గుహ కేసి చేయి చూపాడు.

సైనికుడలా చెప్పగానే రాజగురువుతో పాటు, కేశవుడి ముసలితండ్రి కూడా అటు కేసి చూశాడు. అతడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. తన కొడుకు బతికే వున్నాడు! తను భయపడ్డట్టు, మాంత్రికుడు అతడికేమీ హాని చెయ్యలేదు.

రాజగురువు, పారిపోతున్న కేశవుణ్ణీ, జయమల్లునూ చూస్తూనే, "వాళ్లు మాంత్రికులు కాదు, వాడి శిష్యులై వుంటారు. మాంత్రికుడు ఈ సరికే గుహ నుంచి మరో మార్గాన పారిపోయివుంటాడు. లేదా, అక్కడే వాడికి దాక్కొనేందుకేదైనా రహస్య ప్రదేశం వుండివుంటుంది. వాడి శిష్యుల్ని







కూడా మనం చేజిక్కించుకోవాలి. మీరు అన్ని వైపుల నుంచీ చుట్టు ముట్టండి," అని సైనికుల నాజ్ఞాపించారు.

గుంపుగా నడుస్తున్న సైనికులందరూ, రాజగురువు ఆజ్ఞ వింటూనే జట్లు జట్లుగా విడిపోయి, వలయాకారంగా కొండ మీదికి ఎక్కసాగారు. పారిపోతున్న కేశవుడూ, జయమల్లూ వాళ్ళను చూసి, ఎటు పారి పోవాలో తెలియక తికమకపడ్డారు.

"సైనికులు అన్ని వైపుల నుంచీ మనను చుట్టుముట్టి పట్టుకోవాలని చూస్తున్నారు. వాళ్ల కంట బడకుండా పారిపోవటం ఎలా?" అన్నాడు కేశవుడు.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను," అంటూ జయమల్లు ఓ క్షణం ఆగి, "మనం ఒకటి చేద్దాం. ఈ సైనికులు వెన్నంటి వుండగా, కొండ దిగి అడవిలోకి పోగలగటం సాధ్యమయేది కాదు. మనం యిక్కడే ఏదైనా చీకటి గుహలో దూరబడి దాక్కుందాం," అన్నాడు.

"మనను పట్టటానికి బయిలుదేరిన వాళ్ళు, ఈ చుట్టుపక్కల వున్న గుహలూ, గుట్టలూ, పుట్టలూ వెతక్కుండా వూరుకుంటారా? ఏమైతేనేం మనం, మాంత్రికుడి గుహలో నుంచి బయటికి రావటం బ్రహ్మపుర సైనికులు చూడటంతో, చిక్కులో పడ్డాం," అన్నాడు కేశవుడు.

"నువ్వంత నిస్పృహ పడకు, కేశవా. మనం రాజభటులకు దొరక్కుండా దాక్కునేందుకు శాయశక్తులా ప్రయత్నిద్దాం. ఒక వేళ దొరికామో, ప్రాణాపాయం రాకుండా బయటపడే మార్గం నేను ఆలోచించే వున్నాను," అన్నాడు జయమల్లు.

జయమల్లేదో పెద్ద ఎత్తుగడ ఒకటి ముందే ఆలోచించి వుంచాడని కేశవుడు అర్థం చేసుకున్నాడు. అయితే, అదేమిటో అడుగుదామని కేశవుడు అనుకునే లోపలే, జయమల్లు పక్కన వున్న ఒక సొరంగ









మార్గంలోకి ఎగిరి దూకుతూ, "కేశవా. చీకటిని భయపడకు. నా వెనగ్గా రా. ఈ సొరంగ మార్గం, నాకు బాగా తెలిసిందే," అని కేక వేశాడు.

కేశవుడు మరి చేసేదేమీ లేక జయమల్లు వెనక సొరంగంలోకి దూకాడు. లోపల చీకటిగా వున్నది. జయమల్లు రెండు చేతులనూ, పక్కలకు బారచాచి, సొరంగపు టంచులను తాకుతూ, జాగ్రత్త అని కేశవుడికి హెచ్చరికలిస్తూ త్వరత్వరగా ముందుకు నడవ సాగారు.

రాజగురువు ఆజ్ఞ విని, మాంత్రికుడున్న గుహనూ, ఆ పరిసర ప్రాంతాలనూ చుట్టుముట్టడానికి బయలుదేరిన సైనికులకు, కేశవుడూ, జయమల్లూ కనిపించలేదు. వాళ్ళల్లో నలుగురు ప్రతి గుహలోకి తొంగి చూస్తూ, చివరికి బ్రహ్మదండి మాంత్రికుడి గుహ దగ్గిరకు వచ్చి, లోపలకు చూస్తూనే, కాలభైరవుడి విగ్రహాన్ని చూసి, మూర్ఛపోయినంత పని చేశారు.

"ఉగ్రరూపం, భయంకరాకారం, కాళ్ల కింద నేల గిర్రున తిరిగిపోతున్నది!" అంటూ యిద్దరు సైనికులు గుహ ముందు వెల్లకిలా పడిపోయారు. సైనికుల అరుపులు విన్న రాజగురువూ, సేనానాయకుడూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. గుహముందు యిద్దరు సైనికులు మూర్ఛపడి వున్నారు, మరిద్దరు గుహకు ఆనుకుని నిలబడి, గట్టిగా కళ్ళు మూసుకుని, ఏదో దండకం వినబడీ వినబడనట్టు గొణుగుతున్నారు.

సైనికుల వాలకం చూస్తూనే, సేనానాయకుడికి మండిపోయింది. అతడు కింద పడి వున్న సైనికులను కాలితో గట్టిగా తన్నుతూ, "చచ్చారా, బతికున్నారా?" అంటూ పళ్ళు కొరికాడు.

సేనానాయకుడి తాపులకు కింద పడి వున్న సైనికులిద్దరూ ఎగిరి లేచి నిలబడ్డారు. దండకం పఠిస్తున్న వాళ్ళు చప్పున కళ్ళు











తెరిచారు. తరవాత నలుగురు సైనికులూ ఏకకంఠంగా, "గుహలో వున్న భయంకర స్వరూపాన్ని చూస్తూనే, మాకు శరీరాలు స్వాధీనం తప్పినై, సేనానీ," అన్నారు.

"ఆహా, ఎంతటి సాహస విక్రమార్కులోయ్, మన బ్రహ్మపుర సైనికులు!" అంటూ రాజగురువు గుహలోకి ప్రవేశించాడు. గుహలో అంతా నిశ్శబ్దంగా వున్నది. కాలభైరవుడి విగ్రహం ముందు మాంత్రికుడు వెలిగించిన మంటలు యింకా చల్లారలేదు. వాడు వేసిన ధూపం తాలూకు పొగ, యింకా గుహలో అక్కడక్కడా తారట్లాడుతున్నది.

"సేనానీ!" అని కేకవేశాడు రాజగురువు, చుట్టూరా కలయచూస్తూ. సేనానాయకుడు గుహలోకి వచ్చాడు.

"ఈ గుహలో నుంచి ఎక్కడికో రహస్య మార్గం వుండి వుంటుంది. మాంత్రికుడు దానివెంట పారిపోయి వుంటాడని నా అనుమానం. వాడి అనుచరు లిద్దరూ గుహ లోంచి బయటికి పారిపోవటం మనం చూశాం. వాళ్ళను రాజుగారి అంగరక్షకుడు వెతికి పట్టుకుంటాడు. మనం, ఈ మాంత్రికుణ్ణి కలుగులోంచి బయటికి లాగాలి," అన్నాడు రాజగురువు.

సేనానాయకుడు గుహకు అన్ని వైపులా పరీక్షగా చూశాడు. అతడి కెక్కడా ద్వారం వున్న గుర్తు కనిపించలేదు. "గుహలోకి మనం ప్రవేశించిన దారి తప్ప, పారిపోయేందుకు మరే మార్గం వున్నట్టు కనిపించటం లేదు, గురువర్యా," అన్నా డతడు.

"చూడగానే కనిపించేదైతే, అది రహస్య మార్గం ఎలా అవుతుంది? గుహలో ప్రతి అంగుళాన్నీ నొక్కుతూ కదిలించి చూడండి. ఏదైనా రహస్య ద్వారం వుంటే తెరుచుకుంటుంది," అన్నాడు రాజగురువు.

సేనానీ, నలుగురు సైనికులూ గుహనంతా చేతులతో, కత్తిపిడులతో, నొక్కి







చూశారు. ఎక్కడా రహస్య ద్వారం వున్న సూచనలైనా కనిపించలేదు. ఈ లోపల రాజగురువు కాలభైరవుడి విగ్రహాన్ని పరీక్షగా చూడసాగాడు. హఠాత్తుగా ఆయనకో అనుమానం కలిగింది. సేనానాయకుడు వచ్చి గుహలో ఎక్కడా రహస్య ద్వారం లేదని చెప్పగానే, రాజగురువు, కాలభైరవుడి విగ్రహాన్ని అతడికి చూపుతూ, "బహుశా, ఈ విగ్రహం అడుగున ఏదైనా రహస్య బిలం వున్నదేమో. లేకపోతే మాంత్రికుడు ఎట్లా మాయమయినట్టు? విగ్రహాన్ని కదిలించి చూడండి," అన్నాడు.

సైనికులూ, సేనానాయకుడూ కాలభైరవుడి విగ్రహాన్ని పైకెత్తేందుకు ప్రయత్నించారు. అది కదలలేదు. అటూ యిటూ పక్కలకు లాగేందుకు యత్నించారు. కాని, అది వున్న చోటు నుంచి అంగుళమైనా జరగలేదు. రాజగురువు ఈసారి విగ్రహాన్ని తల దగ్గిర నుంచి అతి జాగ్రత్తగా తడివి చూస్తూ, దాని వెన్నుమీద వేళ్ళతో నొక్కుతూ, "ఆహా, ఇదీ రహస్యం! ఇదేదో పాతపాసిన విగ్రహం అనుకున్నాను, కాదు. ఇది అతుకులమారి బొమ్మ. ఎక్కడో ఏదో ఒక భాగాన్ని కదిలిస్తే, ఇది తప్పక రెండుగా విచ్చుకుంటుంది. మాంత్రికుడు దీని పొట్టలో వుండి వుంటాడని నా అనుమానం. బహుశా, వాడు మన సంభాషణ అంతా వింటూండినా వింటుండొచ్చు," అంటూ పెద్దగా నవ్వాడు,

రాజగురువు యిలా అనగానే, సేనానీ, సైనికులూ కాలభైరవుడి విగ్రహాన్ని, తలా, కాళ్ళూ పట్టుకుని గుంజసాగారు. సైనికులకు మాత్రం ఆ విగ్రహం అంటే యింకా భయం పోలేదు. వాళ్ళేదో కాలుతున్న లోహాన్ని తాకి చూస్తున్న వాళ్ళలాగా అటూ యిటూ గెంతుతున్నారు.

ఇదంతా గమనిస్తున్న రాజగురువు, కోపంగా వాళ్ళకేసి చూస్తూ, "ఎందుకంత









"భయపడి చస్తున్నారు? మీ ప్రాణాలకేం ప్రమాదం రాదు," అని గట్టిగా కసిరాడు.

సైనికుల కా మాటల్తో ప్రాణభయం పోకపోయినా, ఉద్యోగాలకు ముప్పు వస్తుం దేమోనన్న దడుపు పుట్టింది. రాజగురువు సర్వసమర్థుడు. రాజుగారి దగ్గిర ఆయన మాటకు తిరుగులేదు. ఇలా అనుకుని సైని కులు ఎక్కడ లేని తెగువా తెచ్చుకుని కాలభైరవుడి విగ్రహాన్ని, అటూ యిటూ కుదిలించ సాగారు. వాళ్ళల్లో ఒకడు విగ్రహం తోక పట్టుకుని గుంజె సరికి, ఉరిమినట్టు ఫెళఫెళ మంటూ విగ్రహం రెండుగా చీలి పక్కలకు పడిపోయింది.



రాజగురువు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. మాంత్రికుడు కాలభైరవుడి పొట్టలోంచి కొండలోకి ఎక్కడికో ఒక రహస్య బిలమార్గం ఏర్పాటు చేసుకున్నా డన్న మాట! ఇప్పుడు వాడు ఆ బిలమార్గం లోంచి బయటికి పారిపోయి వుంటాడు. లేదా, అందులోనే ఎక్కడైనా దాక్కొని అయినా వుంటాడు.

రాజగురువు యిలా ఆలోచించి, సేనా నాయకుడితో, "సేనానీ, మాంత్రికుణ్ణి పట్టుకునే పని ఒక విధంగా సుకరమయిం దనుకుంటాను. మన సైనికులు కొండ గుహలన్నీ గాలిస్తూ వుండగా, వాడు కొండ దిగి పారిపోయేందుకు ప్రయత్నించడు. ఈ బిలం చూశావు గదా? ఇది ఎక్కడికి పోతుందో తెలియదు. కాని, మాంత్రికుడు యిందులోనే ఎక్కడో దాక్కొని వుంటాడు. మనవాళ్ళకు కాగడా లిచ్చి, బిల మంతా వెతికించు," అన్నాడు.

గుహలో మాంత్రికుడు సొంత వుపయో గానికి దాచుకున్న కాగడాలను సైనికులు, అక్కడే వున్న చమురులో తడిపి, వెలి గించి, సేనానాయకుడు ముందుండి దారి తీయగా, కాలభైరవుడి పొట్టలో నుంచి దిగు వకు వున్న బిలంలో దిగారు.









కాలభైరవుడు రెండుగా విరిగి పడినప్పుడు అయిన పెద్ద ధ్వనిని, మచ్చల సింహం గుహలో దాక్కొని వున్న కేశవుడూ, జయమల్లూ విన్నారు. సింహం గుహముందున్న బండరాయి మీద పడుకుని నిద్రమత్తుతో జోగుతున్నది.

"బ్రహ్మదండిగాడి రహస్యం సైనికులకు తెలిసిపోయింది. ఇక చూస్తే వాళ్ళు పందికొక్కును కలుగులో నుంచి లాగినట్టు బయటికి లాగుతారు," అన్నాడు జయమల్లు. ఇంతలో వాళ్ళు దాక్కున్న గుహ వెనక భాగాన అడుగుల చప్పుడు వినిపించింది.

"సైనికులకు మనం దాక్కున్న చోటు తెలిసిపోయింది!" అన్నాడు కేశవుడు, ధ్వని వచ్చిన వైపుకు చూస్తూ.

జయమల్లు ఒక్క ఎగురున వెళ్ళి, గుహ వెనక భాగాన నలుచదరంగా వున్న ఒక రాతికి అడ్డంగా, ఇనపకమ్మీ నొకదానిని తీసి, అడుగులో అడుగు వేసుకుంటూ కేశవుడి దగ్గిరకు వచ్చి, రహస్యంగా అతడితో, "ఇక మనకు ఆ వైపునుంచి ప్రమాదం రాదు. అక్కడ ఏదో నలుచదరపు రాయి వున్నదని తప్ప, అది గుహలోకి తెరుచుకునే తలుపు అని వాళ్ళు గ్రహించలేరు. ఇంతకీ బ్రహ్మదండిగాడు ఏమయినట్టు? వాళ్ళకు దొరికిపోయాడా?" అన్నాడు అనుమానంగా.

కేశవుడు జవాబు చెప్పబోయేంతలో గుహ వెనకభాగాన్నుంచి, "శిష్యా, శిష్యా," అన్న సన్నని పిలుపు వినిపించింది. ఆ స్వరం గుర్తు పడుతూనే, జయమల్లు నిలువెల్లా కంపించిపోయాడు. అతడు కేశవుడి చెవిలో రహస్యంగా, "కాలభైరవుడి విగ్రహం అడుగున ఏదో రహస్య బిలం వున్నదని నాకు తెలుసు కాని, అది సరిగా ఈ గుహలోకి వస్తుందని నే నెరగను. బ్రహ్మదండిగాడి రహస్యం సైనికులకు తెలిసిపోగానే, వాడు యిక్కడికి పారిపోయి వస్తున్నాడు. మనం ఆ నలుచదరపు రాయికి అడ్డం తీసి గుహ





లోకి దారి యిచ్చామో, మనం కూడా సైనికులకు చిక్కిపోతాం. అందుకని మనం గుట్టు చప్పుడు కాకుండా వూరుకో వటం మంచిది," అన్నారు.

ఈలోపల బ్రహ్మదండి మాంత్రికుడు, శిష్యా, శిష్యా, అంటూ చాలా సార్లు కేకలు పెట్టి, గుహ వెనుకభాగాన్ని తన మంత్ర దండంతో కొట్టసాగాడు. కాని, అతడికి యివతలి నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. కేశవుడూ, జయమల్లూ కిక్కురుమనకుండా గుహలో ఒక మూలకొదిగి కూర్చున్నారు.

అక్కడ రాజగురువు ఆజ్ఞ విని బిలంలోకి దిగిన సేనానాయకుడూ, సైనికులూ, మాంత్రికుడు వెళ్ళిన మార్గం కనుక్కోలేక, పక్కదారుల వెంట చాలాసేపు తిరిగి, చీకటి కొణాల్లో నానా అవస్థలూ పడి, కొంత సేపటికి రాజగురువున్న చోటుకు తిరిగి వచ్చారు. "మాంత్రికుడు దొరకలేదా ?" అని అడిగాడు రాజగురువు.

"గురువర్యా, వాడా బిలంలో వున్న సూచనలేం కనిపించ లేదు. బిల మార్గం ఎక్కడా సూటిగా లేదు. చేతివేళ్ళలా అందులో అన్ని వైపులకూ సొరంగ మార్గాలున్నై. వాడెక్కడా కనిపించలేదు," అన్నాడు సేనానాయకుడు.

"అలాగా," అంటూ రాజగురువు కొంచెంసేపు ఆలోచించి, "వాడు, ఈ బిలంలోని, ఏ సందుల్లోనో దాగివున్నాడనే దాంట్లో సందేహం లేదు. వాణ్ణి బయటికి రప్పించటానికి ఒకే మార్గం వున్నది. మీరంతా వెళ్ళి ఎండుపుల్లలూ, ఆకలములూ పోగుచేసుకు వచ్చి, బిలమార్గాన్ని వాటితో నింపి, నిప్పు పెట్టండి. వాడు ఆ పొగకు తట్టుకోలేక, ఏదో ఒక సొరంగం నుంచి బయటికి వస్తాడు. అప్పుడు పట్టుకోవచ్చు," అన్నాడు

సైనికులు బిలద్వారాన్ని ఎండు పుల్లలతో నింపి, దానిమీద యింత చమురు పోసి, నిప్పంటించారు. —(ఇంకా వుంది)





# రాకాసి లోయ

## 9

[రాజగురువు వెంట వచ్చిన బ్రహ్మపుర సైనికులు బ్రహ్మదండి మాంత్రికుడి కోసం, గుహ అంతా గాలించి, చివరకు కాలభైరవుడి విగ్రహం కిందవున్న బిలాన్ని కనుక్కున్నారు. వాణ్ణి ఊదర పెట్టి బయటికి రప్పించేందుకు రాజగురువు, బిల ద్వారాన్ని ఎండు పుల్లలతో మూయించి, వాటి మీద చమురుపోసి నిప్పు పెట్టించాడు. తరవాత—]

చమురుతో బాగా తడిసిన ఎండుపుల్లలూ, ఆకలములూ క్షణాల మీద నిప్పంటుకుని పెద్ద జ్వాలలతో బిల మార్గాన్ని కప్పివేసినై. చూస్తూండగానే నల్లని పొగ గుహ అంతా ఆక్రమించింది. రాజగురువూ, సేనానీ, సైనికులూ గుహ బయటికి పరిగెత్తారు.

"గురువర్యా, మీరన్నట్టు మాంత్రికుడు బిలంలో ఎక్కడో దాక్కుని వుంటాడు. వాడు తప్పక ఈ మంటల్లో పడి ఆహుతి అవుతాడని నా ధైర్యం," అన్నాడు సేనాని.

రాజగురువు గుహలో మరింతగా కమ్ముకుంటున్న పొగకేసి చూస్తూ, "వాడు అంత తేలిగ్గా చచ్చేరకం కాదు. వాడికి ఆ బిలంలో నుంచి బయటపడేందుకు మరో మార్గం తప్పకుండా వుంటుంది. వా డెక్కడో ఒక చోట కొండ మీదికి తేలుతాడు. సైనికుల్ని కాపుంచి, వాడు తల బయట పెట్టగానే పట్టుకోమని ఆజ్ఞాపించు," అన్నాడు.

రాజగురువు యిలా మాట్లాడుతున్న సమయంలో బ్రహ్మదండి మాంత్రికుడు మచ్చల







సింహం గుహ వెనక భాగానికి చేరి; తన శిష్యుణ్ణి పిలుస్తున్నాడు. వాడు తన మంత్రదండంతో ఎన్నిసార్లు రాతి మీద కొట్టినా జయమల్లు దానికి అడ్డంగావున్న ఇనపకమ్మిని తొలిగించి, ఆతడికి మార్గం యివ్వలేదు.

బ్రహ్మదండి మాంత్రికుడివి, పాము చెవులు. వాడు గుహలో తన శిష్యుడూ, కేశవుడూ మెల్లిగా మాట్లాడుకుంటూ వుండటం పసిగట్టాడు. తను చేసిన శబ్దం వాళ్ళకు వినబడిందని, కాని వాళ్ళు తనను గుహలోకి రానివ్వదలచలేదని వాడు గ్రహించాడు. "హుఁ, యిదా మీ ఎత్తుగడ! నన్ను బ్రహ్మపుర సైనికులకు బందీనిచేసి, రాకాసి లోయలో వున్న అమూల్య సంపదలను దొంగిలించాలని చూస్తున్నారా? పిల్లకాకి కేమి తెలుసు ఉండేలి దెబ్బ!" అని మనసులో అనుకుంటూ, మంత్రదండాన్ని ఎత్తి రాతి మీద బలంగా కొట్టి, "ఒరే ద్రోహి, శిష్యా! నువ్వూ, ఆ గొర్లకాపరి గుహలోవున్నారని నాకు తెలియదనుకుంటున్నావా? నా మంత్రశక్తితో మిమ్మల్నిద్దర్నీ ఈ క్షణాన భస్మీపటలం చెయ్యమంటారా, రాతిని పక్కకు జరుపుతారా?" అని కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే కేశవుడూ, జయమల్లూ కూడా ఉలిక్కిపడ్డారు. జయమల్లు అంతలోనే తేరుకుని, "కేశవా, ఆ దుర్మార్గుణ్ణుంచి మన కెలాంటి ప్రమాదమూరాదు. బ్రహ్మపుర సైనికుల వెంట వచ్చిన ఒకడు వాడి మంత్రశక్తిని హరించి, ఎప్పుడో నోరు కట్టేశాడు. వాణ్ణి సైనికులు తప్పకుండా పట్టుకుంటారు. మనం యిక్కడ దాక్కున్నామనేది బ్రహ్మదండిగాడికి తెలిసిపోయింది గనక, వాడు పగ సాధించేందుకు, మననీ సైనికులకు పట్టిస్తాడు. కనక, మనం యిక్కణ్ణించి పారిపోవాలి," అన్నాడు.

జయమల్లు చెప్పింది కేశవుడికి సబబుగానే కనబడింది. కాని, అన్ని వైపులా







సైనికులు తమ కోసం గాలిస్తుండగా పారిపోవటం ఎలా?

హఠాత్తుగా గుహ వెనక భాగాన్నుంచి బ్రహ్మదండి పెద్దగా దగ్గిన ధ్వని, ఆ వెంటనే, "అయ్యో, నా ఉగ్రభైరవుణ్ణి పునాది నుంచి పెళ్ళగించి అవతల పారేశారా? ఏమిటీ పొగ? చచ్చాను, చచ్చాను! బిలంలో నుంచి బయటపడవలసిందే! రాజభటులకు చిక్కి నానా హింసలూ పడవలసిన యోగం రాసిపెట్టివున్నది. హా, రక్షకా, కాలభైరవా!" అంటూ కేకలు పెట్టటం కేశవుడూ, జయమల్లూ విన్నారు.

"సైనికులు బిలమార్గాన ఏదో చీదర పెట్టి, బ్రహ్మదండిగాణ్ణి ఎలుకను కలుగులోంచి లాగినట్టు లాగబోతున్నారు," అన్నాడు జయమల్లు.

"ఒరే ద్రోహి, శిష్యా! నీ మాటలన్నీ నాకు వినబడటం లేదనుకున్నావా?" అంటూ బ్రహ్మదండి పెద్దగా హుంకరించి, తెరలు తెరలుగా దగ్గుతూ, "ఈ బిలంలోంచి కొండ మీదికి వెళ్ళే మార్గం నాకు తెలుసు. అలా వెళ్ళితే నన్ను సైనికులు తప్పకుండా పట్టుకుంటారు. ఇక్కడ పొగలో చిక్కి ఊపిరాడక చచ్చేకన్న, అదే కొంత నయం. కాని, సైనికులకు మీ రెక్కడ



దాక్కొనివున్నారో చెప్పి, మిమ్మల్ని వాళ్ళ చేత చిత్రవధ చేయిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే మాంత్రికుడు గుహ వెనక భాగాన్నుంచి వెళ్ళిపోతున్న సూచనగా, కాళ్ళచప్పుడు వినిపించింది. జయమల్లుకు బ్రహ్మదండి అన్నంతపని చేస్తాడన్న భయం కలిగింది. అతడు కేశవుణ్ణి కూచున్నచోటునే వుండమని చెప్పి, గుహ ద్వారం దగ్గిరకు వచ్చి బయిటికి తొంగిచూశాడు. అతడి దృష్టికి దూరంగా ఎక్కడో ఒక సైనికుడు ఒక బండరాతి మీద నిలబడి వుండటం కనిపించింది. వాడు గుహ కేసి కాక మరో వైపుకు చూస్తున్నాడు.









జయమల్లు చప్పున గుహలోకి వెళ్ళి, "కేశవా, మనం పారిపోవాలంటే యిదే మంచి అదనులాగా కనబడుతున్నది. బ్రహ్మదండి, సైనికులకు మనం దాక్కున్న చోటు చెప్పేస్తాడు," అన్నాడు.

కేశవుడు చప్పున లేచి నిలబడి జయమల్లు వెంట గుహద్వారం దగ్గిరకు వచ్చాడు. అంతలో దూరం నుంచి పెద్ద కలకలం వినబడింది. బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు కంచులా మార్మోగుతున్నది. సైనికులు కేకలు పెడుతున్నారు. కేశవుడూ, జయమల్లూ ఓ త్రుటికాలం నిశ్చేష్టులై ఏమి చెయ్యటమా అని ఆలోచించేంతలో, చేత



కత్తి పట్టుకుని ఒక వృద్ధుడు రాళ్ళచాటు నుంచి బయిటికివచ్చి, గుహ ముందున్న మచ్చల సింహాన్ని చూస్తూనే టక్కున నిలబడిపోయాడు.

"ఇదుగో, మీ అయ్య, కేశవా!" అన్నాడు జయమల్లు. కేశవుడు ఆశ్చర్యంగా తండ్రి కేసి చూశాడు. జయమల్లు చెయ్యి ఊపుతూ, "సింహం నిన్నేమీ చెయ్యదు, భయంలేదు, రా," అంటూ పిలిచాడు. కేశవుడి ముసలి తండ్రి చుట్టూ ఓ మారు కలయచూసి, రాళ్ళచాటుగా నక్కుతూ .గుహ కేసి రాసాగాడు.

దూరంగా అప్పటివరకూ పెద్దగా మంత్రం పఠిస్తున్న బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు చప్పున ఆగిపోయింది. అతడికి ఎదురుగా రాజగురువు కనిపించి, కమండలం లోంచి యింత నీరు తీసి గాలిలోకి విదిలిస్తున్నాడు. అది చూస్తూనే మాంత్రికుడికి నోరు నొక్కుకుపోయినట్టయింది. "హా, కాలభైరవా, నువ్వే నాకు దిక్కు!" అంటూ బ్రహ్మదండి వున్నచోటనే కుప్పగా కూలిపోయాడు.

"కాలభైరవుడికే దిక్కులేక, రెండుగా ముక్కలై గుహలో పడివున్నాడు. ఇంతకూ నీ పేరేమిటి, మాంత్రిక శిరోమణీ!" అంటూ










రాజగురువు చిరునవ్వు నవ్వుతూ బ్రహ్మదండిని సమీపించాడు.

రాజగురువునూ, అతడి వెనక కత్తులు పట్టివున్న సైనికులనూ చూస్తూనే బ్రహ్మదండి మాంత్రికుడు ప్రాణభయంతో విలవిలలాడాడు. "మహారాజా, నా పేరు బ్రహ్మదండి మాంత్రికుడు," అన్నాడు తడబడుతూ.

"నువ్వు చాలా గొప్ప మాంత్రికుడవను కున్నాను! రాజెవరో, రాజగురు వెవరో కూడా గ్రహించలేనంత బుద్ధిహీనుడివా?" అంటూ రాజగురువు మాంత్రికుడి తలమీది శిగ పట్టి పైకి లేవనెత్తాడు.



"మహాఘనత వహించిన రాజగురు శేఖరులు నన్ను కాపాడాలి. నేను మీ దాసాన దాసుణ్ణి!" అంటూ బ్రహ్మదండి ప్రాణ భయంతో వణికి పోసాగాడు.

"ఏ ప్రయోజనం ఆశించి నువ్వు అడవిలో బ్రహ్మపుర సేనానిని చంపావ్?" అంటూ రాజగురువు బ్రహ్మదండి శిగ గుప్పెటలో బిగించి అటూ యిటూ ఊపాడు.

"రాజగురుశ్రేష్ఠా! సేనానిని చంపింది నేను కాదు, నా శిష్యుడు. వాడు గురుద్రోహి. నేను వద్దని ఎంత వారించినా వినక, సేనానిని హత్యచేశాడు," అన్నాడు బ్రహ్మదండి.

శిష్యు డన్నమాట వింటూనే రాజగురువు మాంత్రికుడి శిగ పట్టు విడిచి, "అన్నట్టు వాళ్ళ మాటే మరిచాను. నీ యిద్దరు శిష్యులూ ఎక్కడ? ఊఁ చెప్పు?" అంటూ కళ్ళురిమాడు.

"రాజగురు శిఖామణీ! వాళ్ళల్లో ఒకడే నా శిష్యుడు, రెండోవాడు అడవిలో గొడ్లను కాచుకునే మూర్ఖుడు. వాళ్ళిద్దరూ కలిసి ఈ ప్రాంతాల చేయని కిరాతకం అంటూ లేదు," అన్నాడు బ్రహ్మదండిమాంత్రికుడు.

"నే నడిగింది వాళ్ళెక్కడ దాక్కొని వున్నారని? నువ్వు వాళ్ళుచేసిన కిరాతకాల










మాట చెపుతున్నావ్. శిష్యులు చేసిన అపచారాలకు బాధ్యత గురువుదన్న సంగతి నాకు తెలును. వాళ్లెక్కడ?" అంటూ రాజగురువు, మాంత్రికుణ్ణి గద్దించాడు.

"రాజగురు చూడామణీ! ఆ ద్రోహులిద్దరూ మచ్చల సింహం గుహలో దాక్కుని వున్నారు. వాళ్ళను వెంటనే పట్టి బంధించకపోతే రాకాసిలోయకు వెళతారు. నా గాడిదమారి శిష్యుడు జయమల్లుకు, ఆ రాకాసిలోయ గురించి సర్వం తెలును. వాడు దొంగచాటుగా వుండి, కేశవుణ్ణి పూనిన కాలభైరవుడు చెప్పిందంతా విన్నాడు," అన్నాడు బ్రహ్మదండి,

రాకాసిలోయ అన్న పేరు వింటూనే రాజగురువు ఆశ్చర్యపడ్డాడు. అలాంటి పేరు లోగడ అత డెన్నడూ విని వుండలేదు. మాంత్రికుడు కొండ మీద చేరి కాలభైరవుణ్ణి ఉపాసించటానికీ, సేనాని హత్యకూ— వీటన్నిటికీ వెనక ఈ రాకాసిలోయ కథ ఏదో వున్నదని ఆయనకు తెలిసిపోయింది.

రాజగురువు యిలా ఆలోచించి, తన వెంటవున్న సైనికులతో మాంత్రికుడు చెప్పిన గుర్తుల ఆధారంతో మచ్చలసింహం గుహలో వున్న కేశవుణ్ణీ, జయమల్లునూ పట్టుకు రమ్మన్నాడు. సైనికులు అటుకేసి పరిగెత్తారు. వాళ్ళకు ముసలివాడితో కలిసి వెళుతున్న కేశవుడూ, జయమల్లూ కనిపించారు. సైనికులు పైన రాళ్ళగుట్టల మీద వుండి, కింద నడుస్తున్న ముసలివాడితో, "ఏయ్ ముసలీ! వాళ్ళనెక్కడికి తీసుకు పోతున్నావ్?" అని కేకవేశారు.

ఆ కేక వింటూనే కేశవుడి ముసలితండ్రి ఏ మాత్రం తొట్రుపాటు చూపించక, "నేను ఈ దుర్మార్గుల్ని తీసుకుపోవటం లేదు, రాజగురువు వద్దకు అడ్డదారిన తీసుకు వస్తున్నాను. నా కొచ్చే బహుమానం కాజెయ్యాలని వుందేమో, జాగర్త! మీ దారిన మీరు పొండి," అంటూ పెద్దగా అరిచాడు.






"ఈ చావబోయే వయసులో కూడా ముసలివాడికి డబ్బంటే ఎంత ఆశ!" అనుకుంటూ సైనికులు వెనుదిరిగి రాజగురువు దగ్గిరకు బయలుదేరారు.

రాజగురువుకు రాకాసిలోయను గురించిన సంగతి సందర్భాలు తెలుసుకోవాలని వున్నా, అది శిష్యులుకూడా దొరికిన తరవాత బ్రహ్మదండిని వాళ్ళ ఎదట ప్రశ్నించటం మంచిదనుకున్నాడు. అప్పుడు వాడు అబద్ధాలు చెప్పేందుకు అవకాశం వుండదు.

రాజగురువు అన్నిటికన్న ముందుగా బ్రహ్మదండి మాంత్రికుడి గర్వం అణచాలని నిశ్చయించుకున్నాడు. ఆయన సేనానాయకుణ్ణి పిలిచి, "ఈ బ్రహ్మదండిని కాళ్ళూ చేతులూ బిగించి, అడవి పందిని వేలాడ కట్టినట్టు కావడికర్రకు వేలాడకట్టి మన సైనికుల చేత నగర ద్వారం వద్దకు మోయించుకు రావాలి. ఒక సైనికుణ్ణి ముందుగా నగరంలోకి పంపి, పౌరులందరికీ మాంత్రికుడు పట్టుపడిన కారణంగా, ఈ రోజు పర్వదినమని చాటింపు వేయించాలి. ఎందుకైనా మంచిది; యిద్దరు సైనికుల్ని ఏడి గుహకు పగలూ రాత్రికూడా కాపలా వుంచు," అన్నాడు.

రాజగురువు ఆజ్ఞ వింటూనే సైనికులు బ్రహ్మదండి మాంత్రికుణ్ణి పట్టుకుని తాళ్ళతో కాళ్ళూ చేతులూ కట్టేశారు. తరవాత ఒక లావుపాటి కర్రతెచ్చి, దానికి వాణ్ణి అడ్డంగా వేలాడకట్టి, కర్రచివరల్ని ఇద్దరేసి చొప్పున భుజాన వేసుకుని కొండ దిగువకు బయలుదేరారు. బ్రహ్మదండి మాంత్రికుడు కర్ర ఊపుకు అటూ యిటూ ఊగుతూ, "అయ్యో, ఉపాసకుల ఊడలమర్రీ, ఉన్మత్తభైరవా! నాకెంత అవమానం తెచ్చిపెట్టావోయీ," అంటూ విలపించసాగాడు.

రాజగురువు చిరునవ్వు నవ్వుతూ కొండ దిగువున చెట్టుకు కట్టేసివున్న తన గుర్రం కేసి నడిచాడు. —(ఇంకా వుంది)






# 10

[బిలమార్గాన్ని తవ్వి వేసిన పొగలో చిక్కుకున్న బ్రహ్మదండి మాంత్రికుడు, తన శక్తిని వినియోగించి బయట పడేందుకు ప్రయత్నించాడు. కాని, సాధ్యం కాలేదు. వాడు బిలంలో నుంచి బయటికి వచ్చి, రాజగురువుకు చిక్కిపోయాడు. ఆయన వాణ్ణి కర్రకు వేలాడ గట్టించి, నగరానికి తీసుకుపొమ్మని భటులకు ఆజ్ఞ ఇచ్చాడు. తరవాత—]

సేనానాయకుడు ముందుగా నగరంలోకి పంపిన సైనికుడు, తప్పెటలూ, తాషా మర్పాలూ వాయించే కొందరిని వెంటబెట్టుకుని, నగరంలో చాటింపు వేయించాడు.

చాటింపు వింటూనే జనం గుంపులు గుంపులుగా చేరి కేకలు పెడుతూ, జనం ఉత్సవాలు ప్రారంభించారు. చాలామంది బ్రహ్మదండి మాంత్రికుణ్ణి చూసేందుకు నగర ద్వారం దగ్గిరకు వెళ్ళారు. ముందుగా ద్వారం దాటి నగరం ప్రవేశించినవాడు రాజగురువు. ఆయన శక్తి సామర్థ్యాలవల్లనే మాంత్రికుడు పట్టుబడ్డాడన్న వార్త విన్న ప్రజలు ఆయనకు గొప్పగా స్వాగతం ఇచ్చారు. ఆయనకు చేతులెత్తి అందరూ జేజేలు పలికారు.

కొద్దిసేపటి తరవాత సేనానాయకుడూ, అతడికి వెనకగా కావడి బద్దకు వేలాడుతున్న మాంత్రికుడితో సైనికులూ నగర ద్వారం సమీపించారు. మాంత్రికుణ్ణి ఆ స్థితిలో చూసి, ప్రజలు అవహేళన









సర్వసంపదలతో రాజ్యాలి జయిందాలనుకున్న బ్రహ్మదండి, యిప్పుడు తన నీచ స్థితికి కళ్లవెంట నీరు కార్చసాగాడు. వాడు తనను చుట్టు ముట్టి దుర్భాషలాడుతున్న ప్రజలతో, "అయ్యలారా, నన్ను క్షమించండి, కరుణించండి! బుద్ధి గడ్డి తినటం వల్ల, ఏవేవో పొరపాట్లు చేశాను. వింత జంతువు ఆకారం ధరించి, అడవిలో నానా బీభత్సం చేసినవాడూ, సేనానాయకుణ్ణి చంపినవాడూ, జయమల్లనే నా గాడిదమారి శిష్యుడు. నేను కాదు. చేతనయితే వాణ్ణీ, వాడి వెంట వున్న కేశవుడనే గొర్ల కాపరిని పట్టుకోండి," అంటూ బావురు మన్నాడు.

చేస్తూ పెద్ద గోల ప్రారంభించారు. కొందరు మాంత్రికుణ్ణి సిగ పట్టుకుని అటూ యిటూ ఊపారు. మరికొందరు వాణ్ణి తిట్టుతూ కొట్టబోయారు. సేనానాయకుడు వాళ్ళను వారిస్తూ, "మాంత్రికుడికి ఎలాంటి హాని జరక్కూడదు. ఇది మహారాజు ఆజ్ఞ. వీడికి తెలిసిన ఒక రహస్యం వల్ల మన రాజ్యం సుభిక్షంగానున్నది. ప్రజలందరూ వెండి బంగారాల్లో మునిగి తేలవచ్చు." అన్నారు.

బ్రహ్మదండి మాంత్రికుడు ప్రజలు చేసే కోలాహలం, వాళ్ళనే ఈసడింపు మాటలూ విని అవమానంతో, భయంతో, వణికి పోయాడు. రాకాసిలోయలో లభించనున్న

బ్రహ్మదండి మాంత్రికుడు అన్న మాటలు విన్న ప్రజలు, సైనికులను జయమల్లు గురించి, కేశవుణ్ణి గురించి అడిగారు. దానికి జవాబుగా సైనికులు, ఆ ఇద్దరూ కొండల్లో ఎక్కడో కనిపించకుండా దాక్కున్నారని చెప్పారు. ఆ వెంటనే, కొత్త తెగింపూ, కొండంత ఉత్సాహమూ గల కొందరు యువకులు, కర్రలూ, ఈటెలూ తీసుకుని, అడవికేసి పరిగెత్తారు.

కేశవుడూ, అతని ముసలి తండ్రీ, జయమల్లూ, కొండల్లోని, ఏనుగుల కొలను దాటి అవతల వున్న అరణ్యం చేరారు. చెట్టు








కొమ్మల్లో వుండి, బ్రహ్మపుర నగరానికేసి చూస్తున్న కేశవుడికి, కొందరు మనుషులు బిల్లుబిల్లుగా అడవిదార్ల వెంట బయలుదేరి, కొండకేసి రావటం కనిపించింది. తమకోసం కొండంతా గాలించిన బ్రహ్మపుర సైనికులు, తలలు వాల్చుకుని కొండ దిగి నగరం కేసి పోతున్నారు.

నగరం నుంచి వచ్చేవాళ్ళ చేతుల్లో వున్న కర్రలూ, ఈటెలూ చూస్తూనే కేశవుడు తమకు వాళ్ళ నుంచి ప్రమాదం రానున్నదని గ్రహించాడు. ఆ వెంటనే అతడు చెట్టు దిగి వచ్చి, తన తండ్రికీ, జయమల్లుకూ, రానున్న ఆపదను గురించి చెప్పాడు. జయమల్లూ, ముసలివాడూ కూడా చెట్టు ఎక్కి చూశారు. వాళ్ళక్కూడా నగరం వైపు నుంచి వస్తున్న యువకులు కనిపించారు.

ఆ ఇద్దరూ చెట్టు దిగి వచ్చారు. జయమల్లు కేశవుడితో, "సైనికుల కన్న, ఈ వచ్చేవాళ్ళు ఎక్కువ ప్రమాదకారులు. వీళ్ళు వందల సంఖ్యలో వస్తున్నారు. కనక వాళ్ళు మొత్తం కొండనూ, చుట్టూ వున్న అరణ్యాన్నీ చుట్టు ముట్టినా ముట్టవచ్చు. అలా జరిగితే, మనం చిక్కుల్లో పడిపోతాం. ఇప్పుడు అరణ్యం



లోపలి భాగానికి పారిపోయేందుక్కూడా మనకు ఆట్టే సమయం లేదు," అన్నాడు.

కేశవుడికీ, ముసలివాడిక్కూడా అలాగే అనిపించింది. తాము బ్రహ్మపుర వాసులకు చిక్కితే, నానా కష్టాలపాలూ కావలసి వస్తుంది. రాజభటులకు చిక్కిపోయిన బ్రహ్మదండి మాంత్రికుడు తమ మీద పగ బట్టి వున్నాడు. హఠాత్తుగా ముసలివాడికి ఒక ఉపాయం తోచింది. అతడు కేశవుడితో, జయమల్లుతో యిలా అన్నాడు:

"నన్ను ఏవైనా అడవి తీగలు తెచ్చి కాళ్ళూ చేతులూ కట్టి, ఆ కనబడే రాతి మీద పడుకో బెట్టండి. మీరు వెంటనే బాగా









అరణ్యం లోపలికి పారిపోండి. మన కోసం వెతికే మనుష్యులకు మీరు దొరకకుండా నే చూస్తాను."

ఇందుకు కేశవుడు ఒప్పుకోలేదు. జయమల్లుకూడా అభ్యంతరం చెప్పాడు. రాజ సమక్షంలో లోగడ ముసలివాణ్ణి చూసి వున్నాడు గనక, బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యులు పారిపోయేందుకు సహాయపడ్డాడన్న కారణం చెప్పి, అతణ్ణి శిక్షించ గలిగినవాళ్ళు నమ్మారు. కాని, ముసలివాడు పట్టు పట్టాడు. ముగ్గురూ శత్రువులకు దొరికి పోయేకన్న, కనీసం ఇద్దరయినా సుర క్షితంగా వుండటం మేలుకాదా? అన్నాడు.



"నన్ను, మీ యిద్దరూ పట్టుకుని కాళ్ళూ చేతులూ కట్టి పడవేసి పారిపోయారని చెప్తాను. ముసలివాణ్ణి; నా మాట వాళ్ళెందుకు నమ్మరు?" అని ప్రశ్నించాడు కేశవుడి తండ్రి.

చివరకు ముసలివాడి బలవంతం మీద చేసేదేమీ లేక, జయమల్లు అతణ్ణి అడవి తీగలతో కాళ్ళూ చేతులూ కట్టి, ఒక ఎత్తయిన రాతి మీద పడుకో బెట్టారు. తరవాత కేశవుడూ, తనూ ప్రమాదం తొలగగానే, వచ్చి కలుసుకుంటామని చెప్పి, అరణ్యం లోపలికి పరుగు తీశారు.

కొద్ది సేపటికల్లా, బ్రహ్మపుర నగర వాసులు కొండలూ గుట్టలూ గాలిస్తూ చేసే కోలాహలం ముసలివాడు విన్నాడు. అతడు గొంతెత్తి బిగ్గరగా, "రక్షించండి! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే బ్రహ్మపురం వాళ్లు కొందరు కర్రలూ, ఈటెలూ ఊపుకుంటూ అక్కడికి వచ్చి, ముసలివాణ్ణి చూసి ఆశ్చర్యపోయారు. "అయ్యా, నా కట్లు విప్పి కాపాడండి. మీరు మాంత్రికుడి శిష్యుల కోసం కొండ కోనలన్నీ గాలిస్తున్నా రని నాకు తెలుసు. వాళ్ళే నాకీ దుస్థితి కలిగించారు," అన్నాడు.











ఆ వెంటనే నలుగురైదుగురు యువకులు ముసలివాడి కట్లు విప్పసాగారు. కొందరు, "వాళ్ళెటు పోయారు? అరణ్యంలోనే దాక్కున్నారా?" అని ప్రశ్నించారు.

"అయ్యో, వాళ్ళు కాలాంతకులు. పులిని తెలియకుండా దాని పాలు పితికే రకం. మీరు వాళ్ళ కోసం అరణ్యాలన్నీ గాలిస్తారని గ్రహించి, బిచ్చగాళ్ళలాగా వేషాలు మార్చుకుని, బ్రహ్మపురం కేసి పరిగెత్తారు." అన్నాడు ముసలివాడు.

అక్కడ చేరిన వాళ్ళంతా హా హా అని ముక్కుల మీద వేళ్ళు వేసుకున్నారు. వాళ్ళల్లో బాగా తెలివిగలవాణ్ణనుకునే ఒకడు, "ఎంత మోసం! మనం ఎక్కడైతే వాళ్ళ కోసం వెతకమో అక్కడికే వెళ్ళారన్న మాట! రాజద్రోహులని తెలిసిపోయిన తరవాత ఎవరైనా నగరం వదిలి అరణ్యాల్లోకి పారిపోతారు. వీళ్ళు అరణ్యాలు వదిలి నగరంలోకి పారిపోయారు! అందువల్లనే వాళ్ళు మన సైనికులకు దొరకలేదు!" అన్నాడు.

ఈ విధంగా ముసలివాడి మాటల్లో అందరికీ నమ్మకం కుదిరిపోయింది. వెంటనే వాళ్ళు, జట్లు జట్లుగా అన్ని వైపులకూ పరిగెత్తుతూ, "ఓహో! మాంత్రికుడి శిష్యులిద్దరూ బిచ్చగాళ్ళ వేషాలు వేసుకుని నగరం కేసి పారిపోయారోహో!" అంటూ కేకలు పెట్టారు.

వెంటనే జనం నగరంలో ఉన్న బిచ్చగాళ్ళందర్నీ దొరక పుచ్చుకునేందుకు నగరం కేసి పరిగెత్తారు.

బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుల వేటకు బయలుదేరిన ప్రజలు తిరిగి నగరంలోకి గుంపులు గుంపులుగా వస్తూండగా, రాచనగరులో బ్రహ్మదండి మాంత్రికుడు రాజుగారి ముందు చేతులు కట్టుకు నిలబడి, తనకు ప్రాణభిక్ష పెట్టవలసిందిగా ఆయన్ని బతిమాలుకుంటున్నాడు.







రాజుగారూ, రాజగురువూ, మంత్రీ, సేనానాయకుడూ మాంత్రికుణ్ణి ప్రశ్నించి రాళాసిలోయ రహస్యమేదో తెలుసుకోవాలని చూస్తున్నారు. కాని, ముందుగా తనకు ప్రాణహాని జరగదని అభయం ఇస్తే తప్ప, తను ఆ రహస్యం చెప్పనని మాంత్రికుడు పట్టుపడుతున్నాడు.

"నీకేమి ప్రాణాపాయం కలగదని రాజుగారి పక్షంగా నేను అభయం ఇస్తున్నాను," అన్నాడు రాజగురువు. రాజు అంగీకార సూచకంగా తలాడించాడు.

'రాళాసిలోయలో ఏవో అపూర్వ ధనరాసులున్నవని నువ్వు చెప్పేమాట నిజమా? నిజమైతే అందుకు ఋజువేమి చూపిస్తావు?" అని అడిగాడు రాజగురువు, మాంత్రికుణ్ణి.

"ఋజువా? రాజగురు మహాశయా! ఆ పర్వతాల లోయల మధ్య. ఉన్మత్త భైరవుడు స్వయంగా ప్రత్యక్షమై చెప్పగా, ఈ చెవులతో విన్నాను. అంతకన్న ఋజువేమి కావాలి?" అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు.

"ఆ మాటలు నమ్మదగినవేనా?" అని ప్రశ్నించాడు రాజగురువు.

"భైరవా, భైరవా! పాపం హరించుగాక!" అంటూ మాంత్రికుడు రెండు చెవులూ మూసుకుని, "ఇరవైయేళ్ళుగా, ఆ భైరవేంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకునేందుకు నిష్ఠతో ఉపాసన చేశాను. అందుకు, ఆ రాళాసిలోయ చేరేందుకు తోడ్పడవలసిన శిష్య బాలకుణ్ణి కూడా పట్టుకున్నాను. తమరు నా మాటల్లో నమ్మకం ఉంచకపోతే, ఇక నాకా కాలభైరవుడి పాదమే శరణ్యం!" అంటూ భక్త్యావేశంలో ముందుకు పడిపోయాడు.

"గురువర్యా, వీడు దుష్టుడైనా, గొప్ప భక్తుడిలా వున్నాడు," అంటూ రాజు ఆశ్చర్యం కనబరిచాడు. అంతలో ద్వారం





పెద్ద కలకలం బయలుదేరింది. సేనానాయకుడు అక్కడికి వెళ్ళాడు. ఇద్దరు సైనికులు రొప్పుతూ రొస్తూ, అతడి ముందుకు వచ్చి నిలబడ్డారు. వాళ్ళను చూస్తూనే రాజగురువు చేయి చూపి, "లోపలికి రండి! ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"అయ్యా, నగరంలోని యువకులు, కనపడిన పిచ్చిగాళ్ళనల్లా పట్టుకుని, 'నువ్వు మాంత్రికుడి శిష్యుడివేనా, నిజం చెప్పు?' అని గొడ్డును బాదినట్టు బాదుతున్నారు. అడ్డంపోయిన మా మీదకూడా వాళ్ళు కర్రలెత్తుతున్నారు," అని చెప్పారు సైనికులు.

"ఏమిటి వింత?" అంటూ రాజు, సేనాని కేసి చూశాడు.

"బ్రహ్మదండి శిష్యులిద్దరూ, పిచ్చిగాళ్ల వేషాలు వేసుకుని, నగరంలో తిరుగుతున్నారని ఒక పుకారు పుట్టింది. అందులో వున్న నిజమెంతో తెలీదు," అన్నాడు సేనానాయకుడు.

రాజగురువు దగ్గర పడివున్న మాంత్రికుణ్ణి కాలితో తన్ని, "బ్రహ్మదండీ. లేలే. విన్నావా ఈ పుకారు! పిచ్చిగాళ్ళ వేషంలో వున్న, నీ శిష్యుల్ని గుర్తు పట్టగలవా?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు చప్పున లేచి నిలబడుతూ, "గురు ప్రభూ! వాళ్ళను పిచ్చిగాళ్ళ వేషంలో కాదు, మహారాజుల వేషంలో వున్నా గుర్తుపట్ట గలను," అన్నాడు ధీమాగా. అప్పటివరకూ నోరు మెదపకుండా వున్న మంత్రి, "అయితే, మహారాజా! నగరంలో వున్న పిచ్చిగాళ్ళందర్నీ పట్టుకుని యిక్కడికి రప్పించమన్నారా?" అని అడిగాడు. రాజుగారు సరే నన్నట్టు తల వూపాడు. మంత్రి సేనానాయకుడూ గది నుంచి బయటికి వెళ్ళారు. వాళ్ళ ఆజ్ఞ కాగానే సైనికులు పిచ్చిగాళ్లందర్నీ వెతికి పట్టుకు వచ్చేందుకు, నగరం లోని అన్ని వీధులకూ పరిగెత్తారు. —(ఇంకా వుంది)






## 11

[బ్రహ్మదండి మాంత్రికుడు పట్టుబడిన తరవాత, జయమల్లూ, కేశవుల కోసం నగర వాసులు కొండలన్నీ గాలించ సాగారు. వాళ్ళిద్దరూ చిప్పగాళ్ళ వేషాలు వేసుకుని నగరం లోకి పారిపోయారని, కేశవుడి ముసలి తండ్రి వాళ్ళతో చెప్పాడు. ఆ సంగతి విన్న రాజగురువు, చిప్పగాళ్ల నందర్నీ పట్టి తెచ్చేందుకు సైనికులను పంపాడు. తరవాత—]

రాజగురువు పంపిన సైనికులూ, నగరం లోని ఉత్సాహవంతులైన యువకులూ కలిసి, కొండలమీద కనబడిన చిప్పగాళ్లందర్నీ పట్టుకుని, రాజనగరు కేసి నడిపించుకు రాసాగారు. ఇలా దొరికిన వాళ్లల్లో కేవలం చిప్పగాళ్ళేగాక, ఊదా బిక్ష్యాజనం కూడా వున్నారు. మాసిన దుస్తులు ధరించి వున్న వాళ్ళా, చిరుగుల వస్త్రాలు కట్టుకున్నవాళ్లూ కూడా చిప్పగాళ్ళకిందే జమ కట్టబడటంతో, వాళ్ళ సంఖ్య వందలూ వేలూ దాటింది.

రాజ ప్రాసాదం ఆవరణలో మందవేయ బడిన వీళ్ళందర్నీ చూసి, రాజుగారు చాలా ఆశ్చర్య పడ్డారు. తన రాజధానీ నగరంలో కూటికి గుడ్డకూ ముఖం వాచిన వాళ్ళు యింత మంది వున్నారని ఆయన ఏనాడూ ఊహించలేదు.

రాజూ, రాజగురువూ, బ్రహ్మదండి మాంత్రికుడూ ఆవరణలోకి రాగానే, సైనికులు చిప్పగాళ్ళనందర్నీ ఒక సొలుపుగా నిలబెట్టారు. రాజుకూ, రాజగురువుకూ







అక్కడ ఉన్నతాసనాలు ఏర్పాటు చేయబడినై. బ్రహ్మదండి పక్కగా నిలబడ్డాడు.

"గురువర్యా, మన రాజ్యం సర్వ సుభిక్షంగా వున్నదని, యింత కాలంగా భావిస్తున్నాను. కాని, వీళ్ళను చూస్తూంటే మన పరిపాలనలో ఏదో లోపం వున్నట్టు కనబడుతున్నది. మహామంత్రి ఒక్కసారైనా—కనీసం సూచన ప్రాయంగా కూడా, పరిస్థితులు యింత దారుణంగా వున్నట్టు నాతో అనలేదు," అన్నాడు రాజు నిస్పృహపడుతూ.

రాజగురువు చిరునవ్వు నవ్వుతూ, "మహారాజా! ఇందులో మంత్రిగారిని తప్పు పట్టేందు కేమీలేదు. ఈ దరిద్రులందర్నీ మన బొక్కసంలో వున్న ధనం వెచ్చించి పోషించటం సాధ్యమయే పని కాదు. యుద్ధాలూ జననష్టం లేకుండా ధనం సంపాయించే మార్గం ఒకటి కనబడుతున్నది," అంటూ రాజుగారి చెవిలో రహస్యంగా, "ఈ బ్రహ్మదండిని ఉపయోగించుకుని, రాకాసిలోయలో వున్న ధనరాసులు కొల్లగొట్టే మార్గం ఆలోచించుదాం," అన్నాడు.

రాజుగారి ముఖం కళకళ లాడింది. ఆయన బ్రహ్మదండికేసి తల తిప్పి, "బ్రహ్మదండీ, నువ్వు యికనుంచయినా, దుష్ప్రవర్తన మానుకుంటే, నిన్ను క్షమించగలము," అన్నాడు.

ఈ మాటలు వింటూనే మాంత్రికుడు రాజుకు సాష్టాంగ పడి, "మహారాజా, నే నెప్పుడూ మహారాజులుంగారి సేవకుడనే. దుష్టులు రేపిన పుకార్లు నమ్మి, నా రాజభక్తిని శంకించ వద్దని ప్రార్థిస్తున్నాను. తమ బొక్కసాన్ని వెండి బంగారాలతో నింపేందుకే, నేను కాలభైరవోపాసన చేసి, రాకాసిలోయకు వెళ్ళే మార్గం......"

బ్రహ్మదండి మాంత్రికుడు మాట ముగించక ముందే, రాజగురువు అందు





కుని. "బ్రహ్మదండీ, ఆ లోయ సంగతు లేవీ నువ్వు బహిరంగంగా మాట్లాడ కూడదు. ఏ రాజభక్తి సంగతి నే నెరగంది కాదు, జాగ్రత్త!" అన్నాడు కఠినంగా.

బ్రహ్మదండి ఉక్కిన పేనులా అయి పోయాడు. అంతలో సేనానాయకుడు అక్కడికి వచ్చి, సొలువుగా వున్న బిచ్చగాళ్ళందర్నీ ముందుకు నడవమన్నాడు. సైనికులు హెచ్చరించగానే బిచ్చగాళ్ళు కదిలారు. బ్రహ్మదండి వాళ్ళల్లో ప్రతి ఒక్కడి ముఖాన్నీ పరీక్షగా చూస్తూ, "వీడు కాదు... ఊహుఁ, వీడూ కాదు! ఈ ముఖంలో జయమల్లు లక్షణాలున్నా, వాడు కొంచెం పొడుగు. వీడి ఆకారం కేశవుడి ఆకారాన్ని పోలి వున్నట్టు కనిపిస్తున్నా, వీడిది కాస్త మెల్ల కన్ను...వాడివి పులి కళ్ళు!" అంటూ వ్యాఖ్యానించసాగాడు.



ఈ విధంగా బిచ్చగాళ్ళ పరీక్ష ఒక గంట కాలం పట్టింది. చివరకు వాళ్ళల్లో తమకు కావలసిన జయమల్లూ, కేశవుడూ లేరని తేలిపోయింది.

"అసలీ పుకారు లేవనెత్తిం దెవరు?" అని అడిగాడు రాజగురువు.

"ఇది అడవిలోకి వెళ్ళిన మన నగర పౌరుల ద్వారా వ్యాపించింది. వాళ్ళకు అక్కడున్న ముసలివాడెవడో చెప్పాడట," అన్నాడు సేనానాయకుడు.

"వాడా—ఆ ముసలివాడు! వాడు కేశవుడి తండ్రి. వాడింత కపట విద్య తెలిసిన వాడని నేను నమ్మను. కేశవుడో, జయమల్లో ఈ కట్టుకథ కల్పించి వుంటారు. వాళ్ళు సరికే ఈ రాజ్యం సరిహద్దులు దాటిపోయినా, దాటిపోయి వుండవచ్చు," అన్నాడు బ్రహ్మదండి కోపంగా.

రాజగురువుకు అతడు చెప్పినదాంట్లో కొంత సత్యం వున్నట్టు తోచింది. బహుశా వాళ్ళిద్దరూ ఈ సరికి రాకాసిలోయ మార్గం పట్టి వుంటారు!




రాజుగారూ, బ్రహ్మదండి మాంత్రికుడూ, రాజగురువూ తిరిగి రాజభవనంలో ప్రవేశించారు. సేనానాయకుడు చిచ్చుగాళ్ళం దర్నీ రాజ ప్రాసాద ద్వారాలు దాటించి నగరంలోకి తరిమి వేయించాడు. రాజూ, రాజగురువూ కలిసి రహస్య మంతనాలు ప్రారంభించారు.

"మహారాజా, మనం ఈ సదవకాశాన్ని చేజారి పోనివ్వకూడదు. రాకాసిలోయలో వున్న వెండి బంగారాలను మనవిగా చేసుకోవలసిందే. ఆ విధంగా మీకూ, ప్రజలకూ కూడా ఎంతో మేలు కలుగుతుంది. ఆ గుప్త ధనాన్ని సాధించే శక్తి ఒక్క కేశవుడికే వుండని, మాంత్రికుడు లోగడ చెప్పాడు. వాణ్ణి పట్టుకునేందుకే వాడు యింత కాలంగా ఆ కొండ మీద మాటు వేసుకూర్చున్నాడు. కేశవుడి భుజం మీద పడగ విప్పిన నల్లని పాము ఆకారం మచ్చ వున్నదట. దాని ద్వారా బ్రహ్మదండి తనకు కావలసిన యువకుడెవడో గుర్తించాడు," అన్నాడు రాజగురువు.

"కాని, వాడు మోసగించి మన చేజారి పోయినట్టు కనబడుతున్నది," అన్నాడు రాజుగారు.

"అందుకే మనం మోసాన్ని మోసంతోనే నిగ్రహించాలి. నాకో మంచి ఉపాయం తట్టింది. తమరు మరోలా అనుకోకపోతే, మనవి చేస్తాను," అన్నాడు రాజగురువు.

రాజుగారు అంగీకార సూచకంగా తలాడించాడు.

"ఆ కేశవుడు వారం రోజుల లోపల నగరానికి వచ్చేట్టయితే, అర్ధరాజ్యం యిస్తామని చాటింపు వేయించుదాం. ఆ గడువులోగా వాడు రాకపోతే, వాణ్ణి ప్రాణాలతో పట్టి తెచ్చిన వాళ్ళకుగాని, లేక తల నరికి తెచ్చిన వాళ్ళకుగాని ఒక చిన్న సామంత రాజ్యం యివ్వబడుతుందని ప్రకటిద్దాం. నా ఊహ—వాడు అర్ధరాజ్యం దొరకు





తుందన్న ఆశతో తప్పక మన ఆ స్థానానికి వస్తాడని. ఆ తరవాత వాణ్ణి రాకాసిలోయలో ఎలా వుపయోగ పెట్టుకోవాలో నేనూ, బ్రహ్మదండి నిర్ణయిస్తాం," అన్నాడు రాజగురువు.

అర్ధరాజ్యం యిస్తామని వేసే చాటింపు కేవలం కేశవుణ్ణి దొరక పుచ్చుకునేందుకు ఆడే నాటకమే అని తెలిసిం తరవాత రాజుగారు అందుకు అంగీకరించాడు. ఆ వెంటనే బ్రహ్మపుర రాజ్యంలోని పల్లెల్లో, పట్టణాల్లో రాజాజ్ఞ ప్రకారం చాటింపు వేయబడింది.

ఒకటి రెండు రోజులు గడిచి గడవక ముందే, ఈ చాటింపు వార్త కేశవుడికి, అతడి ముసలి తండ్రికి, జయమల్లుకూ తెలిసింది. నగరవాసులు కొండ ప్రాంతాల నుంచి వెళ్ళిపోగానే, వాళ్ళు ముగ్గురూ ఒక కొండ గుహలో చేరారు. ముందు కర్తవ్యాన్ని గురించి తర్జన భర్జనలు చేస్తున్నారు.

"ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది!" అన్నాడు ముసలివాడు.

"అందుకు సందేహమా! కేశవుడు వెంట వుంటే తప్ప, ఆ రాకాసిలోయ లోని ధన రాసులు దొరకవు. అందుకు తగిన జాతకుడు కేశవుడే అని బ్రహ్మదండి, రాజగురువుకు చెప్పి వుంటాడు. అతడు మహా జిత్తుల మారి," అన్నాడు జయమల్లు.



"బహుశా, నన్ను కాళ్ళూ చేతులూ కట్టి, ఆ రాకాసిలోయకు మోసుకు పోవాలని వాళ్ళు పథకం వేసి వుంటారు. వాళ్ళ పని తీరిం తరవాత నన్ను తప్పక కొరత వేస్తారు," అన్నాడు కేశవుడు కోపంగా.

"ఆ ప్రమాదం యిప్పుడే ఎదురవ బోతున్నది. నీ తల విలువ అర్ధరాజ్యం; తెలిసిందా? కనక, మనం ఎంత త్వరగా, ఈ రాజ్యపు హద్దులు దాటిపోతే అంత మంచిది," అన్నాడు జయమల్లు.

"ఈ రూపంలో మన నెవరైనా గుర్తిస్తారు. ఈ సరికి ఈ చాటింపు వృత్తాంతం యితర రాజ్యాల వాళ్ళకూడా తెలిసి







వుంటుంది. వాళ్ళు మాత్రం నన్ను గుర్తిస్తే బతకనిస్తారంటావా?" అన్నాడు కేశవుడు.

కేశవుడి ముసలి తండ్రి పొందిన ఆదుర్దా అంతా యింతా కాదు. అతడు గుహలో నుంచి బయిటికి వచ్చి, చుట్టూ కలయ చూసి, "డబ్బుకు ఆశ పడిన నగర వాసుల్లో కొందరైనా మళ్ళీ యిక్కడికి వచ్చి, కొండ గుహల్నూ, కోనల్నూ వెతికే ప్రమాదం వున్నది. మీరు యిక్కణ్ణించి వెంటనే పారిపోండి," అన్నాడు.

"ఈ వేషాలతో లాభం లేదు. దేశాటనకు బయలుదేరిన ఏ క్షత్రియ యువకుల వేషాలో వేసుకుని, వింధ్యారణ్యాల్లోకి పారిపోవలసిందే. అందుకు అవసరం అయిన ధనం బ్రహ్మదండి మాంత్రికుడి గుహలో ఎక్కడ దాచబడి వున్నదో నాకు తెలుసు!" అన్నాడు జయమల్లు.

"ఆ గుహను రాత్రింబగళ్ళు యిద్దరు సైనికులు కాపలా కాస్తున్నారు," అన్నాడు కేశవుడు. "ఆ యిద్దర్నీ మనం చంపి గుహలోకి వెళ్ళలేమా?" అని ప్రశ్నించాడు జయమల్లు.

"సాధ్యమైనంత వరకు వాళ్లను చంపకుండానే గుహలోకి వెళ్ళవచ్చు. అంతా రహస్యంగా జరిగిపోవాలంటే, చీకటి పడేవరకూ వేచి వుండటం మంచిది," అన్నాడు ముసలివాడు. అందుకు కేశవుడూ, జయమల్లూ, సరేనన్నారు.

సూర్యాస్తమయమై బాగా చీకటి పడే వరకూ ముగ్గురూ వంతుల ప్రకారం తాము దాక్కొని వున్న గుహ ముందు కాపలా కాశారు. ఏ క్షణాన్నయినా, నగరవాసులు తమ గుహ కేసి రావచ్చునన్న భయం వాళ్లను చాలా బాధించింది. చీకటి పడి కొంచెం రాత్రి పొద్దు పోయిం తరవాత ముగ్గురూ, మాంత్రికుడి గుహకేసి బయలుదేరారు. రాళ్ళ చాటు చేసుకుని పిల్లుల్లా నిశ్శబ్దంగా గుహను సమీపించిన వాళ్ళను, గుహ





ముందు కాపలా వున్న సైనికుడు గుర్తించ లేదు. ముసలివాడు సైనికుడు నిలుచున్న చోటుకు దాపులలో వున్న రాయి చాటు నుంచి, కత్తి ముందుకు చాచి సైనికుడి వెన్నుకు దాన్ని ఆనిస్తూ, "అరవకు! రెండో వాడెక్కడ?" అని ప్రశ్నించాడు మెల్లిగా.

హఠాత్తుగా వెన్నుకు కత్తి మొన తాకగానే సైనికుడి పై ప్రాణాలు పైనే పోయినై. వాడు ఏమి చేయుటమా అని ఆలోచించేంతలో కేశవుడూ, జయమల్లూ వాడి ముందుకు వచ్చి నిలబడి, "మా బందిపోట్ల నాయకుడు, మిమ్మల్నిద్దర్నీ చంపి, గుహలో వున్న ఒక వస్తువును తెమ్మన్నాడు. కాని, మాకు మిమ్మల్ని చంపాలని లేదు. మా పనేదో మేం చూసుకు పోతాం. నీ తోటి వాడెక్కడ?" అని అడిగారు.

సైనికుడు నిలువు గుడ్లువేసి, గుహకు ఒక పక్కగా గుర్రు పెట్టి నిద్రపోతున్న, అనుచరుణ్ణి చూపించాడు. మరుక్షణం కేశవుడూ, జయమల్లూ, ఆ నిద్రపోతున్న వాడి మీద పడి, వాడి కాళ్ళూ చేతులూ బంధించి ఒక మూల పడవేశారు.

"కత్తి నా వెన్నులో గుచ్చుకుంటున్నది. మీ బందిపోటు స్నేహితుణ్ణి కత్తి తీయమనండి," అంటూ ప్రాధేయ పడ్డాడు



మొదటి సైనికుడు. కాని, ముసలివాణ్ణి సైనికులు గుర్తించటం ప్రమాదకరమని కేశవుడూ, జయమల్లూ ముందే నిశ్చయించుకున్నారు. తాము వింధ్యారణ్యాలు పట్టి పోయేవాళ్ళు. కాని ముసలివాడు ఈ ప్రాంతాలే ఎక్కడో ఒక చోట కొంతకాలం నివసించవలసి వుంటుంది.

"ఆ బందిపోటు వాడి ముఖం చూశావంటే నువ్వు నిలువునా ప్రాణం వదులుతావు. వాడంత భయంకరుడు!" అంటూ కేశవుడూ, జయమల్లూ కలిసి సైనికుడి కాళ్ళూ చేతులూ కట్టి, కళ్ళకు గంతలు కూడా బిగించారు.

జయమల్లు గుహలో ప్రవేశించి, కొద్ది సేపటి తరవాత మళ్ళీ కొట్టుకున్న దుస్తులతో బయటికి వచ్చాడు. అతడి చేతిలో ఒక సంచీ వున్నది. ఆ సంచీని అతడు అటూ యిటూ కదిలించేసరికి ఘల్లు ఘల్లుమన్న ధ్వని వినబడింది.

"ఈ సంచీ నిండా బంగారు నాణాలే. బ్రహ్మదండి మాంత్రికుడు ఎందర్నో మోసగించి కూడబెట్టిన ధనం యిది. దీనితో మనం క్షత్రియోచితమైన దుస్తులూ, ఆయుధాలూ కొనుక్కోవచ్చు. ఇక బయలుదేరుదాం," అన్నాడు జయమల్లు.

ముగ్గురూ తిరిగి తమ గుహకు వచ్చేశారు. తెల్లవారగానే ఆ బంగారంలో కొంత ఖర్చు పెట్టి, అవసరమైన సామగ్రి కొనుక్కు వచ్చేందుకు ముసలివాడు నగరానికి వెళతానన్నాడు. నగరంలో తన నెవరూ గుర్తించకుండా మారు వేషం వేసుకుంటానన్నాడు. కేశవుడూ, జయమల్లూ అంగీకరించారు.

గుహలోని రాళ్లచాటున తను రహస్యంగా దాచుకున్న బంగారాన్ని జయమల్లు వెతికి వెలికి తీస్తూండగా, అక్కడ బ్రహ్మపుర రాజుగారి రాచనగరులో నిద్రిస్తున్న బ్రహ్మదండి మాంత్రికుడికి పీడ కలలు వచ్చినై. ఎవడో దొంగ ఒకడు, తన బంగారం వున్న సంచీని, పైకీ కిందికీ ఎగర వేస్తున్నట్టూ, అది ఘల్లు ఘల్లుమని గోల చేస్తున్నట్టూ వాడు కలగన్నాడు.

"దొంగ, దొంగ! బంగారం, నా బంగారం!" అంటూ బ్రహ్మదండి మంచం మీంచి కిందికి దూకి వాకిలి కేసి పరిగెత్త సాగాడు. అక్కడ కాపలా వున్న భటుడు, ఈటెను మాంత్రికుడి గుండెల కేసి గురి చేసి, "ఒక్కడుగు ముందుకు వేశావో, చంపేస్తాను!" అంటూ హెచ్చరించి, "రండి, రండి! బ్రహ్మదండి, పారిపోవాలని చూస్తున్నాడు!" అంటూ తన తోటి కాపలా భటుల్ని కేకవేశాడు. —(ఇంకా వుంది)






## 12

[క్షత్రియ యువకుల్లా వేషాలు మార్చుకునేందుకు కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకుని, బ్రహ్మదండి మాంత్రికుడు గుహలో దాచుకున్న బంగారం దొంగిలించారు. అదే సమయంలో బ్రహ్మదండి కేకలు పెడుతూ తన గది నుంచి బయటికి పరిగెత్తాడు. అతణ్ణి కాపలాభటుడు అడ్డుకుని, తనతోటి భటుల కోసం కేకలుపెట్టాడు. తరవాత—]

గుండెల మీదికి సూటిగా గురిచేసివున్న ఈటె, కాపలాభటుడి కేకలూ వింటూనే, బ్రహ్మదండి మాంత్రికుడికి నిద్రమత్తు వదిలిపోయింది. అంతలో అక్కడికి మరి ద్దరు కాపలాభటులు పరిగెత్తుకు వచ్చారు.

"పారిపోవాలని చూస్తున్నాడా? చూస్తారేం, పొడవండి!" అంటూ ఒక భటుడు ఈటెను పైకెత్తాడు. బ్రహ్మదండికి ప్రాణం కడబట్టినంత పనయింది. అతడో క్షణకాలం నోట వెంట మాటరాక తడబడి, తరవాత కాస్త తెప్పరిల్లి "అయ్యల్లారా! వీరభట మహాశయుల్లారా! నన్ను చంపకండి. నేను పారిపోవాలని ప్రయత్నం చెయ్యలేదు," అన్నాడు వణికిపోతూ.

"పారిపోయేందుకు ప్రయత్నించలేదా? అయితే యిదంతా ఏమిటి? నేను అబద్ధాల కోరుననా నువ్వనేది!" అంటూ మొదట దారి అడ్డగించిన భటుడు, ఈటె తిరగవేసి బ్రహ్మదండి నెత్తిన ఒక్క బాదుబాదాడు. ఆ దెబ్బకు బ్రహ్మదండి కింద కూలబడి,







గిలగిలలాడుతూ, "మహాభట కేసరీ! నన్ను చంపకు. నిద్రపోతూండగా పీడకల వచ్చి, ఆ మైకంలో గది నుంచి బయిటికి పరిగెత్తుకు వచ్చాను. నాదే తప్పు," అంటూ బావురుమన్నాడు.

కాపలాభటులు అతణ్ణి కాళ్లూచేతులూ పట్టుకుని దూలాన్ని మోసుకుపోయినట్టు గదిలోకి మోసుకుపోయి, మంచం మీదికి గిరవాటువేశారు. బ్రహ్మదండి మంచం మీదపడుతూనే, ఆ అదురుకు, ఎగిరి కింద నేల మీద వెల్లకిలాపడి, లేచి ఒళ్ళు దులుపుకుంటూ, "బాబులూ, శూరభట శార్దూలాలూ! నన్ను హింసించకండి. నా దగామారి శిష్యుడూ, మరొకడూ కలిసి, నేను రక్తం ఓడ్చి సంపాయించి దాచుకున్న డబ్బును దొంగిలిస్తూంటే చూసి, మతిచెడి తప్పుగా ప్రవర్తించాను," అన్నాడు.

"నీ కింకా మతిచెడే వున్నది," అన్నాడొక కాపలాభటుడు, బ్రహ్మదండి కేసి అనుమానంగా చూస్తూ, "ఇందాక, ఏదో పీడకలవచ్చి, బయిటికి పరిగెత్తానన్నావు. ఇప్పుడు నీ దగామారి శిష్యులు, నువ్వు దాచుకున్న బంగారం ఎత్తుకుపోతూంటే చూసి, మతిచెడిందంటున్నావు? ఏది నిజం?" అని అడిగాడు.

"వీడు మళ్ళీ కొంతల్లోకి పారిపోయేందుకు ఏదో ఎత్తువేస్తున్నాడు. వీడి ఆట కట్టించాలంటే, రాజగురువు కోసం కబురు పంపాల్సిందే," అన్నాడొక భటుడు.

రాజగురువు పేరు వింటూనే, బ్రహ్మదండి గడగడా వణికిపోతూ, "నాయనలారా! యోధభట భల్లూకాల్లారా! నన్ను కరుణించండి. ఈ అర్ధరాత్రంలో వెళ్ళి రాజగురువును నిద్రలేపితే, ఆ కోపంలో ఆయన నన్నేమిచేసినా చేయవచ్చు. నా తప్పు మన్నించండి!" అన్నాడు.

కాపలాభటులు తమలోతాము కూడబలుక్కుని, మాంత్రికుడి గది తలుపులు





బిగించి, అక్కడ యిద్దరు కావలావుండగా, మూడోవాడు రాజగురువు దగ్గిరకుపోయాడు. రాజగురువు భటుడు చెప్పిందంతా విని, "మంచిపని చేశారు. తెల్లవారుతూనే వాళ్లని రాజుగారి దగ్గిరకు తీసుకురండి. మీ నాయకుడితో, కొండల్లోని బ్రహ్మదండి గుహ దగ్గిర ఏమి జరిగిందో తెలుసుకురమ్మన్నానని చెప్పండి," అన్నాడు.

సూర్యోదయం అయేలోపలే నలుగురు భటులు, బ్రహ్మదండి మాంత్రికుడి గుహ దగ్గిరకు వెళ్ళి, గుహ ముందు కాళ్ళూ చేతులూ కట్టి పడవేయబడివున్న తమ యిద్దరు అనుచరుల్ని చూశారు. వాళ్ళు రాత్రి జరిగిన సంగతంతా చెప్పారు.

గుహ దగ్గిర్నుంచి భటులు రాచనగరుకు తిరిగి వచ్చేసరికి, అక్కడ రాజూ, రాజగురువుల ముందు బ్రహ్మదండి మాంత్రికుడు చేతులు కట్టుకు నిలబడి వున్నాడు. భటులు జరిగిందంతా చెప్పారు.

అంతా శ్రద్ధగా విన్న రాజగురువు, "కాపలా భటుల్ని కాళ్ళూచేతులు కట్టి గుహలో ప్రవేశించిన వాళ్ళు బందిపోట్లు కాదు. కేశవుడూ, జయమల్లూ అయి వుంటారు. పోతే, ఆ మూడోవాడెవరైనదీ తెలియటం లేదు!" అన్నాడు.



"అనుమాన మేల రాజగురు మహా మతీ! వాడు, కేశవుడి తండ్రి అయిన ముసలివాడు! నా పేడకల సంగతి చెప్పాను గదా? అందులో ఆ ముసలి వెధవ కని పించలేదు. ఏమైతేనేం, నా నిధి దొంగిలించబడింది," అంటూ బ్రహ్మదండి కళ్ళ నీళ్ళ పర్యంతమయాడు.

రాజగురువు, మాంత్రికుడి కేసి జాలిగా చూస్తూ, "విచారించకు బ్రహ్మదండీ! రాకాసిలోయలో దొరికే నిధుల్లో నీకూ భాగం వుంటుంది. మనకు కావలసిన కేశవుడు యింకా మన రాజ్య సరిహద్దుల్ని దాటిపోలేదని కూడా తెలిపోయింది. వాళ్లని







పట్టుకునేందుకు ప్రయత్నిద్దాం. కాని, వాడి ప్రయాణంతూచా రాకాసిలోయకే అని అర్థమవుతున్నది. దారి ఖర్చుల కోసం నీ బంగారం దొంగిలించాడు. పాపం," అన్నాడు రాజగురువు.

బ్రహ్మదండి కోపంతో బుసలుకొడుతూ, "మహారాజా! మహారాజగురుశేఖరా! ఇక నాకు అనుమతి యిప్పించండి. తమరు వేసిన పథకం ప్రకారం, నేను రాకాసిలోయ చేరి, ఆ దుష్టులైన కేశవ జయమల్లుల్ని, కాలభైరవుడికి బలిచేసి, అక్కడ లభించే ధనరాసుల్ని తమ వద్దకు పటుకువస్తాను," అన్నాడు.



రాజగురువు అక్కడ నిలబడివున్న భటుల్ని వెళ్ళిపొమ్మని చెప్పి, రాజుతో, "మహారాజా! బ్రహ్మదండి, జితవర్మ, శక్తివర్మల ప్రయాణానికి, ఈ సాయంకాలం ముహూర్తం పెట్టాను. ఎవరికీ ఎలాంటి అనుమానం కలక్కుండా వుండేందుగ్గాను, మన వేగులవాళ్ళు, యీ సరికే నగరంలో, అవసరం అయిన వదంతులు లేవదీసి వుంటారు," అన్నాడు.

రాజగురువు చెప్పినట్టు, ఆ నాటి సూర్యోదయం వేళకే బ్రహ్మపుర నగరంలో ఒక వదంతి ప్రచారం కాసాగింది. రాజగురువు కాలిమీద ఎప్పుడో ఒక వ్రణం లేచిందనీ, అది ఎన్ని చికిత్సలకూ లొంగనందున, వింధ్యారణ్యాలలో దొరికే ఒక ఓషధి కోసం బ్రహ్మదండి మాంత్రికుడు వెళుతున్నాడని ప్రజలు చెప్పుకోసాగారు.

రాకాసిలోయలో ఏవో నిధుల కోసం బ్రహ్మదండి వెళుతున్నాడని తెలిస్తే, అతడు ప్రయాణించవలసిన దేశాలరాజులు, అతడికి ఆటంకాలు కలిగిస్తారని రాజగురువు, ఈ వదంతి ప్రచారంలో పెట్టించాడు. రాజగురువు ప్రాణ రక్షణకోసం ఏదో ఓషధో, మూలికో తెచ్చుకునేందుకు వెళ్ళే మనుష్యుల్ని ఎవరూ ఏమీ చేయరు సరి కదా,







ప్రయాణానికి అవసరం అయిన సహాయం కూడా చేస్తారు.

మొత్తం మీద రాజగురువు వేసిన ఎత్తు గడ పారింది. మహా దుష్టమాంత్రికుడని పేరుమోసిన బ్రహ్మదండి, ఆరవైనాలుగ్గంటల్లో ఘనవైద్యుడుగా అందరిచేతా చెప్పుకో బడ్డాడు. "అతడెంత గొప్ప వైద్యశాస్త్రసిధి కాకపోతే, రాజగురువు తన దీర్ఘవ్యాధిని కుదిర్చేందుకు అతణ్ణి నియమించు కుంటాడు!" అనుకున్నారు ప్రజలు.

ఆ రోజు సాయంకాలం బ్రహ్మదండి మాంత్రికుణ్ణి వింధ్యారణ్యాలకు సాగనంపేందుకు రాజగురువు స్వయంగా నగర ద్వారం దగ్గిరకు వచ్చాడు. ఆయన లోగడే, రాజాస్థానంలో ఉద్యోగాలు చేస్తున్న యిద్దరు యువకుల్ని—జితవర్మ, శక్తివర్మ—అనే వాళ్ళను బ్రహ్మదండి వెంట వెళ్ళేందుకు నియమించాడు. వాళ్ళపని, రాకాసిలోయలో ఒకవేళ నిధినిక్షేపాలు దొరికితే, వాటి నెత్తుకుని బ్రహ్మదండి పారిపోకుండా చూడటం. కాని, ప్రయాణంలో ఎవరైనా అడిగితే మాత్రం, తామిద్దరూ అతడి అంగరక్షకులుగా నియమించబడినట్టు చెప్పుకోవాలి.

నగరం ప్రవేశించేప్పుడు ఎంతో అవమానించబడిన బ్రహ్మదండి, నగరం వదిలి పోయేప్పుడు గొప్పగా సన్మానించబడ్డాడు.





నగరద్వారం వద్ద గుంపులు గుంపులుగా చేరిన ప్రజల్లో కొందరు అతడి మెడలో పుష్పమాలలు కూడా వేశారు. ఆటలూ, వినోదాలూ కూడా సాగినై.

ఇక్కడ బ్రహ్మపుర నగరాన్ని మాంత్రికుడు వదిలివెళ్ళే సమయంలో, అక్కడ అడవి మధ్య దాగివున్న కేశవుడూ, జయమల్లూ కూడా వింధ్యారణ్యాలకు వెళ్ళేందుకు తయారవుతున్నారు. కేశవుడి తండ్రి కొని తెచ్చిన దుస్తులు ధరించటంతో వాళ్ళిద్దరూ క్షత్రియ యువకుల్లా మారిపోయారు. డాలూ, కత్తి, శిరస్త్రాణం, అంబులపొది— వాళ్ళ నిప్పుడు చూచిన వాళ్ళెవరూ, గొల్లకాపరి, బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుడూ అని గుర్తించలేదు.

ఈ విధంగా వాళ్ళిద్దరూ వేషాలు వేసుకుని బయలుదేరనున్న సమయానికి, ముసలివాడు తానూ వాళ్ళ వెంట వస్తానని పట్టుబట్టాడు. కేశవుడూ, జయమల్లూ అతడికి దారిలో ఎదుర్కోవలసివున్న ఆపదలను గురించి చెప్పారు. ఈ వృద్ధాప్యంలో కొండలూ, అడవుల వెంట పడి కొన్నివందల కోసుల దూరం నడవటం కష్టమని అన్నారు. కాని, ముసలివాడు తన పట్టు వదలలేదు.

"సరే, ఈ రూపంలో నిన్ను ఎవరైనా గుర్తిస్తారు, ఎట్లా?" అన్నాడు కేశవుడు.

ముసలివాడు ఎగిరి గంతేశాడు. "నగరంలో మీకు దుస్తులు కొనేప్పుడే, నాకూ అవసరం అయిన దుస్తులు కొనుక్కున్నాను. కొంచెం ఆగండి. నన్ను మీరు గుర్తించగలరో లేదో చూస్తాను!" అంటూ ముసలివాడు చెట్లుదాటుకు వెళ్ళి, పావు గంట కాలం గడిచిగడవక ముందే, తిరిగివచ్చాడు.

ముసలివాడి వేషం చూసి, కేశవుడూ, జయమల్లూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. పట్టువస్త్రాలూ, మెడలో రుద్రాక్షమాలా, చేతిలో దండకమండలాలూ, చెవులకు కుండలాలూ, ముఖాన







విభూతిరేఖలూ—అత డిప్పుడు అచ్చు పండితుడిలా వున్నాడు.

"నే నిప్పుడు, మీ యిద్దరికీ గురువును! రాజపుత్రులను దేశాటన చేయించేందుకు బయలుదేరినవాణ్ణి, తెలిసిందా?" అన్నాడు ముసలివాడు.

"అది బాగానేవుంది, గురూ! కాని మనం దారిలో ఏ నగరానికైనా వెళితే, అక్కడ పండితులు నిన్నేమైనా ప్రశ్నిస్తే, అప్పుడు మనం ఏమయేట్టు?" అని అడిగాడు జయమల్లు.

"గురు మౌనానందుడు! ఈ యాత్రలో ఆయన తన శిష్యులతో తప్ప, మరెవరితోనూ మాట్లాడరు, సరిపోయే!" అన్నాడు ముసలివాడు.

కేశవుడికి తన తండ్రిని వెంటపెట్టుకు వెళ్ళటమే క్షేమమనిపించింది. ఈ వయసులో అతణ్ణి, ఈ అరణ్యంలో వదలి పోవటం మంచిదికాదు. ఈ పాటికి బ్రహ్మపురరాజ్యంలో వున్నవాళ్ళందరికీ, తాము తండ్రి కొడుకులమన్న సంగతి తెలిసిపోయి వుంటుంది. తన తల విలువ ఒక చిన్న సామంతరాజ్యం. ఆ ఆశ వున్నవాళ్ళెవరూ తన తండ్రి దొరికితే, తన జాడలు తెలుసుకునేందుకు, అతణ్ణి హింసించక మానరు.



కేశవుడు తండ్రి కేసి ప్రేమగా చూస్తూ, "అయ్యా...." అని ఏమో చెప్పబోయేంతలో ముసలివాడు, ముఖంలో లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుని, "అయ్యాకాదు...గురూ!" అన్నాడు కఠినంగా.

కేశవుడికీ, జయమల్లుకూ నవ్వాగింది కాదు. కేశవుడు తన తండ్రిని సమీపించి, అతడి చేయిపట్టుకుని ముందుకు నడిపిస్తూ, "గురూ, యిక మనం బయలుదేరుదాం. చీకటిపడే వేళకన్నా, మనం ఏదైనా పల్లె చేరాలి. ఈ రాత్రికి అక్కడే పండుకుని, తెల్లవారి మన ప్రయాణానికి అవసరం అయిన గుర్రాలు కొనుక్కుని ముందుకు సాగుదాం.







కాలినడకన రాజకుమారులూ, వాళ్ళ గురువూ దేశాటన చేస్తున్నారంటే, ఎవరికైనా అనుమానాలు కలగవచ్చు," అన్నాడు.

అరణ్యంలో దాదాపు రెండు గంటల కాలం ప్రయాణించేసి, చీకటిపడుతూండగా ముగ్గురూ ఒక పల్లె చేరారు. వాళ్ళు వీథిలో నడుస్తూండగా, రచ్చబండ చుట్టూచేరిన జనం అనుకునే మాటలు వాళ్ళకు కొంత ఆశ్చర్యాన్నీ, భయాన్నీ కూడా కలిగించినై.

"బ్రహ్మదండి మాంత్రికుడు, ఇద్దరు అంగరక్షకుల్ని వెంటపెట్టుకుని, వింధ్యారణ్యాలకు వెళుతున్నాడట! అక్కడ మాత్రమే పెరిగే ఒక ఓషధి తెచ్చి, ఎన్నాళ్ళుగా నయంకాని రాజగురువు కాలి వ్రణాన్ని నయం చేస్తాడట!"

"ఇందులో ఏదో మోసం వున్నది. అయినా, మనం రాజపుత్రులం కనక, ఈ అలగా జనం ఆడుకునే ఊసుకబుర్లలో తల దూర్చకూడదు," అంటూ జయమల్లు కేశవుడికి సంజ్ఞచేసి, రచ్చబండ దగ్గిరవున్న జనంతో, "ఈ పల్లెలో పూటకూళ్ళ యిల్లు ఎక్కడో చెపుతారా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే ఒక వృద్ధుడు ముందుకు వచ్చి, "అయ్యా, పూటకూళ్ళ యిల్లు యీ దగ్గిర్లోనే వున్నది. కాని, అక్కడ మీకు వసతి దొరకదేమో అని నా భయం. రాజుగారి ఆజ్ఞాపత్రం తీసుకుని, బ్రహ్మదండి అనే ఒక ఘనవైద్యుడూ, అతడి అంగరక్షకు లిద్దరూ, ఈ రాత్రికి, అక్కడే దిగబోతున్నారని వార్త వచ్చింది," అన్నాడు.

ఆ మాటలు వింటూనే కేశవుడూ, జయమల్లూ గతుక్కుమన్నారు. కాని, ముసలివాడు మాత్రం దండం పైకెత్తి, "అలాగా, సరే, చూద్దాం. దేశాటనకు బయలుదేరిన రాజకుమారులు పూటకూళ్ళ కొంపలోనే, రాత్రంతా గడపాలని ఎక్కడుంది? ఓయి, శిష్యులూ! రండి, నడవండి!" అంటూ ముందుకు కదిలాడు. —(ఇంకా వుంది)








## 13

[ కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ తమ గుహ వదిలి బయలుదేరిన రోజునే, బ్రహ్మదండి మాంత్రికుడు కూడా, ఇద్దరు అంగరక్షకులతో వింధ్యారణ్యాలకు ప్రయాణమయాడు. కేశవుడూ వాళ్ళూ, చీకటి పడే వేళకు ఒక పల్లె చేరారు. బ్రహ్మదండి కూడా అక్కడికే వస్తున్నట్టు వాళ్ళకు తెలిసింది. వాళ్ళు ముందుకు కదిలారు. తరవాత—]

కేశవుడి ముసలితండ్రి ముందుండి దారి తీయగా, అందరూ పల్లె దాటి తిరిగి అరణ్యంలో ప్రవేశించారు. ఆ సరికి బాగా చీకటి పడిపోయింది. అరణ్యం అంతా పక్షులా, జంతువులా, కూతలతో, అరుపులతో ప్రతిధ్వనించి పోతున్నది. ముగ్గురూ నిస్పృహగా ఒక చెట్టు కింద కూర్చున్నారు.

"ఈ మారువేషాల్లో బ్రహ్మదండి మనను గుర్తించ గలడంటావా?" అని అడిగాడు కేశవుడు జయమల్లును.

జయమల్లు అడ్డంగా తల తిప్పుతూ, "ఏమో చెప్పలేం. కాని, ఈ సరికే మనం ఒక పొరపాటు చేశాం. గురు మౌనానందులు, రచ్చబండ దగ్గిర కూచున్న పల్లెవాసులంతా వినేట్టుగా మాట్లాడేశారు. అలా చెయ్యకుండావుంటే బావుండేది," అన్నాడు.

"అందులో పొరపాటేమున్నది? ఈ దేశాటనలో, ఆయన తన శిష్యులతో మాత్రమే మాట్లాడతాడని నేను లోగడే చెప్పాను గదా?" అన్నాడు ముసలివాడు.







"అవుననుకో. కాని, నీ గొంతులో పలికిన యాస వాళ్ళల్లో ఎవరైనా గుర్తుపడితే ఏమయేది? మనం ఈ బ్రహ్మపుర రాజ్యపు సరిహద్దులు దాటేవరకూ, చాలా జాగ్రత్తగా మసులుకోవాలి, మనం చేసే ప్రతి పనీ ఎంతో ఆలోచించి మరీ చేయాలి. కాకతాళీయంగా బ్రహ్మదండి, మనమూ ఒకేసారి బయలుదేరటం జరిగింది. రాజగురువు వేసిన ఎత్తు తెలుసుకున్నారు గదా? ఆయన కాలి వ్రణమేదో నయం చేసేందుకు, ఈ మాంత్రికుడు మూలికల కోసం, వింధ్యారణ్యాలకు బయలుదేరాడట! మన శత్రువులు మహా జిత్తులమారివాళ్ళు," అన్నాడు జయమల్లు. ముసలివాడు అవునన్నట్టు తల వూపుతూ, చప్పున లేచి కూచుని, "ఈ దాపులనే ఎక్కడో గుర్రం సకిలించిన ధ్వని అయింది. మీకు వినబడిందా?" అని ప్రశ్నించాడు.

కేశవుడూ, జయమల్లూ జవాబు చెప్పేంతలో, ఈసారి మరింత స్పష్టంగా గుర్రం సకిలించటం వినబడింది. ముగ్గురూ ఆశ్చర్యంగా ముఖముఖాలు చూసుకున్నారు.

"బ్రహ్మదండి, అతడి అనుచరులూ యిటే వస్తున్నారులావుంది! మన చిక్కులన్నీ తీరి, ఈ రాజ్యం సరిహద్దులు దాటి త్వరగా పారిపోవాలంటే, వాళ్ళెక్కివస్తున్న గుర్రాలను కాజేయట మొక్కటే మార్గం," అన్నాడు ముసలివాడు.

"ఎలా? అదంత తేలికా, అయ్యా?" అన్నాడు కేశవుడు.

"అదుగో, ఆ పిలుపే మానమన్నది, గుర్తు లేదా? నేను మీ గురువును. నువ్వు కనిష్ఠుడివి, జయమల్లు జ్యేష్ఠుడూ. మనం ఏకాంతగా వున్నప్పుడు కూడా అలాగే పిలుచుకోవటం అలవాటు చేసుకోవాలి. సరే, యిప్పుడు మీరు ఊఁ అంటే, ఆ బ్రహ్మదండి ఎక్కిన గుర్రాన్ని నేను కాజేయగలను. మీరు కూడా, అతడి అనుచరుల





గుర్రాలను కాజేయగలిగితే, తెల్లవారే సరికల్లా, ఈ బ్రహ్మపుర రాజ్యపు సరిహద్దుల్ని దాటిపోగలం. అప్పుడు, ఏ బెడదా వుండదు," అన్నాడు ముసలివాడు.

అతడి మాటలకు జయమల్లు నవ్వుతూ, "నీ ఎత్తుగడ ఏమిటి? మాంత్రికుడి గుర్రాన్ని ఎలా పట్టుకోగలవు? అతణ్ణి కత్తితో ఎదిరిస్తావా?" అని అడిగాడు.

"వాళ్ళకు ఎదురుపడి, ఈ చీకట్లో యుద్ధం చేయటం మంచిదికాదు. అప్పుడు రేగే గొడవకు పల్లెవాసులు అక్కడికివస్తే, మనం పట్టుబడిపోతాం. చడీ చప్పుడూ లేకుండా ఆ గుర్రాల మీది నుంచి వాళ్ళను పడకొట్టాలి. నేను చెట్టు మీద వుండి, మాంత్రికుణ్ణి తాడు వేసి కింద పడకొట్టి, వాడి గుర్రాన్ని వశపరుచుకోగలను," అన్నాడు ముసలివాడు.

"ఈ వయసులో నువ్వే అంత సాహసం చేయగలిగితే, గురో, మేం నీకు తీసిపోతామా? ఏం, కేశవా?" అంటూ లేచి నిలబడ్డాడు జయమల్లు.

"కేశవుడు కాదు, కనిష్ఠుడు! గుర్తుంచుకో," అంటూ ముసలివాడు కస్సుమన్నాడు. ముగ్గురూ లేచి, గుర్రాలు వస్తున్న వైపుకు బయలుదేరారు.



ఈ లోపల బ్రహ్మదండి మాంత్రికుడు, తన అంగరక్షకులైన జితవర్మ, శక్తివర్మలతో కలిసి, పల్లె కేసి వస్తున్నాడు. అతడికి ముందూ వెనకా వాళ్ళు గుర్రాలెక్కి వస్తున్నారు.

బ్రహ్మదండికి గుర్రపు స్వారీ ఏ మాత్రం అలవాటులేదు. కాని, కాలినడకన ప్రయాణించటం సాధ్యంకాదు గనక, ప్రాణం బితుకుబితుకు మంటూనే గుర్రపు స్వారీకి ఒప్పుకున్నాడు. చుట్టూ చీకటి, మహారణ్యం, దూరంగా క్రూరజంతువుల అరుపులు—అతడికి ఆ వాతావరణం అంతా భీతావహం కలిగిస్తున్నది.







"ఇక రేపటి నుంచీ మనం రాత్రిళ్ళు ప్రయాణించటం మానుకోవాలి. సూర్యోదయంతోపాటే మనం బయలుదేరుతాం, సూర్యాస్తమయమవగానే ఆగిపోతాం. ఇదెందుకో తెలుసా? ఆ జయమల్లూ, కేశవుడూ, వాడి తండ్రీ, మహాదుర్మార్గులు. వాళ్ళు చీకటిమాటున మన మీద దాడి చేసినా చెయ్యవచ్చు. నా గుహ కాపలికాస్తున్న భటుల్ని వాళ్ళేం చేశారో, మీకు తెలుసు గదా?" అన్నాడు బ్రహ్మదండి.

మహారణ్యం మధ్య, చీకట్లో ప్రయాణమంటేనే హడలిపోతున్న జితవర్మా, శక్తివర్మలకు, మాంత్రికుడి హెచ్చరిక మరింత భీతి కలిగించింది. వాళ్ళు గుర్రాలను మరి కాస్త అదిలిస్తూ, "బ్రహ్మదండీ, నువ్వు చెప్పింది బావుంది. అలాగే చేద్దాం. ఏదీ, మనం చేరవలసిన పల్లె? ఎంతకీరాదే!" అన్నారు చుట్టూ చీకట్లోకి భయంగా చూస్తూ.

బ్రహ్మదండి వాళ్ళప్రశ్నకు ఏదో జవాబు చెప్పబోయి, అంతలోనే కీచుగొంతుతో, "చచ్చాను, ద్రోహం, మోసం, నా నడుంకేదో ఉచ్చుపడింది!" అంటూ అరిచాడు.

"పొరపాటు! కంఠానికని విసిరిన ఉచ్చుతాడు, నడుముకు పడింది!" అన్న అవహేళన చెట్టు మీది నుంచి వినబడింది. అదే సమయంలో జితవర్మా, శక్తివర్మలిద్దరూ, "వింతజంతువు! వింతమృగం!" అంటూ కెవ్వుమని అరిచి గుర్రాల మీంచి పట్టుదప్పి కిందకు పడిపోయారు.

అంతా కనురెప్పపాటు కాలంలో జరిగిపోయింది. బ్రహ్మదండి చెట్టుకొమ్మ నుంచి వేలాడుతున్నాడు. పై నుంచి అతడి గుర్రం మీదికి ముసలివాడు దూకాడు. కేశవుడూ, జయమల్లూ ఒక్క ఎగురున జితవర్మా, శక్తివర్మల గుర్రాలను అధిరోహించారు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఊరండి!" అంటూ ముసలివాడు తన గుర్రాన్ని అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తించసాగాడు. ఆ సరికి







బ్రహ్మదండికి కాస్త ధైర్యం వచ్చింది. అతడు తన నడుముకు బిగిసివున్న తాడును అటూయిటూ గుంజుతూ, "జితా, శక్తీ! ఎక్కడ? మీరు చూసింది వింతమృగమా? అయితే వాళ్ళు కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ అయివుంటారు. ఆ జయమల్లు ఒక్కడికే ఆ విద్య తెలుసు. వాళ్ళను వెంబడించండి. పట్టుకోండి! నరకండి!" అంటూ కేకలువేశాడు.

జితవర్మా, శక్తివర్మా ఆ మాటలతో కాస్త ధైర్యం తెచ్చుకుని లేచి నిలబడి, ఒరనుంచి కత్తులు దూసేంతలో, బ్రహ్మదండి ఏడుపు గొంతుతో, "జితా, శక్తీ! ఆగండి,,ఆగండి. ముందిటు రండి! నన్ను ఈ కొమ్మ నుంచి కిందికి దించండి," అని అరిచాడు.

జితవర్మా, శక్తివర్మలు అతణ్ణి సమీపించి, బ్రహ్మదండి నడుముకు బిగిసివున్న తాడును తమ కత్తులతో నరికి, దభీమంటూ కింద పడబోతున్న అతణ్ణి, మధ్యలోనే పట్టుకుని దించి నిలబెట్టారు.

పల్లె పక్కగా అరణ్యంలో రేగిన ఈ కల్లోలం, పల్లెవాసుల చెవిని బడింది. వాళ్ళు కాగడాలూ, కర్రలూ తీసుకుని అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. బ్రహ్మదండినీ, అతడి అంగరక్షకుల్నీ ఆ స్థితిలో



చూసి వాళ్ళకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

"అలా గోళ్ళు గిల్లుకుంటూ చూస్తారేం, మతులేమన్నా పోయినయ్యా?" అంటూ బ్రహ్మదండి వాళ్ళ మీద విరుచుకుపడ్డాడు. "మేమే రాజుగారు పంపగా వచ్చిన, ఆస్థానోద్యోగులం! ముగ్గురు రాజద్రోహులు మా గుర్రాలను అపహరించుకుని, అటుగా పారిపోయారు. వాళ్ళను పట్టుకోండి. అదృష్టవంతుడికి అర్ధ రాజ్యం!" అంటూ పళ్ళు కొరికాడు.

పల్లెవాసుల్లో సాహసవంతులైన కొందరు యువకులు, బ్రహ్మదండి చూపిన వైపుకు









పరిగెత్తాము. తతిమ్మా వాళ్ళు బ్రహ్మధరుడినీ, జీత, శక్తివర్మలనూ పల్లెకు తీసుకుపోయారు.

జయమల్లూ, కేశవుడూ, అతడి ముసలి తండ్రీ ఎక్కిన గుర్రాలు అరణ్యానికి అడ్డం పడి పరిగెత్తసాగినై. కాని, చీకటీ, దారి నడ్డగించే చెట్లకొమ్మలూ, ముళ్ళపొదలూ ఆటంకాల వల్ల, వాళ్ళు అనుకున్నంత వేగంగా పారిపోలేకపోయారు. ఇంతలో వాళ్ళకు వెనకగా, కాగడాలూ, కర్రలతో వస్తున్న పల్లెయువకులు కనిపించారు.

"మనం చిక్కులో పడ్డాం," అన్నాడు జయమల్లు గుర్రం మీంచి వెను దిరిగి, తమను వెంబడిస్తున్న పల్లెవాసుల కేసి చూసి.

"చిక్కుల్లో పడటం మనకేమన్నా కొత్తా? ఇది మొదటిసారి కాదు, ఆఖరుసారి కాదు," అంటూ ముసలివాడు విసుక్కుని, "అదిగో, అక్కడేదో దీపపుకాంతి లాటిది వున్నది, మీకు కనబడుతున్నదా? బహుశా, అది అరణ్యంలో నివశించే, ఏ గొర్లకాపరి యిల్లో అయివుంటుంది. మనం సరాసరి అక్కడికి వెళ్ళి, ఆ ఇంట్లో దాక్కునేందుకేమైనా అవకాశం వుందేమో ప్రయత్నిద్దాం. అంత తప్పనిసరైతే, గుర్రాలను వదిలేద్దాం," అన్నాడు.

క్షణాల మీద ముగ్గురూ, ఆ దీపపు కాంతి కనిపిస్తున్న వైపుకు తమ గుర్రాలను ఉరికించారు. వాళ్ళు దాన్ని సమీపిస్తూండగానే, చెట్లచాటు నుంచి రెండు కంఠాలు, "ఎవరా వచ్చేది? ఆగండి!" అంటూ కఠినంగా హెచ్చరించినై.

ఆ హెచ్చరిక వింటూనే ముసలివాడు గుర్రం దిగి, "అయ్యా, మీరెవరో మాకు తెలియదు. మేం యాత్రికులం. మమ్మల్ని దోచుకునేందుకు బందిపోటు దొంగలు వెంటబడితే, యిటు పారిపోయివస్తున్నాం. వాళ్ళ కాగడాలవెలుగూ, చేతుల్లో కర్రలూ మీరూ చూసే వుంటారు!" అన్నాడు.

ముసలివాడు మాట ముగించీ ముగించకముందే, దీపం గప్పున ఆరిపోయింది.





ఒక ఆజానుబాహుడైన కోయవాడు, పెద్ద ఈటె ఒకటి పట్టుకుని, అక్కడికి పరిగెత్తు కుంటూ వచ్చాడు. అతడు కేశవుణ్ణీ, జయ మల్లునూ చూస్తూనే, "మీ రా ఎగువనున్న పల్లె వైపు నుంచేనా రావటం? ఆ పల్లె వాసుల్లో సగం మందికి ధనం దోచుకోవటం వృత్తి, తతిమ్మా సగానికి వినోదం కోసం గొంతులు కోయటమే పని. మీరేమీ భయ పడకండి, మీ రక్షణభారం నాది!" అంటూ పక్కకు తిరిగి, "ఓ హోయ్, ఆ కాగడాలు పట్టుకువచ్చే వాళ్ళ మీద గురిచూసి బాణాలు వదలండి! వాళ్ళు మరొక్క అడుగైనా ముందుకు రాకూడదు," అన్నాడు.

అప్పటివరకూ నిశ్శబ్దంగా'వున్న ఆ ప్రాంతం కేకలతో హెచ్చరికలతో మార్మోగి పోయింది. కోయ యువకులు చెట్ల మీది నుంచీ, పొదలమాటు నుంచీ పల్లె యువ కుల మీదికి గురిచేసి బాణాలు రివ్వురివ్వు మంటూ వదలసాగారు. చూస్తూండగానే ఆ ప్రదేశమంతా యుద్ధరంగంగా మారింది. అర్థరాజ్యం వస్తుందన్న ఆశతో పల్లె యువ కులూ, తమ కులపెద్ద ఆజ్ఞను పాలించే పట్టుదలతో కోయయువకులూ సంకుల సమరం సాగించారు. బాణం వేటుదాటి ముందుకు వచ్చిన పల్లెయువకులతో, కోయ యువకులు కర్రలు తీసుకుని పోరాడ సాగారు. ఓ క్షణకాలం కోయల కులపెద్ద ఆ దృశ్యం కేసి చూసి, తల పంకిస్తూ, "మా వాళ్ళ ధాటికి, ఆ దుర్మార్గులు నిలబడ లేరు, ఆ సంగతి నాకు తెలుసు! అయినా, యిక ఈ రాత్రికి, ఈ ప్రదేశం క్షేమకరం కాదు. నా రక్షణ కోరిన వాళ్ళను కాపాడే బాధ్యత నాది కనక, మిమ్ములను ఒక రహస్య ప్రదేశానికి తీసుకుపోతాను రండి," అంటూ బయలుదేరాడు. జయమల్లూ, కేశ వుడూ, ముసలివాడూ అతనికి వెనకగా, గుర్రాలను కళ్ళాలు పట్టుకుని నడిపించు కుంటూ కదిలారు. —(ఇంకా వుంది)






## 14

[అరణ్యంలో కేశవుడూ వాళ్ళకు, బ్రహ్మదండి మాంత్రికుడు తన అంగరక్షకులతో రావటం కనిపించింది. వాళ్ళు, బ్రహ్మదండిని చెట్టు కొమ్మకు వేలాడదీసి, వాళ్ళ గుర్రాలను ఎక్కి పారిపోసాగారు. పన్లిభటులు వెంబడించారు. ఒక కోయకులపెద్ద వాళ్లకు అభయం యిచ్చి, వాళ్లను ఒక రహస్యప్రదేశానికి తీసుకుపోసాగాడు. తరవాత—]

కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ, కోయనాయకుడి వెంట దారి డొంకాలేని మహారణ్యంలో పడి ఒక గంటకాలం నడిచారు. అంతా అంధకారం, కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. తామెవరో నిజం తెలిస్తే, ఈ కోయవాడు తమను రాజభటులకు అప్పగిస్తాడేమోనన్న అనుమానం ముసలివాణ్ణీ, తతిమ్మా యిద్దర్నీ బాధించసాగింది. ప్రస్తుతానికి బ్రహ్మదండి నుంచి ప్రమాదం తప్పింది కనక, తాము గుర్రాలెక్కి పారిపోవటం క్షేమమేమో అన్న ఆలోచన ముసలివాడికి కలిగింది.

ఈ ఆలోచన రహస్యంగా కేశవుడికీ, జయమల్లుకూ చెప్పాడు ముసలివాడు. కాని, వాళ్ళు దానికి ఒప్పుకో లేదు. చీకట్లో తామెటు పోతున్నదీ తెలుసుకోకుండా, పారిపోవటం ప్రారంభిస్తే, తాము తిరిగి బ్రహ్మపుర నగర పరిసరాలకే వెళ్ళే అవకాశం వున్నదనీ, అప్పుడు తమకు తప్పక ప్రమాదం కలుగుతుందనీ వాళ్ళు అన్నారు.







"అర్ధరాజ్యానికి ఆశ పడి, ఈ కోయవాడు మోసానికి పూనుకుంటే, ఏం చేసేట్టు?" అన్నాడు ముసలివాడు.

కేశవుడు తన ఒరలో వున్న కత్తి కేసి వేలు చూపాడు. జయమల్లు అంబుల పొది లోంచి ఒక బాణం లాగి, తిరిగి దాన్ని యథాస్థానంలో పెట్టాడు. తన కొడుకూ, అతడి మిత్రుడూ కనబరిచిన ధైర్యానికి, ముసలివాడు ఎంతో సంతోషించాడు. ఈ పండు వయసులో తను ఏ క్షణాన ఏ చెట్టు కిందో రాలిపోయినా, తన కొడుకు ఈ లోకంలో అన్ని కష్టాలనూ సాహసంతో ఎదుర్కొన గలడన్న నమ్మకం అతడికి కలిగింది.

అందరికన్న ముందు నడుస్తున్న కోయల కుల పెద్ద, ఒక మహా వృక్షం కింద ఆగి, తన చేతనున్న ఈటెతో, దాని బోదె మీద మూడుసార్లు గట్టిగా కొట్టాడు. ఆ వెంటనే, చెట్ల చాటునుంచి, "ఆగండి! ఎవరు?" అన్న ప్రశ్న భీకరంగా వినిపించింది.

కోయనాయకుడు ఈటెను పైకెత్తి, "గడేజంగ్, గడేజంగ్!" అంటూ రెండుసార్లు బిగ్గరగా అరిచాడు. మరుక్షణంలో ఇద్దరు కోయయువకులు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "జంగదొరా, ఏం సెలవు?" అంటూ తలలు వంచి నిలబడ్డారు.

"వీళ్ళు ముగ్గురూ బాటసారులు. బందిపోట్ల నుంచి పారిపోయివచ్చి, మన రక్షణ కోరినవాళ్ళు. వీళ్ళను తెల్లవారే వరకూ కాపాడవలసిన బాధ్యత మనది. పోతే, మన వాళ్ళలో పదీ పన్నెండు మందిని, గూబమాను పక్కనవున్న పల్లెకు పంపి, అక్కడ మనవాళ్ళకూ, ఆ పల్లెలోని దుర్మార్గులకూ జరుగుతున్న పోరు ఏమయిందో తెలుసుకు రావాలి," అన్నాడు గడేజంగ్.

తమ నాయకుడి ఆజ్ఞకాగానే యువకుల్లో ఒకడు చెట్ల వెనక్కు పరిగెత్తాడు. రెండవవాడు కేశవుణ్ణీ, జయమల్లునూ, ముసలివాణ్ణీ వెంట బెట్టుకుని, దాపులనే





వున్న కొండ గుహల కేసి బయలుదేరాడు. కేశవుడూ, అతడి అనుచరులూ, చెట్టు చేమలతో దట్టంగా కప్పబడిన ఒక కొండ గుహలో చేరి, కోయయువకు డిచ్చిన, పళ్ళూ ఫలాలూ, కాల్చిన లేడి మాంసమూ తృప్తిగా తింటూండగా, అక్కడ గూబమాను పల్లె చేరిన బ్రహ్మదండి మాంత్రికుడు, ఆకలితో, అవమానంతో కడుపు భగ్గుమంటూండగా, పల్లెవాసుల్ని నోటికి వచ్చినట్లల్లా దుర్భాష లాడుతున్నాడు.

"రాజద్రోహులకు పల్లెలో ఆశ్రయం యివ్వటమేగాక, రాజదూతలను చంపేందుకు వాళ్ళను అరణ్యా దారి మార్గంలో కాపలాపెడతారా? ఈ మహాపరాధానికి పల్లెలోని పిన్నా, పెద్దా, ఆడా, మగా అందర్నీ—క్షణాలమీద భస్మం చేయగలను! అం హుం ఫట్ ఘట్...కాల భైరవా..." అంటూ బ్రహ్మదండి మంత్రం జపించేంతలో, కేకలు పెడుతూ కొందరు అరణ్యం వైపునుంచి, పల్లెలోకి రాసాగారు. వాళ్ళ చేతుల్లో వున్న కాగడాల వెలుగులో, ఆ వచ్చేవాళ్ళల్లో కొందరు కుంటుతూ వుండటం, మరికొందరు గాయపడిన తమ అనుచరుల్ని మోసుకురావటం,కనిపించింది.

"రాజద్రోహు లెక్కడ?" అంటూ బ్రహ్మదండి కేకలు పెట్టాడు. అతడి అంగ





రక్షకులైన జితవర్మా, శక్తివర్మలూ, కొందరు పల్లెవాసులూ వాళ్ళకేసి పరిగెత్తారు. కాని, ఆ వస్తున్న వాళ్ళందరూ పల్లె యువకులే. వాళ్ళందరి ముఖాలమీదా భయ భీతులు తాండవిస్తున్నవి. వాళ్ళల్లో దాదాపు గాయపడనివాడంటూ ఒకడూ లేడు.

"ఆ రాజద్రోహులు పారిపోయారా ?" అని అడిగారు జితవర్మా, శక్తివర్మలు.

"ఉత్తినే పారిపోవటం కాదు, మా మీదికి కోయవిలుకాళ్ళను పంపకంచేసి మరీ పారిపోయారు. మా వాళ్ళల్లో కొందరు చచ్చారు కూడా. అర్ధ రాజ్యానికి వేయి దణ్ణాలు !" అన్నారు పల్లె యువకులు.



ఇంతలో బ్రహ్మదండి అక్కడికి వచ్చాడు. అతడికి మారువేషాల్లో వున్న కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ దొరక్కుండా పారిపోయారని అర్థమైంది. అతడిక్కలిగిన కోపం అంతా యింతా కాదు.

"మీ పల్లెవాసులంతా, ఇంత చచ్చువెధవలని నాకు తెలియదు. ఇంతమంది వుండి, ముగ్గురంటే ముగ్గురు రాజద్రోహుల్ని ప్రాణాలతో పారిపోనిస్తారా! సరే, జితా, శక్తీ! మీరు వెంటనే వెళ్ళి మహారాజులుంగారితో, మహారాజగురు శ్రేష్ఠులతో యిక్కడ జరిగిన భీభత్సం సంగతి చెప్పండి. ఆ రాజద్రోహుల్ని మట్టుపెట్టకపోతే, మనం వింధ్యారణ్యాలకు వెళ్ళేలోపలే హతం అయిపోతాం," అన్నాడు.

జితవర్మా, శక్తివర్మలు ముఖముఖాలు చూసుకున్నారు. ఇద్దరికీ ప్రాణభయం పట్టుకున్నది. బ్రహ్మపురనగరం చేరే లోపల, మహారణ్యంలో ఆ రాజద్రోహులు తమను దొరక పుచ్చుకుంటే ఏమికాను? వాళ్ళ మనసుల్లోని భావాలు గ్రహించినవాడిలా బ్రహ్మదండి పెద్దగా హుంకరించి, "మీరా నాకు అంగరక్షకులు! మిమ్మల్ని నమ్ముకుని వింధ్యారణ్యాలకు పోవటం అంటే, కోరి ప్రాణగొడ్డం తెచ్చుకున్నట్టే!" అన్నాడు.






"అది కాదు, బ్రహ్మదండీ! ఈ రాత్రికి రాత్రే వెళ్ళి రాజగురువుతో, యీ సంగతి చెప్పటం అంత అవసరమంటావా?" అన్నాడు జితవర్మ.

"అవసరమా! ఎందుక్కాదు? ఆ ద్రోహుల్ని విచ్చలవిడిగా సంచరించనిస్తే, మనం వింధ్యారణ్యాలకు ఎలా చేరగలం? వాళ్ళు, మన గుర్రాలను కూడా అపహరించారు గదా! రాజగురు శిరోమణికి అంతా తెలిస్తే, ఆయన సైనికులను పంపి, వాళ్ళను వేటాడించగలడు గదా? అదెంత త్వరగా జరిగితే, మనకంత క్షేమం గదా?" అన్నాడు బ్రహ్మదండి.

జితవర్మా, శక్తివర్మలు పల్లెవాసుల్లో పది మందిని ధనాశ చూపి, తమకు తోడుగా వెంట బెట్టుకుని, బ్రహ్మపురం కేసి బయలు దేరారు. వాళ్ళు అలా కొంచెం దూరం వెళ్ళారో లేదో, మాంత్రికుడు పరిగెత్తి జితవర్మ భుజం పట్టుకుని దూరంగా లాక్కుపోయి, "జితా! నువ్వూ, శక్తీ కూడా వెళితే, ఈ పల్లెలో నేను ఒంటరిగాణ్ణయిపోతాను. ఈ దుర్మార్గుల్లో ఎవడో ఒకడు నా గొంతుకోస్తే, నా గతేంకాను? నువ్వు యిక్కడేవుండు. శక్తి నగరానికివెళతాడు," అన్నాడు. జిత శక్తివర్మలు కూడ ఒప్పుకున్నారు. జితవర్మ, బ్రహ్మదండితో పాటు





పల్లెలో వుండేందుకు అంగీకరించాడు.' పది మంది పల్లెవాసుల్ని అసరాగా పెట్టుకుని బయలుదేరిన శక్తివర్మ సూర్యోదయం అవుతూండగా బ్రహ్మపురం చేరి, రాజగురువు దర్శనం చేసుకున్నాడు.

జరిగినదానికి చిలవలూ పలవలూ అల్లి అతడు చెప్పినదంతా రాజగురువు సావధానంగా విని, "నెను త్రంమిప ఆ ముగ్గురూ నా ప్రయత్నాలకు విఘ్నం కలిగించేలా వున్నారు," అని స్వగతంలా అనుకుని, సేనానాయకుడి కోసం కబురుచేశాడు.

కొద్దిసేపటి తరవాత సేనానాయకుడు రాగానే, రాజగురువు అరణ్యంలో బ్రహ్మదండి మాంత్రికుడికి కాస్తలో ప్రాణగండం తప్పిన వైనం చెప్పి, "ఆ ముగ్గురు ద్రోహులూ యింకా మన రాజ్య సరిహద్దుల్లోనే వున్నారని తెలిపోయింది. నువ్వు, సైనికులను జట్లుజట్లుగా పంపి, అరణ్యం, కొండలూ గాలించి వాళ్ళను పట్టుకోవాలి. సరిహద్దు కావలావాళ్ళకు కూడా హెచ్చరిక పంపు. ఆ ద్రోహులిప్పుడు క్షత్రియ యువకుల్లా వేషాలు వేసుకుని వున్నారు. ముసలివాడు దండ కమండలాలు పట్టి, కపట సన్యాసం నటిస్తున్నాడు," అన్నాడు.

సేనానాయకుడు రాజగురువు దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళి, ఒకటి రెండు గంటలకాలం గడిచీ గడవక ముందే, సైనికులను పదీ ఇరవైమంది చొప్పున జట్లుజట్లుగా విభజించి, అరణ్య ప్రదేశాలన్నీ గాలించేందుకు పంపాడు. తరవాత, తను ఒక పాతికమంది మెరికల్లాంటి సైనికులతో స్వయంగా రాజద్రోహులను పట్టుకునేందుకు బయలుదేరాడు.

సరిగ్గా మిట్టమధ్యాహ్నం సమయం. ఆకాశం మధ్యం నుంచి సూర్యుడు నిప్పులు చెరుగుతున్నా, అరణ్యంలో దట్టంగా పెరిగివున్న చెట్ల కింద చల్లగా వున్నది. ఆ కిందటి రాత్రి తాము గడిపిన గుహలో





నుంచి బయటికి వచ్చి కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ—గుహ ముందున్న చెట్ల కింద కూర్చున్నారు. వాళ్ళ కెదురుగా పులిచర్మాలు పరిచిన ఒక ఎత్తయిన పీఠం మీద గడేజంగ్ కూర్చుని వున్నాడు. కేశవుడూ వాళ్ళు తమ ప్రయాణాన్ని గురించి గడేజంగ్‌తో మాట్లాడుతున్నారు.

హఠాత్తుగా ఇద్దరు కోయయువకులు చెట్ల చాటునుంచి బాణాల్లా దూసుకువచ్చి, తమ నాయకుడి ముందు రొప్పుతూ నిలబడ్డారు. గడేజంగ్, ఆశ్చర్యంగా వాళ్ళ కేసి చూస్తూ, "ఏం జరిగింది?" అని ఆదుర్దాగా వాళ్ళను ప్రశ్నించాడు.

ఆ యువకులు కేశవుడూ, జయమల్లుల కేసి ఓ త్రుటికాలం అనుమానంగా చూసి, "జంగ్‌వీరా! చాలా ముఖ్యమైన రహస్యం. ఇప్పుడే తెలిసింది. మీరు కాస్త అవతలికి రండి, చెపుతాం," అన్నారు.

గడేజంగ్ పీఠం మీది నుంచి లేచి వాళ్ళ వెంట కాస్త దూరం నడిచి ఆగాడు. యువకుల్లో ఒకడు చిన్నగొంతుతో తమ నాయకుడికి ఏమో చెప్పసాగాడు. గడేజంగ్ కొద్దిసేపు విని, తలపక్కకు తిప్పి, కేశవుడూ అతడి అనుచరుల కేసి ఆశ్చర్యంగా చూసి, తల పంకిస్తూ వాళ్ళ కేసి రాసాగాడు.



తమ కేదో అనుకోని ప్రమాదం రానున్నదని కేశవుడు భావించాడు. జయమల్లూ, ముసలివాడూ ఒకేసారి ఒరలోవున్న తమ కత్తుల మీదికి చేతులు పోనిచ్చారు. ఇదంతా గమనిస్తున్న గడేజంగ్ చిరునవ్వు నవ్వుతూ వాళ్ళను సమీపించి, "మీ ధైర్యసాహసాలు చెప్పుకోదగినవి. కాని, మీ రహస్యం బయటపడిపోయింది. బ్రహ్మపుర సైనికులు మీ కోసం అరణ్యం అంతా గాలిస్తున్నారు. సరిహద్దు కాపలావాళ్ళకు కూడా హెచ్చరిక వెళ్ళింది. మీరు క్షత్రియులూ కాదు, మామూలు ప్రయాణికులూ కాదు. రాజుతో వైరం తెచ్చుకున్నవాళ్ళు!" అన్నాడు.





"అర్ధరాజ్యానికి ఆశించి, నీ రక్షణ కోరిన వాళ్ళను, సైనికులకు అప్పగించబోతున్నావా, గడేబంగ్?" అన్నాడు కేశవుడు.

గడేబంగ్ పొట్టచెక్కలయేలా నవ్వుతూ, పీఠం మీది నుంచి వెల్లకిలా కిందబడి, లేచి, "అర్ధరాజ్యం కాదు, మొత్తం బ్రహ్మపుర రాజ్యం యిచ్చినా నేను తీసుకోను. నాకెందుకు రాజ్యం? ఈ మహారణ్యమే నా రాజ్యం. నా కులపువాళ్ళూ, యిక్కడ తిరిగే సాధు, క్రూరమృగాలూ నా పౌరులు. మీరు వెంటనే కోయవేషాలు వేసుకోండి. నా అనుచరులు మిమ్మల్ని సరిహద్దు దాటిస్తారు," అన్నాడు.

ఆ మాటలతో కేశవుడికీ, జయమల్లుకూ, ముసలివాడికీ కలిగిన ఆనందం అంతా యింతా కాదు. వాళ్ళు గడేబంగ్‌కు ఒకటికి రెండుసార్లు తమ కృతజ్ఞత తెలియపరిచారు. గడేబంగ్ అనుచరులు తెచ్చియిచ్చిన లేడి చర్మాలు కట్టుకుని, తలల్లో పక్షి ఈకలు ధరించి, తమ దుస్తుల్ని మూటలుగా కట్టి భుజాల మీద వేసుకుని ప్రయాణసన్నాహమయారు.

గడేబంగ్, కోయయువకులిద్దర్ని పిలిచి వాళ్ళతో, "ముందు ఆ మూడు గుర్రాలనూ అరణ్యంలోకి తరిమెయ్యండి. తరవాత నా మిత్రులు యీ ముగ్గుర్నీ అడ్డదారి వెంట తీసుకుపోయి, రాజ్య సరిహద్దులు దాటించండి. ఆ ప్రయత్నంలో సరిహద్దు కాపలావాళ్ళతో పోరు తప్పకపోతే, ముందు ప్రాణాలర్పించవలసిన వాళ్ళు, మీ యిద్దరు!" అన్నాడు.

కేకలమీద గుర్రాలు మూడూ అరణ్యం లోపలికి తరమబడినై. కోయయువకుల్లో ఒకడు ముందూ, ఒకడు వెనకా నడవగా, కోయల్లా వేషాలు మార్చుకున్న కేశవుడూ, ముసలివాడూ, జయమల్లూ, బ్రహ్మపుర రాజ్య సరిహద్దుల్ని దాటి పోయేందుకు బయలుదేరారు. —(ఇంకా వుంది)





# రాకాసి లోయ

## 15

[తనకు అరణ్యంలో జరిగిన ప్రమాదాన్ని గురించి బ్రహ్మదండి మాంత్రికుడు, రాజగురువుకు వార్త పంపాడు. సేనానాయకుడు, కేశవుడూ వాళ్ళ కోసం అరణ్యమంతా గాలించేందుకు సైనికులను పంపాడు. కోయలపెద్ద, కేశవుణ్ణీ, అతడి అనుచరులనూ రాజ్య సరిహద్దులు దాటించేందుకు ఇద్దరు కోయయువకుల్ని నియోగించాడు. —తరవాత]

కోయయువకుల వెంట అరణ్యంలో కొంత దూరం ప్రయాణించే సరికి, కేశవుడూ వాళ్ళకు, తాము బ్రహ్మపురరాజ్య సరిహద్దులు దాటి పారిపోవటం అంత తేలిక కాదని అర్థమైపోయింది. బ్రహ్మపుర సేనానాయకుడు పంపిన సైనికులు అరణ్య మార్గాల వెంట విచ్చలవిడిగా తిరుగుతున్నారు. అంతేకాక, అర్ధరాజ్యం వస్తుందన్న ఆశతో కొందరు ఆటవికులు కేశవుడి కోసం చెట్టూపుట్టలూ వెతుకుతున్నారు. ఇంతమంది కనుగప్పి పారిపోవటం సాధ్యమా? అన్న అనుమానం ముగ్గుర్నీ బాధించసాగింది.

"రాజ్యసరిహద్దులు దాటి పోయేందుకు సైనికుల కెవరికీ తెలియని రహస్యమార్గాలు మీకేమైనా తెలుసా?" అని కేశవుడి ముసలి తండ్రి, కోయయువకుల్ని ప్రశ్నించాడు.

"మాకు ఈ అరణ్యంలో తెలిసిన అనేక రహస్య మార్గాలున్నవి. వాటిల్లో ఏ ఒకటి బ్రహ్మపుర సైనికులకు తెలియదని







నా నమ్మకం. మనకు ప్రమాదం వచ్చేది వాళ్ళనుంచి కాదు. రాజు యిస్తానన్న అర్ధ రాజ్యానికి ఆశించి, మిమ్మల్ని పట్టుకో జూస్తున్న ఆటవికులే మనకు ప్రమాదకారులు. వాళ్ళకూడా అన్ని గుప్త మార్గాలూ తెలుసు," అన్నా డొక కోయ యువకుడు. అంతలో వాళ్ళకు ఎదురుగా వున్న కొండరాళ్ళ మీద కొందరు సైనికులు కనిపించారు. వాళ్ళ వెంట ఇద్దరు ఆటవికులు కూడా వున్నారు.

"అందరూ చెట్లచాటుకు పదండి. సైనికులు మన కేసే వస్తున్నట్టున్నది," అంటూ కోయయువకులు చప్పున వెనుదిరిగి, చెట్ల మాటుకు పరిగెత్తారు. కేశవుడూ, జయమల్లూ ముసలివాడూ కూడా వాళ్ళవెంట పరిగెత్తారు.

అందరూ చెట్లచాటున దాక్కుని, సైనికుల కేసి చూడసాగారు. జయమల్లు పెద్దగా నిట్టూరుస్తూ, "మేం కోయవేషాలు వేసుకున్నాం గదా, అలాంటప్పుడు సైనికులతో దాగుడుమూత లెందుకు? నిర్భయంగా వాళ్ళు చూస్తూండగానే రాజ్యసరిహద్దులు దాటవచ్చునే!" అన్నాడు.

"సైనికులకు మీరు కోయవాళ్ళలా కనిపించవచ్చునేమోగాని, వాళ్ళ వెంటవున్న ఆటవికులు మీ రెవరైందీ వెంటనే పసికట్ట గలరు," అన్నా డొక కోయయువకుడు. జయమల్లు అతణ్ణి మరేదో అడగబోయేంతలో, వెనకవైపు నుంచి పెద్ద కలకలం వినబడింది. చప్పున అందరూ అటుకేసి తిరిగిచూశారు. దూరంగా చెట్లచాటు నుంచి తమ కేసే వస్తున్న సైనికులు కొందరు వాళ్ళకు కనిపించారు.

"వాళ్ళింకా మనను చూడలేదు. మనం ఎటు పారిపోయేందుకూ అవకాశంవున్నట్టు లేదే!" అంటూ కేశవుడు విల్లంబులు చేతికి తీసుకున్నాడు. కోయయువకుడు అతణ్ణి వారిస్తూ, "అంతమందితో మనం యుద్ధం

చెయ్యలేం. అదుగో, ఆ కనబడే గుహల్లో ఎక్కడైనా దాక్కుందాం," అంటూ కొండ కేసి బయలుదేరాడు.

అందరూ చెట్లచాటున నక్కుతూ, ముందుకు కదిలారు. ఎదురుగా కొండ పాదంలో వాళ్ళకు చాలా గుహలు కనిపించినై. సైనికులు తమ కోసం ఆ గుహలు వెతకటం ప్రారంభిస్తే, తాము బోనులో చిక్కిన ఎలుకల్లా దొరికిపోతారు. ముసలివాడు ఈ అనుమానాన్ని కోయయువకులకు చెప్పాడు. వాళ్ళనూ యిలాంటి అనుమానమే బాధిస్తున్నది. చెట్లచాటున దాక్కునే అవకాశంలేదు. తమను అన్నివైపుల నుంచీ సైనికులు చుట్టుముట్టుతున్నట్టున్నది. బహుశా, వాళ్ళు గుహల్లో తమ కోసం వెతికేందుకు వస్తున్నారు. అదృష్టమల్లా, ఇంతవరకూ తాము వాళ్ళ కంట బడకపోవటం!

హఠాత్తుగా ముందు నడుస్తున్న కోయ యువకుడు ఆగిపోయాడు. అతడి మార్గానికి ఎదురుగా వున్న ఒక రాతి చాటు నుంచి, ఒక నక్క ఎగిరి దూరంగా దూకింది. ఆ వెంటనే రెండు చిన్నపిల్లలు దాని కేసి పరిగెత్తినై. కోయయువకుడు బాణం తీసి, తల్లి నక్కను దూసుకుపోయేట్టు వదిలాడు.



అది వెనక్కు తిరిగిచూడకుండా, ఎదురుగా వున్న గుహల్లో ఒకదాని కేసి దౌడుతీసింది.

"అదృష్టం కొందికి మనకి నక్క ఎదురైంది. అది ప్రవేశించిన గుహ చూశారు గదా? మనం కూడా దాంట్లోకే వెళదాం," అన్నాడు కోయయువకుడు.

"సైనికులు ఆ గుహలన్నీ గాలించేందుకే వస్తున్నారు," అన్నాడు జయమల్లు.

"వస్తే ఏం? మనం ఆ గుహలో వుండం గదా! శత్రువు నుంచి పరిగెత్తే నక్క, ఏదీ, పారిపోయేందుకు మరోమార్గంలేని గుహలో ప్రవేశించదు. పైగా, ఇది పిల్లలనక్క!" అన్నాడు కోయయువకుడు.







కేశవుడూ, అతడి ముసలితండ్రి, జయమల్లూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళు కోయయువకుల వెంట పరిగెత్తి గుహలో ప్రవేశించారు. గుహ అంతా చిమ్మచీకటిగా వున్నది. ఎక్కడా వెలుగు లేదు. కోయయువకుడి ఊహ తప్పని ఆ ముగ్గురూ భావించారు.

"గుహలోనుంచి బయటికి పోయేందుకు మరోమార్గం వున్నట్టులేదే?" అన్నాడు జయమల్లు నిస్పృహగా. కోయయువకు లిద్దరూ మెల్లిగా ఏమో మాట్లాడుకోసాగారు. కేశవుడు, గుహలో నుంచి తల బయటికిపెట్టి అన్నివైపులకూ కలయచూశాడు. సైనికులూ, వాళ్ళకు దారిచూపుతున్న ఆటవికులలా గుహల కేసే వస్తున్నారు.

కేశవుడు చప్పున వెనుదిరిగి ఏదో అన బోయేంతలో, కోయయువకుడి చేతిలో కాగడా గప్పున వెలిగింది. అతడు, జయమల్లు కేసి తిరిగి, "నక్క యింకా ఈ గుహలోనేవున్నదని మీ అనుమానమా?" అంటూ నవ్వి, "అది వెళ్ళినమార్గానే మనం పోవలసివుంటుంది," అంటూ ముందుకు కదిలాడు. అందరూ కలిసి గుహలో ఓ ఇరవై అడుగుల దూరం నడిచే సరికి, హఠాత్తుగా పెద్దగాలి తాకి, కోయయువకుడి చేతిలోని కాగడా గుప్పుమంటూ ఆరిపోయింది.

"చూశారా, గుహ నుంచి బయటికి పారిపోయేందుకు మార్గం ఎక్కడవున్నదో తెలిసిపోయింది." అంటూ కోయయువకుడు పక్కకు రెండడుగులు వేసేసరికి, పైనుంచి పెద్ద వెలుగు అతడి మీద పడింది. అతడు తతిమ్మా వాళ్లకు సౌంజ్ఞచేసి, అక్కడవున్న రాళ్ళ ఆధారంతో పాకుతూ, పైనున్న కంత అంచును గట్టిగాపట్టుకుని, ఒక్క ఊపులో పైకి వెళ్ళిపోయాడు. మిగిలిన నలుగురు కూడా అతణ్ణి అనుసరించి, గుహలో నుంచి వున్న రహస్య మార్గంగుండా త్వరత్వరగా బయటికి వెళ్ళారు.







అక్కడ కొండ మీద నిలబడిచూస్తే, ఆ ప్రదేశమంతా నిర్జనంగా కనిపించింది. దూరంగా దిగువున ఒక నది ప్రవహిస్తున్నది. ఆ నదిలోకి చొచ్చుకు వచ్చిన ఒక కొండా, దాని మీది నుంచి నదిలోకి పడుతున్న ఒక జలపాతమూ వాళ్ల కంటబడింది.

"ఆ జలపాతం చాటున ఒక సొరంగం వున్నది. ఆ సొరంగం నీటి మార్గాన కొద్ది దూరం ప్రయాణించి, అవతలవున్న నది పాయను చేరవచ్చు. అది దాటితే కపిల రాజ్యం!" అన్నాడొక కోయయువకుడు.

అంతలో రెండవ కోయయువకుడు చిన్నగా అరిచి, "చూడండి, చూడండి! అదుగో, ఆ నది ఒడ్డున, గుట్టల చాటుగా సైనికుల శిబిరాలు కనిపిస్తున్నవి," అన్నాడు.

అందరూ అటుకేసి చూశారు. నది అంచున పది పన్నెండు డేరాలు వున్నవి. వాటి ముందు ఒక పెద్ద ఈటె పట్టుకుని ఒక సైనికుడు నిలబడివున్నాడు.

"సైనికులందరూ మన కోసం కొండలూ గుట్టలూ గాలించేందుకు వెళ్ళినట్టున్నది. ఆ ఒక్కడే కాపలా కాస్తున్నాడు. వాణ్ణి హతమార్చితే, మనం నదిని నిరాటంకంగా దాటవచ్చు," అన్నాడు కేశవుడు. అవునన్నట్టు అందరూ తలలువూపారు. కేశవుడు రొండిన వేలాడుతున్న చిన్న కత్తిని ఒరలో నుంచి లాగి, పిల్లిలా ఆ సైనికుడి కేసి నడవసాగాడు. సైనికుడి దృష్టి మరోవైపుకు మళ్ళివున్నది.

కేశవుడికి వెనకగా అందరూ బయలుదేరారు. ఒక్క బాణం దెబ్బతో సైనికుణ్ణి చంపవచ్చు. కాని, చచ్చేముందు వాడు కేకవేస్తే, తమ ఉనికి వాడి అనుచరులకు తెలిసిపోతుంది. వాణ్ణి కిక్కురు మనకుండా తుదముట్టించాలి!

అందరూ యిలా ఆలోచిస్తూ, చడీ చప్పుడూ లేకుండా రాళ్లచాటున నక్కుతూ వెళుతున్నారు. ఇంతలో కేశవుడు కాపలా సైనికుడి వెనకవున్న బండరాయిని చేరి,







దాని వెనక నుంచి, ఒక్క వూపులో పైకెగిరి, సైనికుడి మెడకేసి కత్తి విసిరాడు. సైనికుడు కిక్కురుమనకుండా దుంగలా ముందుకు పడిపోయాడు.

కేశవుడు లేచి నిలబడ్డాడు. అక్కడికి సుమారు నూరుగజాల దూరంలో నది తీరం వున్నది. తీరాన నాలుగైదు దోనె పడవలు నీటిలో తేలియాడుతున్నవి. కేశవుడు చెయి ఊపగానే అందరూ బిలబిల మంటూ నది తీరానికి పరిగెత్తారు.

"అందరం కలిసి ఒకే దోనెలో వెళ్ళటం మంచిది. నదిలో కొన్నిచోట్ల సుడిగుండాలు వున్నవి. ఖాళీగా వున్న దోనె నొకదానిని ముందుకుతోస్తూ, వెనగ్గా మనం వెళ్ళాలి. అంత ప్రమాదం జరిగేటట్టుగావుంటే, అందరం నదిలో దూకి ఈదక తప్పదు," అన్నాడు కోయయువకుడు.

ఆ విధంగానే, అందరూ ఒక దోనెలో ఎక్కి కూచుని, మరొక దోనెను పెద్ద గడ కర్రతో ముందుకుతోస్తూ, జలపాతం వైపుకు కదిలారు. నదిలో చాలా సుడిగుండాలు వున్నమాట నిజం. అలాంటి ప్రదేశాల్లో ముందున్న దోనె చిక్కుకునే సమయానికి, దాన్ని పక్కకు నెడుతూ, తమ పడవ వాటిల్లో చిక్కుకోకుండా జాగ్రత్తపడుతూ, కొద్దిసేపటికల్లా జలపాతాన్ని సమీపించి, ఒక్క వూపులో దాని వెనకవున్న సొరంగ మార్గాన్ని చేరారు.

సొరంగ మార్గంలో నది జలం విపరీతమైన వేగంతో ప్రవహిస్తున్నది. జలపాతంలో నుంచి వెళ్ళేప్పుడు పడవలో వున్నవాళ్లందరూ పూర్తిగా తడిసిపోయారు. "ఈ సొరంగం అంచులకు తగిలి దోనె ముక్కలు చెక్కలు కావటం తథ్యం," అన్నాడు ముసలివాడు. అంతలో ముందున్న ఖాళీ దోనె, సొరంగం అంచులకు గుద్దుకుని ఫెళఫెళ మంటూ విచ్చిపోయింది. ఇంతలో కేశవుడూ వాళ్ళున్న దోనె, దానిని వేగంగా తాకి తల





కిందులైంది. దోనెలో వున్నవాళ్ళందరూ నది ప్రవాహంలో పడిపోయారు. "జ్యేష్ఠా, కనిష్ఠా! మీరెలావున్నారు? మన కోయ అనుచరులు క్షేమమా!" అంటూ కేశవుడి ముసలితండ్రి పెద్దగా కేకపెట్టాడు. ఆ కేకకు జవాబుగా ఒకేసారి నాలుగు గొంతులు పెద్దగా పలికినై. "అయ్యా, నువ్వు ఈదగలవా? సహాయంకావాలా?" అంటూ కేశవుడు తన తండ్రికేసి రాబోయాడు.

"కనిష్ఠా! యిక్కడ అయ్యా ఎవరు?" అంటూ ముసలివాడు కస్సుమని, "శిష్యులూ, కోయ గడేజంగ్ అనుచరులూ! అంతా సారంగం అంచునున్న గండశిలలకు తగలకుండా జాగ్రత్తగా ముందుకు పదండి. ఈ మానానందుడు గజ ఈతగాడు; ఏం భయంలేదు," అన్నాడు.

నాలుగైదు నిమిషాలకాలం సారంగ జలంలో ఈదిన తరవాత హఠాత్తుగా అందరూ నీటి ఉరవడి వల్ల ముందుకు నెట్టబడ్డారు. "ఈ వైపునా మరో జలపాతం వున్నట్టున్నది. మనం..." అంటూ కేశవుడు కీచుమన్నాడు.

సారంగ మార్గాన ప్రవహిస్తున్న నీరు, ముప్పై నలభై అడుగుల ఎత్తు నుంచి కింద వున్న నదిలోకి హోరుమనే శబ్దంతో పడుతున్నది. కేశవుడూ అతడి అనుచరులూ అంత ఎత్తు నుంచి దభీమంటూ నదిలోకి పడిపోయారు.

ఒక్క క్షణకాలం అందరికీ ప్రాణాలు కడబట్టినంతపనయింది. ఆ వెంటనే తెప్పరిల్లి ఒకరినొకరు పేరుపేరునా పిలుచుకుని, అందరూ సురక్షితంగా వున్నట్టు తెలుసుకుని, నది ఆవలి తీరానికి ఈదసాగారు.

బాగా అలిసిపోయి, ప్రాణాలు సొమ్మసిల్లివున్న ఆ అయిదుగురూ, తీరాన్ని సమీపిస్తూనే, దాని అంచున కత్తి కటార్లు పట్టుకుని తమ కేసే చూస్తున్న కొందరు ఆటవికుల్ని చూశారు. —(ఇంకా వుంది.)






# 16

[ ఇద్దరు కోయయువకులు తోడుగా బయలుదేరిన కేశవుడూ అతడి అనుచరులు, బ్రహ్మపుర సైనికుల కనుగప్పి, ఒక కొండ సొరంగం నుంచి ప్రవహిస్తున్న నదీ జలం ద్వారా, ఒక జలపాతంలోకి దూకి, సురక్షితంగా నది అవలి తీరానికి ఈదసాగారు. కాని, వాళ్లు నదీ తీరాన్ని చేరుతూనే, దాని ఒడ్డున కొందరు ఆటవికుల్ని చూశారు. తరవాత—]

నది ఒడ్డున నిలబడి తమ కేసే చూస్తున్న ఆటవికుల్ని చూస్తూనే, కోయయువకులు కీచుమన్నారు. ఆ ఆటవికులు తమ జాతి వాళ్ళు కాదు. వాళ్ళకూ తమకూ జాతి వైరం వున్నది. తాము వాళ్ళ కంటబడటం అంటే పోరు తప్పదు. జలపాతంలో నుంచి నదిలోకి పడినప్పుడు, తమ ఆయుధాలన్నీ—ఒక కత్తి తప్ప—నీటిపాలైనవి.

"జ్యేష్ఠా, కనిష్ఠా! మీ ఆయుధాలన్నీ సురక్షితంగా వున్నవా? ఈ ఆటవికులు శత్రువులో, మిత్రులో తెలియటం లేదు. వాళ్ళు మొత్తం ఐదుగురికన్న ఎక్కువ లేరు. పోరు తప్పకపోతే, మన ఆయుధాలే మనకు రక్షణ!" అన్నాడు కేశవుడి ముసలితండ్రి.

కేశవుడూ, జయమల్లూ కూడా తమ నడుముకు వేలాడుతున్న కత్తులు తప్ప, సర్వం పోగొట్టుకున్నారు. ఒడ్డున నిలబడి తమ కేసి చూస్తున్న ఆటవికుల దగ్గిర బాణా లున్నట్టులేవు. అలాంటి పరిస్థితిలో తమను వాళ్ళు దూరాన్నుంచి ఏమీ చెయ్యలేరు.







జయమల్లూ, కేశవుడూ యిలా .అలోచిస్తూ కాళ్ళకు నేల తగలగానే, ఈతమాని, ఒడ్డు కేసి నడవసాగారు. అంతలో ఆటవికుల్లో ఒకడు వెనుదిరిగి పెద్దగా కేక వేశాడు. ఆ వెంటనే ఒక పెద్దరాతి చాటు నుంచి పులిచర్మం తలకు కట్టుకునివున్న, ఒక స్థూలకాయుడు అక్కడికి వచ్చాడు. అతడి దృష్టి నీటిలో నుంచి ఒడ్డుకు వస్తున్న కేశవుడూ వాళ్ళ మీద పడింది. వెంటనే అతడు అదిరిపడుతూ, "అయిదుగురు జమాఖట్టీల్లాంటి వెధవలు! వీళ్ళందర్నీ పట్టుకోవటం మన వల్ల ఎలా అవుతుంది? వాళ్ళను కూడా కేకవేయండి!" అన్నాడు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఈ దుర్మార్గుల పని మీరు చూడండి. ఈలోపల వీళ్ళకు సహాయం వచ్చే ఆ నీచుల్ని మేం పరలోకయాత్రకు పంపుతాం," అంటూ ముసలివాడు ఒడ్డు మీదికి ఎగిరి చెట్ల కేసి పరిగెత్తాడు. అతడికి వెనకగా కోయయువకులు కూడా పరిగెత్తారు. కేశవుడూ, జయమల్లూ ఒడ్డుకు చేరి కత్తులు దూసే లోపలే ఆటవికులు అయిదుగురూ వాళ్ళ మీదికి ఉరికారు. స్థూలకాయుడు అటూ యిటూ గెంతుతూ, రొప్పుతూ, "మంచి గిత్తల్లాంటి కుర్రాళ్ళు. కాళ్ళూ చెయ్యీ విరిచారో, మీ ప్రాణాలు తీస్తాను. ఒక్క గాయం కాకూడదు, ఒక్క దెబ్బ తగలకూడదు. జాగ్రత్తగా పట్టుకోండి," అని అరవసాగాడు.

ఆటవికులు అయిదుగురూ సుడిగాలిలా వచ్చి మీదపడటంతో, కేశవుడికీ, జయమల్లుక్కూడా ఆత్మరక్షణకు తమ కత్తులు ఉపయోగించే అవకాశం లేకుండాపోయింది. వాళ్ళు ఆటవికుల్ని ఎదుర్కొని పిడికిళ్ళతో పొడుస్తూ, కాళ్ళతో వాళ్ళ డొక్కల్లో బలంగా తన్నసాగారు. ఆటవికులు మాత్రం వాళ్ళను తిరిగి బలంగా కొట్టకుండా, కాళ్ళు పట్టుకుని కింద పడవేసేందుకు ప్రయత్నించారు. కొద్ది నిమిషాల్లో వాళ్ళ ప్రయత్నం ఫలిం



చింది. కేశవుణ్ణీ, జయమల్లునూ ఇద్దరేసి కాళ్ళు పట్టుకుని కిందకు పడదోసి, తాళ్ళతో వాళ్ళ చేతుల్ని బిగించి కట్టారు.

ముసలివాడూ, కోయయువకులూ పరిగత్తిన చెట్ల ప్రాంతాన్నుంచి పెద్దగా అరుపులూ, పెడబొబ్బలూ వినిపించసాగినై. "అవసరం అయితే చంపండి. కాని, ప్రాణాలతో పారిపోనీకండి!" అంటూ ఒక కంఠం భీకరంగా గర్జిస్తున్నది. తన తండ్రి, కోయయువకులూ ప్రమాదంలో చిక్కుకున్నారని కేశవుడు గ్రహించాడు. కాని, తను యిప్పుడు నిస్సహాయుడు......

అటవికుల నాయకుడైన స్థూలకాయుడు చేతులు కట్టబడివున్న కేశవుణ్ణీ, జయమల్లునూ పరీక్షగా చూస్తూ, "దుక్కల్లాంటి కుర్రాళ్ళు! నా నౌకర్లు అయిదుగురినీ వట్టి చేతులతోనే చావ చితకకొట్టారు!" అంటూ నవ్వసాగాడు.

"మా కత్తులు మా కిచ్చి, నీ నౌకర్లూ నువ్వూ కూడా రండి, పోరాడదాం!" అంటూ కేశవుడు పులిలాగా గర్జించాడు.

స్థూలకాయుడు ఆ మాటలకు నవ్వుతూ, "కత్తులూ, బాణాలూ ఉపయోగిస్తే ఎవరో ఒకళ్ళు చావక తప్పదు. చాలా ధన నష్టం!" అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళ కాకీఖంలోనే రాము ఎలాంటి దుర్మార్గుల చేత బంది చేయబడ్డారో అర్థమైంది. వీళ్ళు మనుషుల్ని పట్టుకుని బానిసలుగా అమ్మే నరరూప రాక్షసులు! అందుకే తమను ఏ మాత్రం గాయపరచకుండా జాగ్రత్తగా పట్టుకున్నారు.

"మా అయ్య ఏమయినట్టు? అక్కడ అంతా నిశ్శబ్దంగా వున్నదే!" అన్నాడు కేశవుడు ఆదుర్దాగా.

జయమల్లు నిస్పృహగా తలాడిస్తూ, "మీ అయ్యా, ఆ కోయయువకులూ కూడా







మనలాగే ఈ దుర్మార్గులకి దొరికిపోయి వుంటారు," అన్నాడు.

చెట్ల ప్రాంతం నుంచి హఠాత్తుగా పెద్ద చావుకేక వినిపించింది. అందరూ అటుకేసి తలలు తిప్పారు. చూస్తూండగానే నలుగురు ఆటవికులు తమ అనుచరు లిద్దరిని తలా, కాళ్ళూ పట్టుకుని మోసుకుంటూ అక్కడికి వచ్చారు. స్థూలకాయుడు వాళ్ళను చూస్తూనే పళ్ళుకొరికి, "రెండు చావులా? వీళ్ళ తోటి వాళ్ళు, ఆ ముగ్గురూ ఏమయ్యారు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా, వాళ్ళని గాయపరచకుండా పట్టుకుందామని ప్రయత్నిస్తే, ఆ దుర్మార్గులు తమ దగ్గరవున్న కత్తులతో, ఈ ఇద్దర్నీ నరికారు, మరిద్దర్ని గాయపరిచారు. వాళ్ళు నది ఒడ్డునే పడి పారిపోతూంటే, మన వాళ్ళు తరుముతూ పరిగెత్తారు," అని చెప్పాడు ఆటవికుల్లో ఒకడు.

స్థూలకాయుడు పట్టరాని కోపంతో గున్న ఏనుగులా నిలువెల్లా వణుకుతూ, "మన వాళ్ళు నలుగురు చస్తే, ఇద్దర్ని పట్టుకున్నా మన్న మాట! అంటే రెండు జీవాలు నష్టం! ఇలా అయితే వ్యాపారం సాగినట్టే, ఛీ, కుంకల్లారా!" అంటూ గంతులేశాడు.

అతడి అనుచరులు కాసేపు తలలు వంచుకు వూరుకుని, తరవాత మెల్లిగా, "అయ్యా, ఆ గాయపడ్డ యిద్దర్ని కూడా మోసుకుపోవాలిగదా, వీళ్ళను కాస్త తోడు రమ్మనమనండి," అంటూ కేశవుణ్ణీ, జయమల్లునూ పట్టుకున్న వాళ్ళకేసి చూశారు.

ఈ మాటల్తో స్థూలకాయుడు గూటాంలా ఎగిరిపడి, నిప్పులు చెరిగే కళ్ళతో, తన నౌకర్ల కేసి చూస్తూ, "మీరు చేసిన వెధవ పనికి, మరికొందరు తోడుకూడా కావాలా? ఆ గాయపడ్డ పిరికికుంకలు, గుర్రాల దగ్గిరికి నడిచిరాలేరా?" అని కేకలు పెట్టాడు.

"వాళ్ళు బాగా గాయపడ్డారు. ఒకడికి గొంతులో కత్తి దెబ్బ తగిలింది, రెండో







వాడికి డొక్కల్లో కత్తిపోటు పడింది. ఇప్పుడో యింకా సేపటికో అంటున్నారు..."

నౌకరు మాట పూర్తిచేయక ముందే స్థూలకాయుడు కీచుగొంతుతో పెద్దగా అరిచి, "చచ్చినవాళ్ళనూ, చావు బతుకుల్లో వున్నవాళ్ళనూ పోషించటానికా నేను వ్యాపారం చేస్తున్నది? ఈ శవాలనూ, ఆ గాయపడ్డ వాళ్ళిద్దర్నీ నదిలోకి విసిరేసి, వేగిరం రండి. ఈ నెత్తురు వాసనకు యిక్కడికి సింహాల మంద వచ్చినా రావొచ్చు," అన్నాడు.

"ఛీ, నువ్వు మనిషివి కాదు, రాక్షసుడివి! ప్రాణాలతో వున్నవాళ్ళను, నీటిలోకి తోయించుతావా?" అంటూ కేశవుడు బిగ్గరగా కేకపెట్టి, తన చేతి కట్లను తెంచుకునేందుకు ప్రయత్నించాడు.

కేశవుడి ఛీత్కారం వింటూనే స్థూలకాయుడు చిరునవ్వు నవ్వి, "కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతూండేవాడు, నేల మీద చస్తేనేం, నీటిలో చస్తేనేం? పైగా నెత్తురు చూశానే, నా హృదయం తల్లడిల్లిపోతుంది. నాది చాలా మెత్తని మనసు. మీకు ఒక్క దెబ్బ తగలకుండా, చిన్నగాయం కాకుండా ఎంత జాగ్రత్తగా పట్టుకున్నానో చూశారు గదా?" అన్నాడు.

ఆ నరరూపరాక్షసుడి మాటలకు ఏమని జవాబు చెప్పాలో కేశవుడికీ, జయమల్లుకూ అంతుపట్టలేదు. తమ కేనాడైనా అవకాశం దొరికితే, వాణ్ణి నిలువునా చంపాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. స్థూలకాయుడు తన నౌకర్లను హెచ్చరించి బయలుదేరాడు. ఒక గంటకాలం అడవిలో నడిచిన తరవాత అందరూ, పెద్దపెద్ద గుడారాలున్న ఒక చోటుకు చేరారు.

"వీళ్ళిద్దర్నీ దుంగకు బిగించండి. ఆ తరవాత మీలో యిద్దరు బయలుదేరి వెళ్ళి, ఆ పారిపోయిన ముగ్గురూ ఏమయారో, వాళ్ళ వెంటబడ్డ వాళ్ళేమయారో







తెలుసుకురండి," అన్నాడు స్థూలకాయుడు.

కేశవుణ్ణీ, జయమల్లునూ నౌకర్లు ఒక పొడవాటి దుంగకువున్న కంతల్లో కాళ్ళు పెట్టించి, దానికి అటూ యిటూవున్న రంధ్రాల్లో కొయ్యమేకులు దిగకొట్టారు. వాళ్ళిద్దరి కంఠాలకూ ఇనప పట్టెడలు బిగించి, వాటిని కలుపుతూ ఒక గొలుసు కట్టారు. వాళ్ళిద్దరి పక్కనా మరికొందరు యిలాంటివాళ్ళే వున్నారు.

"మనం ఎంత చిక్కులో పడ్డాం! మన బతుకు పశువుల కంటె హీనం అయిపోయిందే, కేశవా!" అన్నాడు జయమల్లు ఎక్కడలేని దిగులుతో.

"అధైర్యపడకు మల్లూ! మనం పారిపోయేందుకు అవకాశం చిక్కకపోదు. నా అదుర్దా అల్లా, మా అయ్య ఏమయాడనేదే!" అన్నాడు కేశవుడు.

ఆ పగలంతా గడిచి చీకటిపడే లోపల స్థూలకాయుడు; కేశవుడూ, జయమల్లూ వున్నచోటుకు నాలుగైదుసార్లు వచ్చాడు. వాళ్ళ యోగక్షేమాలను గురించి కన్న తండ్రి కన్న ఎక్కువగా విచారించాడు. తన నౌకర్ల చేత మంచి ఆహారం పెట్టించాడు.

"వీళిద్దర్నీ మన కన్నబిడ్డల్లాగా చూసుకోవాలి. వీళ్ళు ఆరుగురు మనుషులపెట్టు. ఆ చచ్చిన నలుగురి ధరా, వీళ్ళధరా... ఎంతలేదన్నా నూరు బంగారుకాసులు ముట్టితే తప్ప నాక్కలిగిన నష్టం పూడదు. ఇంతకీ, ఆ పారిపోయిన ముగ్గురు దుర్మార్గులూ, వాళ్ళ వెంటబడిన చవటలూ, వాళ్ళందర్నీ వెతకపోయిన ఇద్దరు కుంతలూ ఏమయినట్టు?" అంటూ స్థూలకాయుడు తన నౌకర్ల మీద విరుచుకుపడ్డాడు.

చీకటిపడిన కొద్ది సేపటికి ఏడుపులూ, మూలుగులతో స్థూలకాయుడి నౌకర్లు పదిమంది గుడారాల దగ్గిరకు వచ్చారు. వాళ్ళు చావు బతుకులమీదవున్న తమ అనుచరు లిద్దర్నీ మోసుకు వచ్చారు.





వాళ్ళు రావటం చూస్తూనే స్థూలకాయుడు పెద్ద కొరడా ఒకటి తీసుకుని, రొప్పుతూ, కేకలుపెడుతూ వాళ్ళను సమీపించి, "ఆ ముగ్గురెక్కడ? ఈ యిద్దరూ ఎందుగ్గాయపడ్డారు? వెళ్ళిన వాళ్ళంతా తిరిగి వచ్చినట్టులేదే!" అంటూ కొరడాతో వాళ్ళను బాదాడు.

ఆ దెబ్బలకు నౌకర్లు లబోదిబోమని, "అయ్యా, ఆ ముగ్గురూ మాలో మరొకణ్ణి చంపి, అరణ్యంలోకి పారిపోయారు. ముఖ్యంగా ఆ ముసలివాడు మనిషికాడు, మనిషిరూపం ఎత్తిన రాక్షసుడు. వాడి కత్తిసామూ...వాడి ధాటీ..." అంటూ పెద్దగా బావురుమన్నారు.

"మీ చచ్చు వెధవలంతా చేరి నన్ను ముంచారు! రెండు జమా, ఆరు ఖర్చు. ఇలా అయితే ఇక వ్యాపారం సాగినట్టే. ఇప్పుడా యిద్దరికీ నూటపాతిక బంగారు కాసులొస్తే తప్ప, అసలు గిట్టుబాటు కాదు," అంటూ స్థూలకాయుడు కొరడా గాలిలో తిప్పుతూ కుప్పిగంతులు వేయసాగాడు.

ఆ రాత్రి కేశవుడికీ, జయమల్లుకూ నిద్ర పట్టలేదు. కొయ్యదుంగలో బిగించి వున్న కాళ్ళు రెండూ చచ్చు పడిపోయినట్టుగా వున్నవి. చుట్టూవున్న అడవిలో పులుల గాండ్రింపూ, సింహగర్జనలూ వాళ్ళకు హడలు పుట్టించినై. తను బానిస వ్యాపారి చేతిలో చిక్కిపోయాననే దిగులులో కూడా, కేశవుడికి తన తండ్రి అరణ్యంలో ఎక్కడో సురక్షితంగా వున్నాడనే సంగతి ఆనందం కలిగించింది.

తెల్లవారుతూనే స్థూలకాయుడు ఇద్దరు వ్యక్తుల్ని వెంటపెట్టుకుని కేశవుడూ, జయమల్లూ వున్నచోటుకు వచ్చాడు. అతడి వెంటవున్న వ్యక్తు లిద్దరూ మంచి పట్టు వస్త్రాలు ధరించి, చెవులకు పెద్దపెద్ద పోగులతో, జరీకండువాలతో, గొప్ప వర్తకుల్లా వున్నారు. —(ఇంకా వుంది)



# రాక్షసి లోయ

## 17

[కేశవుడూ, అతని అనుచరులూ నది అవలి తీరం చేరగానే, బానిస వ్యాపారం చేసే ఒక స్థూలకాయుని నౌకర్ల చేత ఎదుర్కోబడ్డారు. కేశవుడూ, జయమల్లూ వాళ్ళకు దొరికి పోయారు. ముసలివాడూ, నొయుయువకుల జాడలేదు. మరునాటి రోజున బానిసలను కొనేందుకు నల్గురు వర్తకులు స్థూలకాయుని గుడారాల దగ్గిరకు వచ్చారు. తరవాత—]

స్థూలకాయుడు వర్తకులకు కేశవుణ్ణి, జయమల్లునూ చూపుతూ, "చూశారా, కాడిపోతుల్లా ఎలా వున్నారో! నది కవతల వున్న జలపాతం మీది నుంచి, ఫెడేల్ మని నదిలోకి ఒక్క దూకు దూకి, ఫటేల్ ఫటేల్ మంటూ కొరమీనుల్లా, ఈ దరికి కను మూసి తెరిచేంతలో ఈదుకొచ్చారు. వీళ్ళను, ఎక్కడా ఒళ్ళు కంద కుండా, దెబ్బ తగల కుండా పట్టుకునే ప్రయత్నంలో, నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు. అహా! ఏం బలం! ఒక్క పిడికిటి పోటుతో ఒక్కొక్కణ్ణి చంపేశారు......"

స్థూలకాయుడు ఇలా మాట్లాడుకు పోతూంటే, వర్తకుల్లో ఒకడు, "చాలయ్యా, ఆగు! ఇంతకీ ఒక్కొక్కడికీ ఏ పది బంగారు కాసులో ఇవ్వమనవు గదా?" అన్నాడు.

"పది బంగారు కాసులా! మీరు నన్ను ముంచాలనుకుంటున్నారా? గడిచిన



ఇరవయ్నాలుగ్గంటల నుంచి వీళ్ళను నా బిడ్డల్లా సాకుతున్నాను. వీళ్ళకు ఇంత వరకూ పెట్టిన తిండే ముప్ఫై బంగారుకాసుల పైన చేస్తుంది. వాళ్ళదేం తిండి, ఏం బలం! ఒక పలుగు చేతికిచ్చి చూడండి, కొండల్ని నిలువునా పిండిచేసి మరీ చూపెడతారు!" అన్నాడు స్థూలకాయుడు.

వర్తకుల్లో ఒకడు చిరునవ్వు నవ్వుతూ కేశవుణ్ణి సమీపించి, తన చేతికర్రతో అతడి భుజం మీద ఒక్కపోటు పొడిచాడు. కేశవుడికి బాధా, ఎక్కడలేని కోపమూ కలిగింది. కాని, అతడు నిబ్బరంగా ఊరుకున్నాడు. వర్తకుడు పెద్దగా నవ్వుతూ, స్థూలకాయుడి



కేసి తిరిగి, "వీళ్ళను గురించి నువ్వు చెప్పిందాంట్లో కొంత నిజం వున్నట్టుంది. ఆ దెబ్బకు మరొకడైతే ఏడవవలసిందే!" అన్నాడు.

ఈ మాటలకు స్థూలకాయుడు పరమానందం చెందిపోయి, "ఆహా, నే చెప్పలా? ఒక్కొక్కడూ ఒక్క ఏనుగు గున్నను కొండి!" అన్నాడు.

"అంత కర్ర పోటుకూ కుయిఁ కయిఁ మనలేదు. ఒకవేళ వాడు మూగి వెధవ కాదుగదా?" అంటూ రెండో వర్తకుడు, కేశవుడికి దగ్గిరిగా వెళ్ళి, "ఏరా, నీకు మాట్లాడటం చాతవా? నీ పేరేమిటి?" అని అడిగాడు.

కేశవుడు పొంగి వస్తున్న కోపాన్ని అణుచుకుంటూ, "కనిష్టుడు! మనుషుల్ని పశువుల్లా క్రయవిక్రయాలు చేసే మీకు పేర్లతో పనేమిటి?" అన్నాడు.

"ఆహాఁ చూశారా, ఎంత తెలివైన జవాబిచ్చాడో? శాస్త్రపురాణాల్లోకి ఎక్కాలిసిన మాట!" అన్నాడు స్థూలకాయుడు పొంగిపోతూ.

"అఘోరించావు! ఎన్ని నీతివాక్యాలూ, ధర్మపన్నాలూ అయితే ఒక బంగారు కాసు చేసేట్టు! సరే, ధర తేల్చు. ఇద్దరికి










కలిపి ముప్పై కాసులిచ్చుకుంటాం, సరా?" అన్నాడు వర్తకుడు.

"ఇద్దరికీ కలిపి ముప్పై కాసులు! నన్ను నాశనం చేస్తే మీకేం ఒరుగుతుంది? నేను మునిగి పోతే మీక్కలిగే లాభం ఏమిటి? దేవుడు సాక్షిగా చెపుతున్నాను. వీళ్ళిద్దర్ని పట్టుకునే ప్రయత్నంలో నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు," అంటూ స్థూలకాయుడు నెత్తీ నోరూ కొట్టుకోసాగాడు.

వర్తకులిద్దరూ కొంచెం దూరంగా వెళ్ళి, కొద్దిసేపు సంప్రతించుకుని తిరిగి బానిస వ్యాపారి దగ్గిరకు వస్తూ, "ఆఖరి మాటగా నలభై కాసు లిస్తాం. ఇష్టమైతే అమ్ము లేకపోతే లేదు. మా కవతల చాలా పను లున్నై. ఇంకా ఇరవై మంది బానిసలను కొని, ఆ కొండవాగు పక్కన వుంచి వచ్చాం. త్వరగా ప్రయాణమై పోవాలి," అన్నారు.

"ఇలా వ్యాపారం జరిగితే యిక నేను మట్టి కొట్టుకు పోవలసిందే. దీనికన్న గుడారా లెత్తివేసి, ఏ గుహలోనో ముక్కు మూసుకు కూచుని తపస్సు చేసుకోవటం లాభసాటిగా వుంటుంది," అంటూ స్థూల కాయుడు అటూ యిటూ గెంతసాగాడు.

బానిసల బేరం యీ విధంగా గంట సేపు సాగి, ఆఖరుకు అరవై బంగారు కాసులకు తెల్చి వేయబడింది. స్థూలకాయుడు వర్తకుల దగ్గిర్నుంచి అరవై కాసులూ తీసుకుని, వాటిని రొండికి బిగించి వున్న పట్టా సంచిలో దాస్తూ, "మళ్ళీ ఎప్పుడు, మీ దర్శనం? ఒక్క నెల రోజు లాగి వచ్చారంటే, మేలిమి బంగారంలాంటి సరుకు ఒప్పచెపుతాను," అన్నాడు.

"రాకేం, వస్తాం. మన లావాదేవీలు దీన్తోనే అయిపోయిన వసుకుంటున్నావా? కాని, నీ నుంచి ఒక్క సహాయం కావాలి," అన్నారు వర్తకులు.

"ఏమిటా సహాయం?" అంటూ స్థూల కాయుడు, అనుమానంగా చూశాడు.











"మరేం లేదు. ఈ మధ్య కొంత కాలంగా మన కపిల రాజ్యమంతా అరాజకంగా వున్నదని నీకు తెలియంది కాదు. కత్తి చేత బట్టగల వాడల్లా, దారి దోపిడి గాదుగా తయారయాడు. మా దగ్గిర చూడబోతే, చాలా విలువైన సరుకుంది—ముప్పై యిద్దరు బానిసలు. రెండు మజిలీల ప్రయాణంలోగాని మేం కపిలపురం చేరలేం. ఈ రాత్రి అడవిలో మజిలీకి నువ్వు కాస్త తోడు రావాలి," అన్నారు వర్తకులు.

స్థూలకాయుడు మంత్రగబ్బ కాటు తిన్నవాడిలా ఎగిరి పడి, "ఒక్క గంట కాలం నా గుడారాలను నౌకర్లను ఒప్పచెప్పి ఎక్కడికైనా వెళ్ళానా, నా వ్యాపారం గుల్లామే. అందరూ దొంగ వెధవలు. నేను చాలా నష్టపడి పోతాను," అన్నాడు.

వర్తకులు చిరునవ్వు నవ్వుకుని, "ఈ రాత్రి మా వెంట వున్నందుకు, నాలుగు బంగారు కాసు లిచ్చుకుంటాం, సరా?" అన్నారు.

"నాలుగు బంగారు కాసుల్తో నా నష్టం పూడుతుందా? పది...ఎనిమిది...సరే, ఆరు యివ్వండి. యిక బయలుదేరుదాం," అంటూ స్థూలకాయుడు నౌకర్లకు హెచ్చరిస్తూ నేకపుడూ, బయిమల్లుల కేసి వెళ్ళాడు.

నేకపుడూ, బయిమల్లులను వెంట బెట్టుకుని, వర్తకు లిద్దరూ, స్థూలకాయుడూ అరణ్యమార్గాన నడిచి, ఓ గంట తరవాత ఒక కొండవాగు దరికి చేరారు. అక్కడ ముప్పై మంది బానిసలు, నౌకర్ల కాపలాలో గంధపు చెక్క నరుకుతున్నారు. వాళ్ళను చూస్తూనే స్థూలకాయుడు పెద్దగా నవ్వి, "బానిసలను కొనటానికైన ఖర్చు, వాళ్ళు వెనకకొచ్చే మంచి గంధంచెక్క అమ్మితే వస్తుంది. ఇక, వాళ్ళ నమ్మగా వచ్చిన డబ్బంతా లాభమే. అహా, ఎంత తెలివైన వాళ్ళయ్యా, మీరు!" అన్నాడు.

వర్తకులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, తమ నౌకర్లకు ప్రయాణం కావల





ందని హెచ్చరికలు చేశారు. చూస్తూండగానే నౌకర్లు, బానిసల చేత నరికిన గంధం చెక్క అంతా కట్టలు కట్టించి, వాళ్ళను ఒక సాలుపుగా నడుపుతూ, దానికి అటూ యిటూ కొరడాలు ఝుళిపిస్తూ బయలు దేరారు. అందరికన్నా ముందు స్థూల కాయుడు నడవసాగాడు.

మహా వృక్షాలతో, చిన్నా పెద్ద జలపాతాలతో, చువి నేలలతో మహా భయంకరంగా వున్న అరణ్యంలో పడి అందరూ సూర్యాస్తమయం వరకూ నడిచారు. వారికి దారి పొడుగునా సింహ గర్జనలూ, ఏనుగుల ఘీంకారాలూ వినిపించ సాగినై. అలాంటి సమయాల్లో స్థూలకాయుడు అదిరిపడుతూ, "ఐదు కాసుల కోసం, నేనేం ప్రాణగండం తెచ్చుకోలేదు గదా," అనుకోసాగాడు.

సూర్యాస్తమయమైన కొద్ది సేపటికల్లా అరణ్యాన్ని గాఢాంధకారం ఆలముకొన్నది. బానిస లందర్నీ సమతలంగా వున్న ఒక చోట మందవేసి, అడవి మృగాలు మీద పడకుండా వుండేందుకు రక్షణగా, వాళ్ళ చేత చుట్టూ ముళ్ళ పొదలు ఎత్తుగా వేయించారు. ఆ రక్షణల మధ్య రెండూ మూడు చోట్ల పెద్ద నెగళ్ళు వెలిగించారు. ఆ తరవాత అందరికీ ఎండు రొట్టెలూ, కాల్చిన మాంసమూ ఆహారంగా పెట్టారు.







రాత్రి గడుస్తున్నకొద్దీ ముళ్ళ పొదల ఆవలి నుంచి సింహాలు చేసే గర్జన అధికం కాసాగింది. కేశవుడూ, జయమల్లూ పక్క పక్కల పడుకుని తమ భవిష్యత్తును గురించి మథన పడసాగారు. కేశవుడికి తన తండ్రి ఏమయిపోయాడన్న దిగులు అధికం కాసాగింది.

"మల్లూ, మా అయ్య క్షేమంగా వుండి వుంటాడంటావా?" అని అడిగాడు కేశవుడు.

"అతడి కొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. ఈ అరణ్యంలోనే ఎక్కడో కోయ యువకు లిద్దరితో దాక్కుని వుంటాడని నా నమ్మకం," అన్నాడు జయమల్లు.

కేశవుడికి జయమల్లు మాటల్లో విశ్వాసం కలగలేదు. అతడు మరేదో ప్రశ్నించ బోయేంతలో హఠాత్తుగా సింహ గర్జనలు ఆగిపోయినై. కేశవుడు ఉలిక్కిపడి లేచి కూచుంటూ, "మల్లూ, అంతా నిశ్శబ్దం అయింది. ఏదో ప్రమాదం..." అనేంతలో, భీకరంగా గర్జిస్తూ ఒక సింహం ముళ్ల పొదల మీది నుంచి కుప్పించి లోపలికి దూకింది. నిద్రపోతున్న బానిసలంతా ఒక్క సారి లేచి, హాహాకారాలు చేశారు. స్థూల కాయుడూ, వర్తకు లిద్దరూ కీచుమనే గొంతులతో, "బాణాలు...కత్తులు... ఈటెలు...చంపండి, సింహాన్ని చంపండి!" అని తమ నౌకర్లను హెచ్చరిస్తూ ఒక పక్కకు పారిపోయారు.

నౌకర్లు సింహం మీదికి రివ్వురివ్వు మంటూ బాణాలు వదిలారు. కాని, ఒక్కటీ దాన్ని తాకలేదు. ఈ లోపల సింహం గొలుసులతో బంధించబడి వున్న బానిసల గుంపు మీద పడి, ఇద్దరు ముగ్గుర్ని తన పంజా దెబ్బలతో గాయపరిచింది.

కేశవుడూ, జయమల్లూ ఒకే ఒట్టుగా నెగళ్ళ దగ్గిరకు పరిగెత్తి, మండుతున్న రెండు కట్టెపుల్లలను తీసుకుని, "బాణాలు వేసి సింహాన్ని మరింతగా రెచ్చకొట్టకండి.







"దాన్ని మేం బయటికి తరిమేస్తాం!" అంటూ సింహం వేపు పరిగెత్తారు.

మండుతున్న కర్రపుల్లలను చూస్తూనే, సింహం ఓ త్రుటికాలం తటపటాయించింది. అంతలోనే పెద్దగా కోరలు చాచి, ముందున్న కేశవుడి మీదికి లంఘించింది. కేశవుడు దాని పంజా దెబ్బను తప్పుకుంటూ, తన చేతులో ఉన్న మండే కర్రను దాని మీదికి విసిరాడు. మంట తన శరీరాన్ని తాకగానే సింహం ఒక్కసారి పెద్దగా గర్జించి వెనక్కు తిరిగింది. అదే సమయంలో జయమల్లు తన చేతులో ఉన్న కర్రను దాని వెన్నుకు తగిలేలా కొట్టాడు.

సింహం మెరుపులా ముళ్ళపొదల మీంచి లంఘించి అరణ్యంలోకి పారిపోయింది. స్థూలకాయుడూ, వర్తకు లిద్దరూ కేశవుడూ జయమల్లుల దగ్గిరకు వచ్చారు. స్థూలకాయుడు నిలువెల్లా వణికి పోతున్నాడు. వర్తకుల మాట చెప్పనవసరమే లేదు.

"మీ యిద్దరూ, మమ్మల్ని ఎంతో ధన నష్టాన్నుంచి కాపాడారు. ఇద్దరు బానిసలు చచ్చారు, ఒకడు గాయపడ్డాడు. అదేమంత పెద్ద నష్టం కాదు. మీరు చూపిన ధైర్యానికి, చేసిన సహాయానికీ, ఈ నాటి నుంచి మీకు తిన్నంత ఆహారం పెట్టదలిచాం." అన్నాడు ఒక వర్తకుడు.

"ఓ అలాగే చేద్దాం. కపిల నగరంలో వీళ్ళిద్దరినీ అమ్మేటప్పుడు, ఈ జరిగిన సంగతి గుర్తుంచుకుని, కొంచెం మంచి ధర రాబట్టాలి. ఒక వేళ నేను మరిచిపోతే, నువ్వు కాస్త గుర్తు చెయ్యి," అన్నాడు రెండో వర్తకుడు, తన తోటివాడితో.

"అందరూ కలిసి నన్ను ముంచారు! వీళ్ళింత అసహాయ శూరులని తెలిస్తే, అరవై కాసులకు అమ్మేవాడినా? నేను గుల్లయి పోయాను...దివాళా ఎత్తిపోయాను..." అంటూ స్థూలకాయుడు కుప్పిగంతులు వేయసాగాడు. —(ఇంకా ఉంది)






## 18

[కపిల నగరాన్నుంచి వచ్చిన ఇద్దరు వర్తకులకు, స్థూలకాయుడు; కేశవుణ్ణీ, జయమల్లునూ అమ్మేశాడు. రాత్రివేళ అడవిలో నిద్రిస్తున్న వాళ్ళ మీద ఒక సింహం వచ్చి పడింది. కేశవుడూ, జయమల్లూ దాన్ని కాగడాలతో భయపెట్టి తరిమేశారు. వర్తకులు సంతోషించారు. స్థూలకాయుడు తను నష్టపోయానని అరవసాగాడు. —తరవాత]

బానిసవర్తకు లిద్దరూ, స్థూలకాయుణ్ణి సముదాయిస్తూ, "అట్టే గొడవపెట్టకు. కావాలంటే, ఈసారి జరిగే కొనుగోలులో నీకు మరింత లాభం కలిగేలాగా చూస్తాం. నీవు చేసే రణగొణ ధ్వనికి, ఏ సింహాల మందో వచ్చిపడితే, అందరం పరలోకయాత్ర చేయవలసివస్తుంది," అన్నారు.

సింహాల పేరు వింటూనే స్థూలకాయుడు గతుక్కుమని, కాళ్ళు చచ్చుపడిన వాడిలా నిలుచున్నచోటే కూలబడిపోయాడు. ఇక ఆ రాత్రికి ఎవరూ నిద్రపోలేదు. అందరినీ ప్రాణభయం పట్టుకున్నది.

రాత్రి గడిచి సూర్యోదయం అవుతూనే వర్తకులు ప్రయాణసన్నాహాలు ప్రారంభించారు. స్థూలకాయుడికి యిస్తామన్న ఐదు బంగారు కాసులూ యిచ్చి, "ఇక నీ దారి నీది. కాస్త జాగ్రత్తగా వెళ్ళు," అన్నారు.

స్థూలకాయుడు అడవినంతా ఓసారి కలయచూస్తూనే బిక్క చచ్చిపోయాడు. అతడికి రాత్రి మీద పడిన సింహాన్ని గురిం







చిన భయం యింకా వదలలేదు.' తను ఒంటరిగా తన గుడారాల దగ్గిరకు ప్రయాణమై పోయేప్పుడు, అది ఏ చెట్టుచాటు నుంచో ఎగిరి మీదపడితే తనేంకాను?

ఈలోపల వర్తకులు తమ నౌకర్లను హెచ్చరించి బయలుదేరారు. రేకప్పన్నీ, బయమల్లునూ తతిమ్మా బానిసల నుంచి వేరుచేసి, వాళ్ళను తమ వెనకగా రావలసిందని ఆజ్ఞాపించారు. అటువంటి ధైర్యవంతు లిద్దరు తమ వీపు కాచి వుండటం క్షేమం అన్న నమ్మకం వాళ్ళకు కలిగింది.

"మీ రిద్దరూ మామూలు బానిసల వంటి వాళ్ళు కాదు; బానిసల్లో రాజకుమారుల్లాంటి వాళ్ళు! కపిలనగరంలో మిమ్మల్ని అందరికన్న సంపన్నులైన గృహస్థులు కొనేలా చూస్తాం," అన్నారు వర్తకులు.

వాళ్ళావిధంగా ఒక వంద గజాలు నడిచారో లేదో, వెనక నుంచి స్థూలకాయుడు పెద్దగా కేకలుపెడుతూ పరిగెత్తి రావటం కనిపించింది. వర్తకు లిద్దరూ ఆశ్చర్యపడుతూ వెనుదిరిగి చూశారు. స్థూలకాయుడు రొప్పుతూ రొస్తూ వాళ్ళను సమీపించి, "నా కిప్పుడే గుర్తు కొచ్చింది. కపిలపురంలో నా సొంత పని ఒకటి చూసుకోవాలి. నేనూ మీతోపాటు వస్తాను," అన్నాడు. వర్తకులు ముఖముఖాలు చూసుకుని చిరునవ్వు నవ్వుకున్నారు. వాళ్ళల్లో ఒకడు స్థూలకాయుడి కేసి తిరిగి, "ఓం, నువ్వు కావాలంటే మా వెంట రావొచ్చు. కాని, అడవిలో నీకు మేం రక్షణ కల్పించినందుకుగాను, పది బంగారుకాసు లిచ్చుకోవలసి వుంటుంది," అన్నాడు.

స్థూలకాయుడు ఓ క్షణకాలం నిర్విణ్ణుడయిపోయి, అంతలోనే ముఖం మీద లేని నవ్వు తెచ్చిపెట్టుకుని, "మీరేదో తమాషా చేస్తున్నారు. ఈ మహారణ్యంలో నాబోటి బలశాలి, ధైర్యసాహసాలున్నవాడూ, మీ వెంటవుంటే ఎంత వుపయోగం," అంటూ







ఒరలో నుంచి కత్తిదూసి గిరుగిరున తిప్ప సాగారు. వర్తకులకు అతడి మీద చాలా జాలి కలిగింది. వాళ్ళు స్థూలకాయుణ్ణి సమీపించి, భుజం తడుతూ, "నీ ధైర్యం మాకు తెలియందికాదు. కావాలంటే మా వెంట రా, సుంకం ఏమీ యిచ్చుకో నవసరంలేదు. కాని, కపిలపురాన్నుంచి తిరుగుప్రయాణం ఎలా చేస్తావు? నువ్వు లేని సమయంలో నీ నౌకర్లు గుడారాలెత్తి పారిపోతే ఏం చేయ గలవు?" అని అడిగారు.

"వాళ్ళడొక్కలు చీరేస్తాను. నా పేరంటే వాళ్ళకు సింహస్వప్నం. కపిలపురాన్నుంచి తిరిగి రావటం అంటారా? ఛీ, ఎంతమంది అక్కణ్ణుంచి ఈ అరణ్యానికి వస్తూపోతూ వుంటారో నాకు తెలియదా!" అన్నాడు.

ఆ తరవాత అందరూ తిరిగి నడక ప్రారంభించారు. అరణ్యంలో కొంతదూరం వెళ్ళిన తరవాత, బాట ఒకానొక లోయ పక్కకు తిరిగింది. అది చాలా లోతైన లోయ. అందులో ఒక నది ప్రవహిస్తున్నది. లోయ పైభాగాన్నుంచి దాదాపు నది దిగువ వరకూ పెద్దపెద్ద వృక్షాలూ, వాటిమీద అడవి తీగలూ పెనవేసుకుని—ఆ ప్రదేశమంతా చూడటానికి మహాభయంకరంగా కనిపిస్తున్నది.



కేశవుడు, పక్కనేవున్న జయమల్లు కేసి తిరిగి చిన్నగొంతుతో, "మల్లా, మనం ఈ దుర్మార్గుల నుంచి తప్పించుకుపోవాలంటే, ఈ ఎత్తునుంచి నదిలో దూకితే సరిపోతుంది. ఏమంటావ్?" అన్నాడు.

జయమల్లు అగాధం దిగువకేసి ఓసారి చూసి, "మనం చెట్లకొమ్మలకు తగులుకోకుండా సూటిగా నదిలోకి దూకగలిగితే ప్రమాదం వుండదు. అలాకాక......"

జయమల్లు మాట పూర్తిచేసే లోపలే, బానిసల గుంపుకు ముందుండి దారితీస్తున్న వర్తకుల నౌకర్లు, కెవ్వుమని కేకలుపెట్టారు. ఎదురుగావున్న రాళ్ళదాటు నుంచి, చెట్ల







పొదల మాటు నుంచీ పెద్ద పెద్ద కత్తులు పట్టుకున్న నరమాంసభక్షకులు కొందరు, "చండమండూకుడికీ జై!" అంటూ పిశాచాల్లా అట్టహాసం చేస్తూ ముందు కురికారు.

"బాణాలు ... కత్తులు ... ఈటెలు ..." అంటూ కీచుమని బానిసవర్తకు లిద్దరూ వెనక్కు రెండడుగులు వేసి, "జ్యేష్ఠా, కనిష్ఠా! మీరే మమల్ని, ఈ నరభక్షకుల్నుంచి కాపాడాలి. మీకు స్వేచ్ఛ యిచ్చేస్తున్నాం," అంటూ అరిచారు.

కేశవుడూ, జయమల్లూ తృటికాలంలో ఒక నిర్ణయానికి వచ్చారు. నరభక్షకుల వాతపడితే, ఇక స్వేచ్ఛ అనేదే లేదు. ఇలా ఆలోచించి, చప్పున యిద్దరూ బానిసవర్తకుల్ని గట్టిగా వడిసి పట్టుకుని, అగాధం అంచునుంచి దిగువనున్న నదికేసి దూకుతూ, "గురిగా నదిలోకి పడగలిగితే, మీకు స్వేచ్ఛ; ఏ చెట్టుకొమ్మకో తగులుకున్నారో, చావు." అంటూ కేకపెట్టారు.

ఈలోపల నరభక్షకులు, తమను ఎదిరించిన బానిసవర్తకుల నౌకర్లను యిద్దరు ముగ్గుర్ని కత్తులతో నరికి, పడ్డచోటునుంచి బంతిలా పైకెగిరి వెనక్కు తిరిగి పారిపోతున్న స్థూలకాయుణ్ణి వెంబడిస్తూ, "ఆ మాంసం పోగును ప్రాణాలతో పట్టుకోండి, మన నాయకుడికి బహూకరిద్దాం. చల్లపడిన మాంసం ఆయన ముట్టడు," అంటూ కేకలు పెట్టసాగారు.

కేశవుడూ, జయమల్లూ అగాధం దిగువనున్న మహావృక్షాల కొమ్మలకు తాకకుండా అదృష్టవశాత్తూ, సూటిగా నదిలోకి పడిపోయారు. అలా పడేటప్పుడు నీటి తాకిడికి బానిసవర్తకు లిద్దరూ వాళ్ళ పట్టునుంచి జారిపోయారు.

బానిసవర్తకు లిద్దరూ నీటిలో మునుగుతూ తేలుతూ, "రక్షించండి, జ్యేష్ఠా, కనిష్ఠా, రక్షించండి! మీకు స్వేచ్ఛ యిస్తాం," అంటూ అరవసాగారు.








చావు బతుకుల మధ్య కూడా బానిస వర్తకులు తమను యింకా వాళ్ళ ఆస్తిగా భావించి కేకలుపెట్టటం కేశవుడికి ఎక్కడ లేని కోపాన్ని తెప్పించింది. అతడు జయమల్లును హెచ్చరిస్తూ, "వీళ్ళకు నీటి గండం రాసిపెట్టి వున్నది! ఈ నరరూప రాక్షసులను తుదముట్టిద్దాం," అంటూ వాళ్ళ కేసి ఈదబోయాడు. కాని, అంతలో అగాథం పైనుంచి భీకరమైన కేకలూ, ఆ వెంటనే రివ్వుమంటూ కొన్ని ఈటెలూ— నదిలోకి వచ్చిపడినై.

"నరమాంసభక్షకులు, మనను చూశారు. ఇక జాగరణ లాభంలేదు. నీటివాలు వెంట ఈదుకుపోవటమే క్షేమం," అంటూ జయమల్లు పెద్దపెద్ద బారలతో నది దిగువకు ఈదుతూ, కేశవుణ్ణి హెచ్చరించాడు.

నది మహావేగంగా ప్రవహిస్తున్నది. కేశవుడూ, జయమల్లులు పెద్దగా ఈదకుండానే, ఆ వేగానికి కొట్టుకుపోసాగారు.

హఠాత్తుగా వాళ్ళకు నది మధ్య లంక లాంటి ఒక ప్రదేశం కంటబడింది. నది ప్రవాహం అక్కడ రెండు పాయలుగా చీలి, ఆ లంకను చుట్టి ప్రవహిస్తున్నది. అప్పటికి బాగా అలసిపోయిన కేశవుడూ, జయమల్లూ పరస్పరం హెచ్చరించుకుని, ఆ లంక కేసి ఈదసాగారు. కొద్దిసేపటికల్లా వాళ్ళు తీరాన్ని చేరి, తాము బలవంతంగా నదిలోకి గుంజిన బానిస వర్తకుల కోసం నదికేసి చూశారు. వాళ్ళ జాడలేదు.

కేశవుడూ, జయమల్లూ లంకలోకి బయలుదేరారు. వాళ్ళు నాలుగైదడుగుల దూరం వెళ్ళారో లేదో, వాళ్ళకు అక్కడ ఇసుకలో పాదాలగుర్తులు కనిపించినై.

"ఈ లంక నిర్మానుష్యమైంది కాదు. ఇక్కడ ఎవరో వున్నారు. ఎవరై వుంటారు?" అన్నాడు కేశవుడు.

"వాళ్ళెవరైతేనేం, మనం నిరాయుధులం," అన్నాడు జయమల్లు.







"అంత దిగులు పడకు జయమల్లా. మనం యిప్పటికే ఎన్నోసార్లు మృత్యుముఖాన్నుంచి బయటపడ్డాం. ఇంకా ప్రమాదాలంటే భయపడవలసిన అవసరం ఏముంది?" అంటూ కేశవుడు లంక లోపలికి దారితీశాడు.

వాళ్ళిద్దరూ కొంతదూరం నడిచి ఒక ఎత్తయిన దిబ్బలాంటి ప్రదేశాన్ని చేరి, అక్కడినుంచి దిగువకు చూశారు. ఆ దిగువ, సమతలంగా వున్న ఒక ప్రదేశంలో పాతికా ముప్పై చుట్టు గుడిసెల్లాంటివి వున్నవి. వాటి ముందు కత్తిచేబట్టిన ఒకడు కాపలా కాస్తున్నాడు.

"వాడి ఆకారం చూస్తే నరభక్షకుడిలా వున్నాడు, అవునా?" అని అడిగాడు కేశవుడు. జయమల్లు అవునన్నట్టు తల వూపుతూ, "అదుగో, వాడు మన కేసే తల తిప్పాడు, మనను చూసినట్టున్నది," అంటూ దవ్వున చెట్లచాటుకు పోయాడు. కేశవుడు కూడా జయమల్లును అనుసరించ బోయేంతలో, కాపలావాడు, "హెయ్, ఎవరక్కడ, ఆగు!" అంటూ పరిగెత్తి రాసాగాడు.

"కేశవా, వాడు నిన్నొక్కణ్ణే చూసినట్టున్నది. దగ్గిరకు రాగానే వాడితో మాటలు పెట్టుకో," అంటూ జయమల్లు మోకాళ్ళ మీద పాకుతూ పక్కకు వెళ్ళిపోయాడు.

కేశవుడు అనుమానించినట్టు, ఆ కాపలా వాడు నిజంగా నరభక్షకుడే. వాడు లొట్టలు వేస్తూ కేశవుడి దగ్గిరకు వచ్చి, "ఒంటరి వాడివా, లేక తోడుగా ఎవరైనా వున్నారా? అసలు ఈ లంకకు ఎలా రాగలిగావు?" అంటూ, కేశవుణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి, "లేతా ముదురూగాని, మాంచి దోరమాంసం! నేను ఆకలి మీద వుండటం చూసి, నిన్నే లంకదేవతే యిక్కడికి పంపి వుంటుంది!" అంటూ కత్తి పైకెత్తాడు.

ఆ సరికి నరభక్షకుడి వెనక్కు పాకుతూ వచ్చిన జయమల్లు, చిరుతగండులా ఒక్క





ఎగురున నరభక్షకుడి మీదికి దూకి, తలతో వాడి వెన్నుమీద గట్టిగా ఒక్క తాకు తాకాడు. నరభక్షకుడు ఒక్క చావుకేక పెట్టి, ముందుకు విరుచుకుపడ్డాడు. వాడి చేతిలోని కత్తి జారి దూరంగా పడింది. కేశవుడు ఒక్క ఊపులో దాన్ని చేతికి తీసుకుని, నరభక్షకుడి కంఠాన్ని తెగవేశాడు.

"ఇద్దరికి కలిసి ఒక్క ఆయుధం, చాలు!" అంటూ జయమల్లు, మిట్టకు దిగువగా వున్న చుట్టుగుడిసెల కేసి చూశాడు. అక్కడ ఎవరూ వున్నట్టులేదు.

"ఇదేదో తమాషాగా వున్నది. అడవిలో మనను ఎదుర్కొన్న నరభక్షకుల నివాస స్థానం యిదే అయివుంటుంది. వాళ్ళంతా వేటకు వెళితే, వీడు కాపలాకాస్తున్నాడన్న మాట. గుడిసెల్లో ఏముందో ఒకసారి చూద్దామా? తరవాత మన దారిన మనం వెళ్ళవచ్చు," అన్నాడు జయమల్లు. కేశవుడు సరేనన్నాడు. వెంటనే ఇద్దరూ మిట్ట దిగి పిల్లుల్లా నిశ్శబ్దంగా గుడిసెలచుట్టూ వున్న కంచె దాటి లోపల ప్రవేశించారు. వాళ్ళకు గుడిసెలకు మధ్యగా కొంచెం ఎత్తుగావున్న ఒకచోట, తతిమ్మా వాటికన్న కొంచెం పెద్దదైన ఒక గుడిసె కనిపించింది.

"అది బహుశా, నరభక్షకుల నాయకుడి భవనం అయివుంటుంది!" అంటూ జయమల్లు చిన్నగా నవ్వాడు. వాళ్ళిద్దరూ దాన్ని సమీపించారు. హఠాత్తుగా లోపలి నుంచి మాటలు వినిపించినై.

"చెప్పు, నువ్వెవరో నాకు తెలిసిపోయింది! ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఎవరో కూడా నాకు, తెలుసు! వాళ్ళెక్కడ?" అని కసురుతున్నట్టు ప్రశ్నించుతున్న దొక కంఠం. కేశవుడూ, జయమల్లూ నిశ్చేష్టులయారు. ఆ కంఠధ్వని ఎవరిది? బ్రహ్మదండి మాంత్రికుడిదా? లేక నరభక్షకుల నాయకుడైన చండమండూకుడిదా?

—(ఇంకా వుంది)








## 19

[కేశవుణ్ణీ, జయమల్లునూ బానిసలుగా కొన్న వర్తకులపై నరమాంస భక్షకులు వచ్చి పడ్డారు. ఆ గందరగోళంలో కేశవుడూ, జయమల్లూ నదిలోకి దూకి ఒక లంక చేరారు. అక్కడ వున్న కొన్ని గుడిశెలను వాళ్లు సమీపిస్తుండగా, ఒక గుడిశెలోంచి, 'బ్రహ్మ దెక్కడ? కనిష్ఠు డెక్కడ?' అని ప్రశ్నించుతున్న కంఠధ్వని వినిపించింది. తరవాత—]

కేశవుడికీ, జయమల్లుకూ ఓ త్రుటికాలం ఏం చేసేందుకూ పాలుపోలేదు. "ఆ కంఠ ధ్వని బ్రహ్మదండి మాంత్రికుడిది! నా తండ్రిని వాడు హింసిస్తున్నాడు," అనుకున్నాడు కేశవుడు. "ఆ ప్రశ్నించే గొంతు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడిది! గుడిశెలో వాడి అనుచరులు ఎంత మంది వున్నారో తెలియదు. ఇప్పుడేమిటి కర్తవ్యం?" అనుకున్నాడు జయమల్లు.

ఇలా ఆలోచిస్తూ కేశవుడూ, జయమల్లూ అప్పుడే చలనం వచ్చిన వాళ్లలా చప్పున ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. మాటలూ, సౌంజ్ఞలూ లేకుండానే ఆ క్షణంలో చేయవలసిందేమిటో యిద్దరికీ తెలిసిపోయింది.

జయమల్లు నిశ్శబ్దంగా వంగి, గుడిశె పక్కన వున్న ఒక ఈటెను చేతికి తీసుకున్నాడు. తరవాత కేశవుడి భుజం మీద చేయివేసి చెవిలో మెల్లిగా, "గుడిశెలో వున్న







శత్రువు లెందరో ముందు తెలుసుకోవాలి," అంటూ గుడిసెకు అల్లివున్న కొబ్బరి ఆకులలో నుంచి ఈటెను నింపాదిగా లోపలికి గుచ్చాడు.

కేశవుడు, జయమల్లు చేసిన కంతలో నుంచి లోపలికి తొంగి చూశాడు. గుడిసె అంతా చీకటి మయంగా వున్నది. ఒక మూల వెలుగుతున్న కాగడా వెలుగులో మసకమసకగా ఇద్దరు ముగ్గురు మనుషులు కనిపిస్తున్నారు. వాళ్ళల్లో ఒకడు మెడలో మానవ కంకాళాలను పూసలుగా ధరించి వున్నాడు. మరొకడు కూడా దాదాపు అలాగే వున్నాడు. వాడికి మెడలో ఎలాంటి అలంకారాలూ లేవు. వాళ్ళకు ఒకపక్కగా ఒక యువకుడు పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నాడు. అతణ్ణి కంకాళాలు ధరించి వున్నవాడు ప్రశ్నిస్తున్నాడు.

"నాకు సర్వం తెలుసు, అంతా తెలుసు! నా నుంచి నువ్వు ప్రాణాలతో పారిపోలేవు. ముసలివాడి గొడవ నాకవసరం లేదు. నాక్కావలసింది, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ. చెప్పు, ఊఁ వాళ్ళెక్కడ?" అని కంకాళాలు ధరించిన వాడు భీకరంగా అరిచాడు.

అంత ప్రమాద పరిస్థితిలోకూడా కేశవుడికి ఎంతో ఆనందం కలిగింది. ఈ దుర్మార్గు లెవరోగాని, వాళ్ళకు చిక్కినవాడు మాత్రం తన తండ్రి కాదు. పైగా, గుడిసెలో వున్న వాళ్ళిద్దరు; వాళ్ళను హతమార్చి, వాళ్ళకు బంది అయినవాణ్ణి విడిపించటం పెద్ద సమస్య కాదు.

కేశవుడు యిలా అనుకుని, జయమల్లు కేసి తిరిగి, "మల్లా, మనం లోపలికి దూర బడదాం. శత్రువు లిద్దరే," అన్నాడు.

జయమల్లు తొందర పడవద్దని కేశవుణ్ణి వారించి, కంతలో నుంచి గుడిసెలోకి చూశాడు. చేతులు విరిచి కట్టబడిన వ్యక్తి, కోయనాయకుడు గడేజంగ్ అనుచరుడన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో







బంధితుణ్ణి ప్రశ్నిస్తున్నవాడు లేచి నిలబడి, పళ్ళు కొరుకుతూ, "వీడిని ఎంత హింసించినా నిజం చెప్పడు. ఆ మండూక కషాయం తాగించు. నిజం అదే బయట పడుతుంది," అన్నాడు.

"అలాగే చేస్తాను, చండమండూకేశ్వరా," అంటూ మండూకుడి అనుచరుడు లేచి వెళ్ళి, గుడిసెలో ఒక మూల నుంచి ఒక పాత్ర తెచ్చి, దానిని అక్కడ వున్న మిడిగుడ్ల కొయ్యబొమ్మల ముందు మూడుసార్లు తిప్పి, పాత్రను బంధితుడి నోటిముందు పెడుతూ, "ఇది నిజం చెప్పించే కషాయం, తాగు," అంటూ అతడి నోటిలో బలవంతంగా పోశాడు.

"వీడు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడు, తెలిసిందా? వాడిప్పుడు బంధితుడికి నిజం పలికించే కషాయమేదో యిప్పించాడు. తొందర ఎందుకు? ఏం జరుగుతుందో చూద్దాం. ఆ తరవాత వాణ్ణీ, వాడి సేవకుణ్ణీ యమపురికి పంపుదాం," అన్నాడు జయమల్లు.

ఇంతలో మండూక కషాయం తాగినవాడు, పెద్దగా రెండుసార్లు దగ్గి, ఒకటి రెండుసార్లు మత్తెక్కిన వాడిలా అటూ యిటూ ఊగిసలాడి, "వాళ్ళిద్దరూ... జ్యేష్టుడూ...కనిష్టుడూ ... వున్నారు ... యిక్కడే..."

అతడు మాట ముగించే లోపలే జయమల్లు కంత దగ్గిర నుంచి యివతలికి ఎగిరి గంతేసి, "కేశవా, ప్రమాదం ! అది నిజంగా సత్యం చెప్పించే కషాయమే! ఆ తాగినవాడు మనం యిక్కడ వున్నట్టు చెప్పేస్తున్నాడు. మనం వెంటనే గుడిసెలో జొరబడి ఆ దుర్మార్గుల్ని చంపటం తప్ప మరి మార్గం లేదు," అంటూ గుడిసె ద్వారానికేసి పరిగెత్తాడు. బయట అడుగుల చప్పుడు వింటూనే చండమండూకుడు అదిరిపడ్డాడు. "ఎవరో శత్రువులు, శత్రువులు !" అంటూ







అరిచాడు. అతడి అనుచరుడు ఒక ఈటె తీసుకుని ద్వారంకేసి పరిగెత్తుతూ, "మండూకేశ్వరా, మీరు మాయంకండి!" అని కేక పెట్టాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిసె ద్వారానికి అడ్డంగా వున్న తడికెను ఒక్క తన్ను తన్ని లోపలకు దూకారు. వాళ్ళను ఎదిరించ చూచిన, మండూకుడి అనుచరుణ్ణి కేశవుడు తన కత్తిపిడితో తల మీద ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు వాడు అబ్బా అంటూ కింద పడిపోయాడు.

గుడిసెలోకి ప్రవేశించిన కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. చేతులు విరిచికట్టబడి వున్నవాడు, జయమల్లు ఊహించినట్టు గడేజంగ్ అనుచరుడే. కాని, చండమండూకుడి జాడలేదు.

జయమల్లు, గడేజంగ్ అనుచరుడి కట్లు విప్పి అతణ్ణి గుడిసెలో వున్న ఒక బాదుకు ఆనించి కూచోబెట్టాడు. అతడింకా మత్తుతో అటూ యిటూ వూగుతున్నాడు. జయమల్లు అతడి తల మీద యింత నీరు కుమ్మరించి, భుజాలు పట్టుకుని వూపుతూ, "నువ్వు గడేజంగ్ అనుచరుడివే గదా? మేమిద్దరం స్నేహితులం. మనమంతా జలపాతంలో నుంచి నదిలోకి దూకి కపిలపుర రాజ్యం చేరాం. అక్కడ బానిస వర్తకుడి భటులకు చిక్కకుండా నువ్వూ, నీతోటివాడూ, గురు మౌనానందుడూ ఎటో పారిపోయారు. తరవాత ఏం జరిగింది?" అని గుక్క తిప్పుకోకుండా ప్రశ్నల వర్షం కురిపించాడు.

జయమల్లు ప్రశ్నకు ఆ యువకుడు కళ్ళు తెరిచి అతడి కేసీ, కేశవుడి కేసీ చూడటం మాత్రం చేయగలిగాడు. అతడి ముఖంలో ఆశ్చర్యం, ఆనందం తొణికిసలాడింది. ఏదో చెప్పేందుకు ప్రయత్నించాడు, కాని మాటలు తడబడినై.

"మల్లూ, అతణ్ణి తొందరపెట్టకు. కాస్త విశ్రాంతి తీసుకోని. ఈ లోపల మనం





ఈ చండమండూకుడి బాధ తెలుసుకుందాం," అన్నాడు కేశవుడు.

కేశవు డిలా అనగానే మండూకుడి అనుచరుడు లేచి కూచుంటూ, "హాఁ, చండమండూకేశ్వరా! మాయమయావా? తిరిగి నీ దర్శనం నూరేళ్ళ తరవాతనే గదా? అంత కాలం నువ్వు లేకుండా, నీ అనుచరులమైన మేము ఎలా జీవించటం!" అంటూ నెత్తి నోరూ కొట్టుకో సాగాడు.

వాడి దుఃఖం, నూరేళ్ళ తరవాతనే గదా నీ దర్శనం అన్న మాటలూ విని కేశవుడికి చాలా ఆశ్చర్యం కలిగింది.



కాని, జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, మండూకుడి అనుచరుణ్ణి సమీపించి, వాడి జుట్టు పట్టుకు ఊడుపుతూ, "ఓరి దొంగ వెధవా, నీ మాటలు మేము నమ్ముతామే అనుకున్నావా! ఎక్కడ? నీ నాయకు డెక్కడ? నిజం చెప్పక పోయావో నీ ప్రాణం తీస్తాను," అన్నాడు.

"ప్రాణమా? తీస్తావా? అంతకంటె నాక్కావలసిం దేమిటి? చండమండూకేశ్వరుడి కోసం చచ్చినవాళ్ళు నేరుగా స్వర్గానికే వెళ్ళిపోతారు. ఆ సంగతి లోకంలో తెలియని వాళ్ళెవరూ లేరే. నువ్వెంత అమాయకుడివి. నన్ను త్వరగా చంపెయ్యి!" అంటూ మండూకుడి అనుచరుడు పక్కన పడి ఉన్న ఈటెను అందుకుని దాన్ని జయమల్లుకు యివ్వబోయాడు.

ఈసారి కేశవుడితో పాటు జయమల్లు కూడా చాలా ఆశ్చర్యం పొందాడు. ఒకవేళ నిజంగానే చండమండూకుడు గుడిసెలో నుంచి మాయమయాడా? అన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో గడేజంగ్ అనుచరుడు పెద్దగా దగ్గుతూ లేచి నిలబడి, "జ్యేష్ఠా, కనిష్ఠా, నన్ను గుర్తించారు గదా! సరే. మీరు ఆ దుర్మార్గుడి మాటలు నమ్మకండి. మండూకుడు ఈ గుడిసెలో ఉన్న రహస్య మార్గం గుండా పారి







పోయి వుంటాడని, నాకు గట్టి నమ్మకం వున్నది," అన్నాడు.

"రహస్యము...మార్గము...అహ్హహ్హ!" అంటూ మండూకుడి అనుచరుడు గుర్రంలా సకిలించి, "చండమండూకేశ్వరుడికి రహస్య మార్గాలు కావాలా? ఆ మహనీయుడు నీటిలో ఉప్పులా కరిగిపోగలడు, గాలిలో పొగలా కలిసిపోగలడు, మట్టిలో సారంలా యింకి పోగలడు, ఆకాశంలో..."

"ఇక నోరు ముయ్యి వాచాలపు వెధవా!" అంటూ కోయయువకుడు ఒక్క దూకులో వచ్చి, మండూకుడి అనుచరుడి గొంతు పట్టుకుని, "చూస్తూంటే వీడి ఎత్తు, తమ నాయకుడు బాగా దూరం పారిపోయేందుకు మన చేత యిక్కడ జాగారం చేయించటంలా వుంది. మీరు గుడిసెలోని నేలంతా తొక్కి చూడండి. నేను వీడి కాళ్ళూ చేతులూ కట్టి, అరవకుండా నోట్లో గోనె సంచి కుక్కుతాను," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిసె అంతా కలయ తొక్కసాగారు. చూస్తూండగానే కోయయువకుడు తన పని ముగించుకుని, ధిమిక ధిమిక తై ధిమిక అంటూ గుడిసెలో హనుమంతుడిలా కుప్పిగంతులు ప్రారంభించాడు. రెండు మూడు నిమిషాల కాలం ముగ్గురూ గుడిసె అంతా కలయ తొక్కారు. హఠాత్తుగా కోయయువకుడు కెవ్వుమంటూ అరిచి, "రహస్య మార్గం!" అంటూ దభీమని కింద గోతిలోకి పడిపోయాడు.

కేశవుడూ, జయమల్లూ కోయయువకుడు పడిపోయిన గోతిలోకి తొంగి చూస్తూ, "నీ కేం దెబ్బలు తగలలేదు గదా? అరెరె, ఇక్కడ మెట్లుకూడా వున్నవే. మండూకుడు మాయమైంది, ఈ మెట్ల మీదినుంచి భూసొరంగంలో కన్న మాట!" అన్నారు.

కోయయువకుడు ఒంటికి పట్టిన మన్ను దులుపుకుని, తల పైకెత్తి, "ఆ దుర్మార్గుణ్ణి పై నుంచి కిందకు దొర్లించండి. తరవాత





మీరు కూడా మెట్లు దిగిరండి. మండూకు డిక్కడే దాక్కుని వుంటాడు," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ కలిసి, మండూకుడి అనుచరుల్ని కాళ్ళు తల పట్టుకుని పైనుంచి గోతిలోకి వున్న మెట్లమీదుగా కిందకు దొర్లించి, తరవాత వాళ్ళుకూడా కిందకు దిగి, గోతిని, దాని అంచుకు వేళ్ళాడుతున్న చెక్క తలుపుతో ఎప్పటిలా మూసేశారు.

కోయయువకుడు అనుకున్నట్టు అది పట్టి భూసారంగం కాదు. అక్కడ విశాలమైన గదులూ, భీకరాకారంతో వున్న కొయ్య బొమ్మలూ, ఈటెలూ, కత్తులూ...ఇలాంటి సరంజామా చాలా వున్నది.

"పైనున్న గుడిసె మండూకు డాడే కపట నాటకంలో ఒక భాగం మాత్రమే. వాడి నిజమైన నివాసగృహం యిది. ఆ మూల వున్న కాగడాలు వెలిగించి అన్ని గదులూ వెతకండి," అన్నాడు జయమల్లు.

ఆ వెంటనే ముగ్గురూ కాగడాలు వెలిగించి, ఆ ప్రదేశమంతా గాలించసాగారు.

కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ భూసారంగమంతా గాలిస్తుండగా, చండమండూకుడు, తన అనుచరు డొకడితో కలిసి, లంక మధ్య వున్న అడవిలోని ఒక పాడుపడిన బావి లోంచి పైకి వస్తూ, "ఇప్పటి కేదో బతికి బయటపడ్డాం. ఆ బ్రహ్మదండి మాంత్రికపు నీచుడు నన్నెంత మోసం చేశాడు! నన్ను ఎవరి కోసరం అయితే వెతకమన్నాడో, వాళ్ళను నా భవంతి దగ్గిరికే పంపి, నా ప్రాణాలు తీయించేయిందు ప్రయత్నించాడు. లోపల నేను ఆ కోయ కుంకకు మండూక కషాయం తాగించి, నిజం చెప్పిస్తూంటే; ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ గుడిసె కంతల్లో నుంచి ఇదంతా చూస్తున్నారన్నమాట! వాళ్ళి కర్రగ్గుచ్చి, నిలువునా కాల్చుకు తింటాను," అంటూ పళ్ళు కొరుకుతున్నాడు. —(ఇంకా వుంది)





# రాకాసి లోయ

## 20

[కేశవుడూ, జయమల్లూ, కోయయువకుణ్ణి రక్షించారు. తరవాత వాళ్ళు చండమండూకుడు పారిపోయిన రహస్య సొరంగ మార్గం తెలుసుకున్నారు. ఈ లోపల మండూకుడు, ఒక అనుచరుడితో సొరంగ మార్గం నుంచి, అడవి మధ్య వున్న ఒక పాడుపడ్డ బావి గుండా పైకి వచ్చి, బ్రహ్మదండి మాంత్రికుణ్ణి తిట్టసాగాడు. తరవాత—]

చండమండూకుడి అనుచరుడికి, తమ నాయకుడు బ్రహ్మదండిని తిట్టటం గాని, అతణ్ణి అనుమానించటం గాని, ఏ మాత్రం సబబుగా కనిపించలేదు. బోలెడు ధనం యిచ్చి, బ్రహ్మపుర రాజు చేత అర్ధ రాజ్యం యిప్పించగలనని వాగ్దానం చేసిన బ్రహ్మదండి, మండూకుణ్ణి చంపేందుకు మనుషుల్నెందుకు పంపుతాడు? పైగా, ఆ వ్యోష్ఠుడూ, కనిష్ఠుడూ లేందే రాకాసిలోయలో తమ సాధించగలిగిందేమీ లేదని, బ్రహ్మదండి ముందుగానే మండూకుడికి చెప్పి, వాళ్ళను పట్టుకునే పని అతడికి ఒప్పగించాడు. ఆ వ్యోష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంకకు చేరటంలో ఏదో రహస్యం వున్నది...

చండమండూకుడి అనుచరుడు యిలా ఆలోచిస్తూ, తమ నాయకుడి ముందుకు వచ్చి, "మండూకేశ్వరా, తొందరపడకండి. ఆ దుర్మార్గు లిద్దర్ని పంపినవాడు బ్రహ్మదండి కాదని నా అనుమానం. మన సహాయం కోరిన ఆ మాంత్రికుడు మనను







చంపించే ప్రయత్నం ఎందుకు చేస్తాడు? ఇందువల్ల అతడికి కలిగే లాభం ఏమిటి? ఆలోచించాలి," అన్నాడు.

"ఆలోచించు...తిరిగ్గా ఆలోచించు!" అంటూ మండూకుడు గట్టిగా కసురుకుని, "ముందు నువ్వెళ్ళి, ఆ బ్రహ్మదండి భడవాని యిక్కడికి తీసుకు రా. పావు గంటలో రావాలి, తెలిసిందా? అలా చేయకపోయావో, నీ చర్మం వొలిపిస్తాను," అంటూ కళ్ళెర్ర చేశాడు.

మండూకుడి అనుచరుడు పెద్ద పెద్ద అంగలేస్తూ హడావిడిగా రావటం, కొండ అంచున వున్న గుడారాల ముందు కూచుని మాట్లాడు కుంటున్న బ్రహ్మదండి మాంత్రికుడూ, అతడి అంగరక్షకులైన, జితవర్మా, శక్తివర్మలూ చూశారు. నరభక్షకుడి వాలకం వాళ్ళ ముగ్గురిలో భయాశ్చర్యాలను కలిగించింది.

బ్రహ్మదండి, జిత శక్తివర్మల కేసి తల తిప్పి, "జితా, శక్తీ, చూశారా మన కేసి వస్తున్న, మండూకుడి అనుచరుడి ముఖ లక్షణాలు. వాడేదో మాంచి కోపంలో వున్నట్టున్నాడు. మనకేం ప్రమాదం లేదు గదా!" అన్నాడు నిస్పృహగా.

"అసలు ఈ నరభక్షకులతో స్నేహం కలపటమే ప్రమాదం. నే వొద్దని ఎంత మొత్తుకున్నా, విన్నావు కాదు," అన్నాడు జితవర్మ కోపంగా.

"మనం స్నేహితులమని చెప్పి, డబ్బూ, రాజ్యం వస్తుందన్న ఆశ చూపకపోతే, మనను మండూకుడు ఎప్పుడో కాల్చుకు తినేసేవాడు. ఒకసారి వాళ్ళకు చిక్కాం తరవాత, మనం చేయ గలిగిందేముంది, నిస్సహాయులం. అంతా ఆ కాలభైరవుడి అధీనం," అన్నాడు బ్రహ్మదండి.

సంభాషణ ఇలా జరుగుతున్నంతలో, మండూకుడి అనుచరుడు అక్కడికి రానే వచ్చాడు. వస్తూనే వాడు, బ్రహ్మదండి కేసి







కోపంగా చూస్తూ, "బ్రహ్మదండీ, నీ రోజులు ముగిసినై. మా నాయకుడు నిన్ను నిలువునా కాల్చుకు తింటానంటూ కారాలూ మిరియాలూ నూరుతున్నాడు," అన్నాడు.

"నన్నా? కాల్చుకు తినటమా? ఆశ్చర్యం! ఆ మండూకేశ్వరుడికి నేను చేసిన ద్రోహం ఏమిటి? బ్రహ్మపుర రాజ్యంలో అర్ధ రాజ్యం యిప్పిస్తానని కూడా మాట యిచ్చానే," అంటూ బ్రహ్మదండి లేని బింకం నటించాడు.

"అర్ధరాజ్యం మాట భద్రమండూకు డెరుగు! నువ్వు, మా నాయకుణ్ణి చంపించేందుకు, ఆ జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గిరకు పంపావు, అవునా?" అని ప్రశ్నించాడు మండూకుడి అనుచరుడు.

జ్యేష్ఠుడు, కనిష్ఠుడు అన్న పేర్లు వింటూనే బ్రహ్మదండి మాంత్రికుడు, కూచున్నచోటు నుంచి ఎగిరి లేచి, "హా, కాలభైరవా, ఎన్నాళ్ళకు నీ భీకరదృష్టి నా మీదికి ప్రసరించింది! జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారా?" అంటూ జితశక్తివర్మల కేసి తిరిగి, "మీకూ తెలును గదా, వాళ్ళు జయమల్లూ, కేశవుడని? ఇక లేవండి, బయలుదేరండి. మన ప్రయాణం సూటిగా రాకాసి లోయకే," అంటూ చిందులు తొక్కసాగాడు.

మండూకుడి అనుచరుడు ముందుకు వచ్చి, బ్రహ్మదండి భుజం పట్టుకుని ఒక్క తోపుతోస్తూ, "కపటనాటకం ఆడకు! ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారని నీ కెవరు చెప్పారు? ఆ దుర్మార్గుల నుంచి తప్పుకుని ప్రాణాలతో బయటపడటంలో, నాకూ, మండూకేశ్వరుడికీ తల ప్రాణం తోకకు వచ్చింది," అన్నాడు.

"అయితే వాళ్ళిప్పు డెక్కడున్నారు? ఇంకా మండూకేశ్వరుడి భవనంలోనే వున్నారా? క్షణాలమీద వాళ్ళను పట్టేస్తాను. జితా, శక్తీ, లేవండి," అంటూ బ్రహ్మదండి కేకలు ప్రారంభించాడు.







బ్రహ్మదండి మాంత్రికుడి అదుర్దా, అతడి మాటల తీరూ చూసిం తరవాత, మండూకుడి అనుచరుడికి, అతడు నిర్దోషి అన్న నమ్మకం కలిగింది. జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ బ్రహ్మదండి పంపగా వచ్చిన వాళ్ళని, తమ నాయకుడు అనుకోవటం పొరపాటని, అతడికి మొదటి నుంచీ తెలుసు. ఇప్పుడు తను వేసిన పేచీతో నిజం తెలిసిపోయింది. కాని, మండూకుడి కోపాన్ని శమింపచేయుటం ఎలా?

మండూకుడి అనుచరుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ ఊరుకుని, తరవాత బ్రహ్మదండిని దూరంగా తీసుకుపోయి, జిత శక్తివర్మలకు వినబడని విధంగా స్వరం తగ్గించి, "మా నాయకుడు నువ్వంటే మండిపోతున్నాడు," అంటూ జరిగిందంతా చెప్పి, "ఒకవేళ నువ్వు నిర్దోషివని ఎంత చెప్పినా, మా నాయకుడు నమ్మకపోతే, ఏదో మంత్రం వల్లించినట్టు నటించి, జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గరకు పంపిన వాడు జితవర్మ, శక్తివర్మ అని చెప్పెయ్యి. ఆ యిద్దర్లో ఒకడి పీడ విరగడ అవుతుంది. నువ్వు రానున్న ప్రమాదాన్నుంచి బతికి బయటపడతావు," అన్నాడు.

ఆ మాటలతో బ్రహ్మదండికి ప్రాణం కుదుటపడింది. అతడు మెల్లిగా తల తిప్పి జిత శక్తివర్మల కేసి చూసి, "మండూకానుచరాగ్రణీ! మీరు చెప్పింది మహ బావుంది. ఒక్క గొప్పవాడి ప్రాణ రక్షణకుగాను, వెయ్యిమంది అల్పులను బలి చెయ్యవచ్చని శాస్త్రగ్రంథాలన్నీ మూకవుమ్మడిగా మొర పెడుతున్నవి. ఇక బయలుదేరండి. ఆ మండూకేంద్రుల వారి సన్నిధానానికి వెళ్ళి వారి దివ్య దర్శనభాగ్యం కలిగించుకుందాం," అన్నాడు.

మండూకుడి అనుచరుడూ, బ్రహ్మదండి ముందు నడవసాగారు. వెనకగా వస్తున్న జిత, శక్తివర్మలకు, వాళ్ళిద్దరూ రహస్యంగా







మాట్లాడుకున్న దేమిటో తెలియక పాపటంతో భయం పట్టుకున్నది. కాని, పారిపోయే ప్రయత్నం చెయ్యటం వృథా. లంకలో తమ కొక్క స్నేహితుడు లేడు, అంతా నరభక్షకుల మయం!

నలుగురూ చండమండూకుడున్న పాడుపడ్డ బావి ప్రాంతాల కొచ్చేసరికి అక్కడ మండూకుడు యిద్దరు నరభక్షకులకు ఏవో సంజ్ఞలు చేస్తూ, మధ్యమధ్య బావిలోకి తొంగి చూస్తున్నాడు. అది గమనించిన, అతడి అనుచరుడూ, బ్రహ్మదండి నిశ్శబ్దంగా మండూకుణ్ణి సమీపించారు. మండూకుడు వాళ్ళను బావి దగ్గిర నుంచి, కొంచెం ఎడంలోవున్న చెట్ల కిందకు తీసుకుపోయి ప్రాణభయంతో వణుకుతున్న బ్రహ్మదండితో, "బ్రహ్మదండీ, భయపడకు! నువ్వేదో ద్రోహం చేశావని యింతకు ముందు అనుమానించాను. కాని, అడవి నుంచి తిరిగివచ్చిన నా అనుచరుల ద్వారా, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంక కెలా చేరారో తెలుసుకున్నాను. వాళ్ళు బానిసల గుంపు నుంచి విడివడి నదిలోకి దూకి, ఈ లంక చేరారట. సరే, ప్రస్తుత ముఖ్య విషయం అది కాదు. వాళ్ళిద్దరూ మన కిప్పుడు బోనులో చిక్కిన సింహాలు," అంటూ బావి కేసి చేయి చూపి, "వాళ్ళిప్పుడు నా భవనం నుంచి యిక్కడికి వున్న సొరంగ మార్గం గుండా వస్తున్నారు. ఆ చివర మనవాళ్ళను కాపలా పెట్టాను. కొందరు సొరంగ మార్గంలోకి దిగి వాళ్ళనిటు తరుముకు వస్తున్నారు. మనం యిక్కడ మాటువేసి, బావిలోనుంచి వాళ్ళు బయిటకి రాగానే సజీవులుగా పట్టుకోవాలి. తెలిసిందా?" అన్నాడు.

మండూకు డిలా చెప్పగానే, బ్రహ్మదండి మాంత్రికుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. అతడి కళ్ళ ముందు రాకాసిలోయ లోని ధనరాసులన్నీ







గ్గిరున తిరిగినై. అతడు జిత, శక్తివర్మల దగ్గిరకు వెళ్ళి రహస్యంగా, "మండూకుడు చెప్పింది విన్నారు కదా? ఆ కేశవుణ్ణీ, జయమల్లునూ ప్రాణాలతో పట్టుకోండి. బహుశా వాళ్ళ దగ్గిర ఆయుధాలు వుండి వుంటవి. తప్పని సరైతే ఆత్మరక్షణకు జయమల్లును చంపండి కాని, కేశవుడికి మాత్రం ఎలాంటి హాని కలిగించకండి. తెలిసిందా?" అన్నాడు.

ఆ తరవాత అందరూ కలిసి బావి దగ్గిరకు వెళ్ళి దాని అంచున పొంచి కూచున్నారు. మండూకుడు మధ్యమధ్య కూచున్నచోటు నుంచి లేచి, బావిలోకి తొంగిచూసి, దాని గట్టు మీద చెవి ఆనించి విని, "శబ్దమవుతున్నది. వాళ్ళిటే వస్తున్నారు," అని మెల్లిగా తన పక్కనున్న వాళ్ళతో చెప్పసాగాడు.

చండమండూకుడు అనుకున్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ సొరంగ మార్గం కుండా అటుకేసే వస్తున్నారు. వాళ్ళు గుడిసెలో వున్న సొరంగాన్ని కనుక్కున్న తరవాత, మండూకుడి కోసం అక్కడున్న గదులూ అవీ వెతికి, అతడు లేడని గ్రహించి, తిరిగి గుడిసెలోకి పోదామనుకునేంతలో, అక్కడ అలికిడీ, సొరంగ ద్వారాన్ని కప్పివున్న తలుపు తెరవటం వాళ్ళకు కనిపించింది. వెంటనే వాళ్ళు ప్రమాదాన్ని గ్రహించి, కాగడాల వెలుగులో సొరంగం వెంట దాని రెండవ చివర కేసి బయలుదేరారు.

"మనం ఇందులో వున్న సంగతి మండూకుడి అనుచరులకు తెలిసిపోయింది. వాళ్ళు మన కోసమే వస్తున్నారు," అన్నాడు కోయయువకుడు.

కేశవుడు అవునన్నట్టు తల వూపాడు. జయమల్లు వెలుగుతున్న కాగడాతో సొరంగ మార్గాన ముందుకు నడుస్తూ, "మనకు దీని వెంట పడి, ఇది ఎక్కడికి చేరిస్తే,





అక్కడికి చేరటం ఒక్కటే వున్న దారి. మండూకుడు ఆ చివర కూడా కాపు పెట్టక పోతే, మనం బతికి బయటపడగలం. అలా కాకపోతే, ప్రాణం వున్నంతవరకూ పోరాడదాం," అన్నాడు.

"అంతకాక చేసేందుకు మరేముంది? నరభక్షకులకు ఆహారం అయే ముందు వాళ్ళల్లో కొందరినైనా, మన కత్తులకు ఆహారం చేద్దాం," అన్నాడు కేశవుడు. కోయయుపకుడు అవునన్నట్టు తలాడించాడు.

ఆ విధంగా వాళ్ళు సొరంగమార్గంకుండా నడిచి పాడుబడిన బావిని సమీపిస్తున్నంతలో, పై నుంచి అలికిడి వినబడింది. వెంటనే ముందు నడుస్తున్న జయమల్లు ఆగి, కేశవుడితో మెల్లిగా, "మనం భయపడ్డంతా అయింది. వాళ్ళు మన కోసం కాపలా వేశారు," అన్నాడు.

కేశవుడు ఏదో అనబోయేంతలో వెనక నుంచి వేగంగా సమీపిస్తున్న అడుగుల చప్పుడూ, గుడ్డివెలుగూ కనిపించింది. వెంటనే ముగ్గురూ తమ తమ ఆయుధాలు గుప్పెళ్ళలో గట్టిగా బిగించి పట్టుకున్నారు. కేశవుడు, జయమల్లును తోసుకుని ముందుకు వస్తూ, "వెన్నంటి వస్తున్న శత్రువులు మన మీద పడకముందే, మనం ముందుకు వెళ్ళి ఆ పైన కాపలావున్న



వాళ్ళ పని పట్టాలి. ఆ విధంగా మనకు ప్రాణాలతో బయటపడే అవకాశం చిక్క వచ్చు," అన్నాడు.

ఆ వెంటనే ముగ్గురూ వేగంగా ముందుకు పరిగెత్తసాగారు.

"హేయ్, ఆ దుర్మార్గులు వచ్చేస్తున్నారు, ప్రాణాలతో పట్టుకోండి," అంటూ చండమండూకుడు కేక పెట్టాడు. వాడి అనుచరులూ, జిత, శక్తివర్మలూ ఆయుధాలు చేతబట్టి లేచి నిలబడ్డారు.

"కేశవుడి కేమీ ప్రమాదం కలగకూడదు. వాడు వెంటలేందే మనం రాకాసి లోయలో ఏమీ చేయలేం. జితా, శక్తీ, జాగ్రత! వాడి కేమైనా ప్రమాదం జరిగిందో మిమ్మల్ని నిలువునా, భస్మం చేసేస్తాను. తరవాత విచారించి లాభంలేదు," అంటూ బ్రహ్మదండి కేకపెట్టాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి కేకకు జవాబా అన్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ ఒక్క ఊపులో బావి నుంచి పై కెగిరివస్తూ, సింహాల్లా గర్జించారు. అదే సమయంలో దాపులవున్న గుబురుచెట్ల లోంచి, "గురుమౌనానందులకూ, జై!" అన్న కేకలు వినిపించినై. మరుక్షణంలో, ఒక పెద్దగొంతు, "విప్పచెట్ల మీద వున్న ఇరవైమంది యోధులూ, ముందు దిగి, ఆ బ్రహ్మదండిని, మండూకుణ్ణీ పట్టుకోండి! నేరేడుచెట్ల చాటున వున్న నలభై యిద్దరూ, బావిలోకి దూకి, సొరంగ మార్గాన వస్తున్న నరభక్షకుల్ని నరకండి!" అంటూ భీకరంగా హెచ్చరించింది.

ఆ హెచ్చరిక వింటూనే "భద్ర మండూకా!" అంటూ మండూకుడూ, "ఉపాసకుల ఊడలమర్రి, కాలభైరవా!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడూ బావి దగ్గిర నుంచి ఎగిరి గంతేసి, అడవిలోకి పారిపోయేందుకు పరిగెత్తసాగారు.

—(ఇంకా వుంది)








## 21

[సారంగ మార్గాన్నుంచి పారిపోయిన చండమండూకుడూ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి, అడవి మధ్య వున్న పాడుపడిన బావి దగ్గిర కేశవుడూ, జయమల్లుల కోసం కాపలా వేశారు. కాని, తీరా వాళ్ళు బావి నుంచి పైకి వచ్చే సమయంలో, దాపుల వున్న చెట్ల మీది నుంచి వచ్చిన కేక విని మండూకుడూ, బ్రహ్మదండీ పారిపోసాగారు. తరవాత—]

కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ బావి నుంచి పైకి వస్తూనే పారిపోతున్న, చండమండూకుణ్ణీ, బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ చూసి ఆశ్చర్యపడ్డారు. వాళ్ళతోపాటు కొందరు నరభక్షకులు కూడా పిక్కబలం కొందికీ అడవిలోకి పరిగెత్తుతున్నారు. అంతలో దాపుల వున్న చెట్ల మీది నుంచి కేశవుడి తండ్రి అయిన ముసలివాడూ, గడేజంగ్ అనుచరుడైన కోయయువకుడూ కిందికి దూకారు. తండ్రిని చూడగానే కేశవుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. అతడు చేతులు పైకెత్తి ఉత్సాహంగా ఒక్క కేక పెట్టి, 'అయ్యా' అంటూ ముందుకు పరిగెత్తబోయేంతలో, వెనక పాడుబడ్డ బావిలోంచి రణగొణ ధ్వని వినిపించింది. అప్పటిగ్గాని, కేశవుడికీ, జయమల్లుకూ, తమను సారంగమార్గాన తరుముకు వస్తున్న నరభక్షకుల సంగతి గుర్తుకు రాలేదు.







మందకు మంద నరభక్షకులు సొరంగ మార్గాన్నుంచి యిటు వస్తున్నారు..." అని హెచ్చరించే లోపలే, పది పన్నెండుమంది నరభక్షకులు కీచుమని అరుస్తూ, ఈటెలు పైకెత్తి బావిలోంచి బయిటికి దూకారు. అదే సమయంలో ముసలివాడూ, కోయ యువకుడూ నిలుచున్నచోటుకు వెనకగా వున్న పొదల్లో నుంచి, "మనం అనవసరంగా భయపడ్డాం. ముసలి వెధవ పెద్ద మోసం చేశాడు. అంతా కలిసి వాళ్ళు అయిదుగురే! చంపండి," అన్న చండ మందుకుడి కేక వినబడింది.

"కాలభైరవా, ఉపాసకుల ఊడల మర్రి...ఆ కేశవుణ్ణి చంపకండి! వాణ్ణి ప్రాణాలతో పట్టుకోండి. వాడు చస్తే యిక మనం బతికివుండీ లాభంలేదు. రాకాసి లోయ......బంగారం......వెండి....అర్ధ రాజ్యం..." అంటూ బ్రహ్మదండి నెత్తి నోరూ కొట్టుకుంటూ అరవసాగాడు.

రెప్పపాటు కాలంలో తను ఆశించిన దానికి భిన్నంగా జరిగిపోవటం చూసి ముసలివాడు ఓ త్రుటికాలం నిర్విణ్ణుడయాడు. ఎన్నో రోజుల తరవాత తను తన కొడుకును చూడటం జరిగింది. కాని, ఆ ఆనందానికి తను నోచుకోలేదు. ఇప్పుడు

వెంటనే వాళ్ళిద్దరూ, కోయయువకుడూ వెనక్కు తిరిగి బావి కేసి రెండడుగులు వేసేంతలో, ముసలివాడు పెద్దగా నవ్వి, "ఆ దుర్మార్గు లిద్దర్నీ హడలకొట్టాను. ఇప్ప చెట్లమీద వున్న అరవైమందీ, నేరేడు చెట్లచాటున వున్న నలభైయిద్దరూ...అని కేక పెట్టగానే, ఆ నీచులు కాదుకు పోయారు. ఇక ప్రస్తుతానికి ప్రమాదం లేదు," అంటూ ముందుకు రాబోయాడు.

తన తండ్రికి తమను వెన్నాడి వస్తున్న నరభక్షకుల సంగతి తెలియదని గ్రహించిన కేశవుడు చప్పున వెనుదిరిగి, "అయ్యా, ఇంకా మనకు ప్రమాదం తొలగలేదు. ఒక







తనూ, తన కొడుకూ కూడా సరభకికులతో అన్నిటికీ తెగించి పోరాడాలి.

"చిన్న గడేజంగ్! నువ్వేమీ భయ పడకు. మన చేతుల్లో కత్తులున్నంతవరకూ మన నెవరూ ఏమీ చేయలేరు. ఊఁ మహా చండీ!" అంటూ ముసలివాడు సరభకికు లతో పోరుకు తలపడ్డాడు.

ముసలివాడు పెట్టిన ముద్దు పేరుకు తగినట్టే చిన్న గడేజంగ్ అసహాయ శూరుడు. తమ నాయకుడిలాగే అతడికి ప్రాణభయం అంటే ఏమిటో తెలియదు. అతడు కత్తి దూసి, తన కేసి వస్తున్న నలుగు రైదుగురు సరభకికుల్ని దెబ్బ కొకడి చొప్పున కింద పడకొట్టాడు. కాని, సరభకికుల సంఖ్య వున్నకొందికి అధికం అవుతున్నది. చెట్ల చాటు నుంచి మిడతల దండులా వాళ్ళు ముందుకొచ్చి పడుతున్నారు. కేశవుడూ, జయమల్లూ, వాళ్ళ వెంట వున్న కోయ యువకుడూ భయంకరంగా పోరాడుతూ క్రమ క్రమంగా గుబురుగా వున్న చెట్ల కేసి తిరోగమించసాగారు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఇంతమంది దుర్మార్గు లతో నిలబడి యుద్ధం చేసి లాభం లేదు. అడవిలోకి పరిగెత్తండి. మేమిద్దరంకూడా అదే చేయబోతున్నాం. మిమ్మల్ని ఏదో విధంగా కలుసుకుంటాను," అంటూ ముసలివాడు పెద్దగా కేక పెట్టి, తనను చుట్టు ముట్టిన సరభకికుల్లో యిద్దర్ని కత్తితో నరికి, అడవి లోపలికి పరిగెత్త సాగాడు. చిన్న గడేజంగ్ కూడా శత్రువుల మధ్య నుంచి దారి చేసుకుంటూ ముసలి వాణ్ణి అనుసరించాడు.

ఈలోపల కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడు కూడా, ఇక సరభకికులతో నిలిచి యుద్ధం చేయటం ప్రమాదం అని గ్రహించి, ఒకళ్ళకొకళ్ళు రక్షణగా పోరుతూ, కలిసికట్టుగా నిలబడి గుబురు చెట్ల కేసి పోసాగారు. కాని, సరభకికులు







మరింతగా కేకలు పెడుతూ వాళ్ళను చుట్టుముట్టేందుకు ముందుకు వస్తున్నారు.

"ఆ దుర్మార్గులందర్నీ...కేశవుడితో సహా నరకండి. వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని చూసి లాభం లేదు. వాడు అది అవకాశంగా తీసుకుని మనవాళ్ళ నందర్నీ ఊచకోత కోస్తున్నాడు," అంటూ చండమండూకుడు అరిచాడు.

"కేశవుణ్ణా...చంపటమా? హా, కాలభైరవా, రాకాసిలోయా!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా మూలిగాడు.

తన అనుచరులు కేశవుడి చేతిలో చావటం చూస్తున్న మండూకుడికి, ఆ మూలుగు, ఎక్కడలేని కోపాన్ని తెప్పించింది. వాడు కళ్ళెర్ర చేసి, తన చేతి కర్రతో బ్రహ్మదండి డొక్కలో ఒక్క పోటు పొడుస్తూ, "ముసలి మంత్రాల పీనుగా! నువ్వు, ఈ లంకకు మహమ్మారిలా దాపురించావ్. అర్ధరాజ్యం, ధనరాసులూ అంటూ నాకు ఆశ చూపి, నా అనుచరులందర్నీ, ఆ కేశవుడి కత్తికి బలి అయేలా చేస్తున్నావ్. నిన్ను బతికుండగానే చర్మం వలిపించి, డప్పు కట్టిస్తాను," అన్నాడు.

మండూకుడి కర్ర దెబ్బ తింటూనే బ్రహ్మదండి పెద్దగా కేక పెట్టి, "నరభక్షకేశ్వరా! తమ కొయ్య కరవాలంతో అంత ధాటీగా పొడవకండి. నేను శరీరంలో ప్రాణం వుండికాక, కేవలం మంత్రాల బలంతో బతుకుతున్నాను. తమరు శెలవిచ్చినట్టు నేను, ముసలి...వయోవృద్ధుణ్ణి కాను; మంత్ర వృద్ధుణ్ణి!" అన్నాడు.

"ఏడ్చి మొత్తుకున్నావ్! అంత మంత్ర శక్తి వున్నవాడివైతే, అదుగో, ఆ కేశవుడూ వాళ్ళు, నా అనుచరుల్నుంచి తప్పుకుని అడవిలోకి పారిపోతున్నారు. వాళ్ళను నిలువరించు, చూదాం!" అన్నాడు మండూకుడు, చేతికర్రను మరోసారి బ్రహ్మదండి డొక్కకేసి గురిపెట్టి.





బ్రహ్మదండి రెండు చేతులతో మండూకుడికి నమస్కరించి, వణికిపోతూ, "నరభక్షక శమంతకమణీ! తమ హస్తదారుకాన్ని కాస్త వెనక్కు మళ్ళించండి. సరి...కావాలంటే ఆ కేశవుణ్ణి వాడి అనుచరులనూ వున్న చోటునే నిలువునా భస్మం చేయగలను. ఈ లంకను అలా గాలిలోకి లేపి క్షీరసాగరం మధ్య దించగలను. అష్టగ్రహకూటమి కల్పించి, సముద్రాలను పొంగించి, లోకాన్ని......"

బ్రహ్మదండి వాచాలతకు రెచ్చిపోయిన చండమండూకుడు తన చేతికర్రతో అతడి భుజాన గట్టిగా ఒక్క పోటు పొడిచి, "ఇకనీ వాగుడు కట్టిపెట్టు!" అంటూ తన కేసి పరిగెత్తి వస్తున్న అనుచరులను కలుసుకునేందుకు ముందుకు నడిచాడు.

రొప్పుతూ రోస్తూ వచ్చిన నలుగురైదుగురు నరభక్షకులు తమవంటి మీది గాయాలను, చండమండూకుడికి చూపుతూ, "మహామండూకా! మా చేతనైనదంతా చేశాం. కాని ఆ దుర్మార్గులు మన వాళ్ళల్లో చాలా మందిని చంపి, మండూక పర్వతాల కేసి పారిపోయారు," అన్నారు.

చండమండూకుడు ఆ మాటలు వింటూనే నిలువెల్లా కంపించాడు. అతడికి కేశవుడూ, జయమల్లుల నుంచి తనకు





ప్రాణగండం కలగ వచ్చునన్న భయం పట్టుకున్నది. ఒకసారి వాళ్ళ నుంచి ఎలాగో చావు తప్పించుకు పారిపోగలిగాడు. పైగా వాళ్ళకు తన రహస్య సొరంగం గురించి కూడా తెలిసిపోయింది...

"ఆ దుర్మార్గులు ముగ్గురూ కొండల్లోకి పారిపోయారు! ఈ ముసలివాడూ, వాడి వెంట వున్న కోయ వెధవా, అడవుల్లోకి పారిపోయారు! ఇంతమంది మీరుండి, వాళ్ళ నెలా పారిపోనిచ్చారు?" అంటూ మండూకుడు తన అనుచరుల్ని నానా తిట్లూ తిట్టి, "ఇక వెళ్ళండి! రేపు సూర్యోదయం లోపల వాళ్ళు అయిదుగురినీ



గాలించి పట్టుకురావాలి. వాళ్ళ శవాలను నాకు తెచ్చి చూపినా ఫరవాలేదు. అలా జరగక పోయిందో..." అంటూ చేతి కర్రను గట్టిగా తాటించాడు.

"ఆ కేశవృష్ణి మాత్రం..." అంటూ ఏమో చెప్పబోయిన బ్రహ్మదండి, మండూకుడి రౌద్రాకారం చూసి గట్టిగా నోరు మూసుకున్నాడు. మండూకుడు ఆశ్చర్యంగా చుట్టూ కలయ చూసి, తరవాత బ్రహ్మదండి కేసి తల తిప్పి, "అన్నట్టు నీ అంగరక్షకు లిద్దరూ ఎక్కడా కనిపించరేం? వాళ్ళేటయినా పారిపోలేదు గదా!" అన్నాడు అనుమానంగా

చండమండూకుడి మాటలు వింటూనే బ్రహ్మదండి ఉలిక్కి పడ్డాడు. అతడికి యింతవరకూ జిత, శక్తి వర్మలను గురించిన ఆలోచనే రాలేదు. తనను ఈ నరభక్షకులకు వదిలి, వాళ్ళిద్దరూ క్షేమంగా ఈ లంక నుంచి పారిపోయారా అన్న అనుమానం అతడికి కలిగింది. ఆ వెంటనే బ్రహ్మదండి పెద్దగా గొంతెత్తి, "జితా, శక్తీ! ఎక్కడ?" అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే అల్లంత దూరాన వున్న చెట్ల మీది నుంచి, "వస్తున్నాం బ్రహ్మదండీ, వస్తున్నాం!" అంటూ జిత, శక్తి వర్మలు











బదులు కేక పెట్టి, కోతుల్లా కొమ్మల్లో నుంచి కిందికి దూకారు.

"అక్కడ యింత భయంకర పోరు జరుగుతూంటే, మీరు పిరికిపందల్లాగా చెట్లల్లో దాక్కున్నారన్నమాట!" అన్నాడు చండమండూకుడు కోపంగా.

"చెట్లల్లో దాక్కోవటమా! మేమా?" అంటూ జీత శక్తివర్మలు జబ్బలు చరుస్తూ వచ్చి, "ఆ జయమల్లు ఎడమ చేతిని నరికిం దెవరు? ఆ ముసలివాడి ముక్కు ఎగిరి కిందపడేలా కత్తి విసిరిందెవరు? మేమే! మేమే!" అన్నారు.

చండమండూకుడు వాళ్ళిద్దరి కేసి అనుమానంగా చూశాడు. బ్రహ్మదండి ముఖం చిట్లించి, "అలాగా, అహాఁ! నే ననుకుంటూనే వున్నాను. మీరు శూరులు, వీరులు! సరే, యిక వెళ్ళి ఆ దుర్మార్గులు కొండల్లోకి పారిపోయారట, వెతికి పట్టుకు రండి!" అంటూ మండూకుడు చూడకుండా వాళ్ళకు సౌంజ్ఞ చేశాడు.

బ్రహ్మదండీ, చండమండూకుడూ ఈ విధంగా యిక్కడ గొడవ పడుతూంటే, నరభక్షకుల నుంచి తప్పుకు పారిపోయిన కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ లంకలోని కొండ ప్రాంతాలకు చేరి, దాక్కునేందుకు అనువైన గుహ కోసం వెతకసాగారు. ఒక్క కేశవుడికి తప్ప, తతిమ్మా యిద్దరికీ నరభక్షకులతో జరిగిన పోరులో గాయాలు తగిలినై. అన్నీ చిన్నచిన్న గాయాలు, పెద్ద ప్రమాదమైనవేం కాదు. కోయయువకుడు తనకు తెలిసిన మూలికలూ, ఆకులూ కలిపి తన గాయాలకూ జయమల్లు గాయాలకూ, కట్లు కట్టాడు.

కొండ దిగువ నుంచి వస్తున్న హెచ్చరికలూ, కేకలా వల్ల నరభక్షకులు తమను పట్టుకునేందుకు కొండలు గాలిస్తున్నారని కేశవుడికీ, అతడి అనుచరులకూ తెలిసిపోయింది. కేశవుడికి తన తండ్రిని గురించిన





విచారం పట్టుకున్నది. అతడు నరభక్షకులకు దొరకకుండా పారిపోయి వుంటాడా?

"కేశవా! నీ తండ్రిని గురించి దిగులు పెట్టుకోకు. అతడు మనలాగే అడవుల్లోకి పారిపోయి వుంటాడని నా నమ్మకం. ఇదుగో, మనం ఈ గుహలో దాక్కుందామా?" అంటూ జయమల్లు అక్కడ రాళ్ళలో వున్న చిన్న కంతలో నుంచి లోపలికి చూశాడు.

మనిషి పట్టీపట్టనంత సన్నగా వున్న కంతలో నుంచి మెల్లిగా దూరబడి ముగ్గురూ ఆ వెనక కొంచెం విశాలంగా వున్న గుహలోకి వెళ్ళారు.

గుహలో అడుగు పెడుతూనే కోయ యువకుడు ఎగిరి గంతేసి, "ఇక్కడేవో రెండు శవాలున్నవి!" అన్నాడు భయంగా.

జయమల్లు గుహ లోపలి భాగంలోకి పరకాయించి చూశాడు. అక్కడ అతడికి రెండు మానవ కంకాళాలు కనిపించినై.

అతడు నవ్వుతూ కోయయువకుడికేసి తిరిగి, "అవి శవాలు కాదు; పట్టి బొమికల గూళ్ళు. భయపడకు. వాటికి సున్నం పోగులకూ తేడా ఏమీలేదు, మనం..."

జయమల్లు మాట పూర్తి చేసే లోపలే 'బుస' మంటూ పెద్ద శబ్దం అయింది. ఆ మరుక్షణాన ఫెళఫెళ మంటూ ఒక రాయి గుహ వెనక నుంచి లోపలికి దఢీ మంటూ పడింది. గుహ అంతా వెలుగుతో నిండిపోయింది. కేశవుడూ అతడి అనుచరులూ అక్కడికి పరిగెత్తి బయటికి తొంగి చూశారు. వాళ్ళకు కలిగిన భయాశ్చర్యాలు అంతా యింతా కాదు.

ఒక మహాసర్పం, వాళ్ళు కనీ వినీ ఎరుగని ఒక భయంకర మృగంతో చావు బతుకుల పోరు జరుపుతున్నది. సర్పం కొట్టే బుసలూ, భయంకర మృగం పెట్టే అరుపులూ విని ముగ్గురూ ప్రాణభయంతో తల్లడిల్లి పోయారు. —(ఇంకా వుంది)








## 22

[కేశవుడూ, అతడి వెంటవున్న వాళ్ళకు, కేశవుడి ముసలితండ్రి, అతడి అనుచరుడు కోయ యువకుడూ కనిపించారు. కాని, అక్కడ నరభక్షకులతో జరిగిన యుద్ధంలో, తిరిగి ఎటువాళ్ళటు పారిపోయారు. కొండ శిఖరాన్ని చేరిన కేశవుడూ, అతడి అనుచరులకు ఒక మహా సర్పం, ఒక భయంకర మృగంతో చేస్తున్న పోరాటం కనిపించింది. తరవాత–]

కేశవుడూ, జయమల్లూ గుహలో ఏర్పడిన కంత నుంచి బయటికి చూస్తూంటే, కోయ యువకుడు గుహలోని చీకటి కోణాలన్నీ వెతకసాగాడు. అతడికి ఒక మూల కొన్ని విల్లంబులు కనిపించినై. అతడికి ఎక్కడ లేని ధైర్యం కలిగింది. ఒక విల్లు చేతికి తీసుకుని, దానికి తాడు తగిలించి, అంబుల పొదిని భుజాన వేసుకుని, వాడు కేశవుడూ, జయమల్లుల దగ్గిరకు వెళ్ళాడు.

జయమల్లు కోయయువకుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "గోమాంగ్! అవన్నీ ఎక్కడివి? బాణం ఎక్కుపెట్టుతున్నావెందుకు? దానితో భయంకర మృగాన్ని చంపాలనుకుంటున్నావా?" అని అడిగాడు.

కోయుగోమాంగ్ అవునన్నట్టు తలవూపి, బాణాన్ని వదలబోయేంతలో కేశవుడు చప్పున వెనుదిరిగి, అతడి చెయ్యి పట్టుకుని, "నువ్వు చెయ్యబోయేది చాలా ప్రమాద







కరమైనపని. నీ బాణం దెబ్బకు ఆ రెంటిలో ఏదీ చావకపోగా, అవి రెండూ కలిసి మన మీదికి విరుచుకుపడినా పడవచ్చు. వాటి నెందుకు రెచ్చకొట్టటం? అసలు ఈ విల్లంబులు నీ వెక్కడ సంపాయించావ్?" అని ప్రశ్నించాడు.

కొయుగేమాంగ్ గుహలోని ఒక చీకటి మూలకు చేయి చూపాడు. కేశవుడు అక్కడికి పరిగెత్తి, ఒక విల్లూ, కొన్ని అంబులూ చేతికి తీసుకుంటూ, "అవి యీ సమయంలో మనకెంతో అవసరం. కత్తులు తప్ప అన్నీ పోగొట్టుకున్నాం. ఇక గుహ నుంచి బయటపడదామా?" అన్నాడు.



"ఈ బాణాలూ యివీ బహుశా, అక్కడ వున్న రెండు కంకాళాల తాలూకువయి వుంటవి. వీళ్ళిద్దరూ యిక్కడికి ఎందుకు వచ్చినట్టు? ఎలా మరణించినట్టు?" అన్నాడు జయమల్లు.

"ఆ ప్రశ్నకు జవాబు కనుక్కునేలోపల మనంకూడా వాళ్ళతో చేరిపోవలసి రావచ్చు. ఆ తరవాత మన వెనక వచ్చినవాళ్ళు, మన కంకాళాలను చూసి, యిలాంటి ప్రశ్నలే వేసుకుంటారు!" అన్నాడు కేశవుడు విసుగ్గా.

జయమల్లు ఏదో చెప్పబోయేంతలో, గుహ వెనకభాగం మీదికి, భయంకర మృగం, మహాసర్పం ఉప్పెనలా వచ్చి పడినై. వాటి తాకిడికి గుహ అంతా కంపించి పోయింది. కేశవుడూ, అతడి అనుచరు లిద్దరూ గుహలో బోర్లాపడిపోయారు. గుహ మధ్య భాగం రెండుగా విచ్చిపోయి, ఫెళ ఫెళ మంటూ రాళ్ళూరప్పలూ అందులోకి దొర్లుకుపోయినై. కేశవుడూ, అతడి స్నేహితులు కూడా వాటి వెంట కింద అగాధంలోకి పడిపోయారు.

ముగ్గురికీ దెబ్బలు తగిలినై. శరీరమంతా రాళ్ళ మధ్య పడటంతో గీచుకుపోయింది. కాని, వాళ్ళ కత్తులూ, విల్లంబులూ వాళ్ళతో పాటు కింది అగాధంలోకి పడిపోయినై.








ముగ్గురూ ఒళ్ళు దులుపుకుంటూ లేచి నిల బడ్డారు. ఇంత ప్రమాదంలో చిక్కినా, ఏకాలో చెయ్యో విరగనందుకు, వాళ్ళు చాలా సంతోషించారు.

"మనం గొప్ప అదృష్టవంతులం!" అన్నాడు కేశవుడు.

"అందుకేం సందేహం! కాని, ఈ చీకటి కొన లోంచి బయటపడటం ఎలా? అదీ యిప్పటి సమస్య!" అన్నాడు జయమల్లు.

కొయగోమాంగ్, అగాథం వెంట కొంచెం దూరం మోకాళ్ళ మీద పాకిపోయి, ఒక మలుపు తిరిగి, "కేశవా, జయా! మనకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు. మనం కొండ పొట్టలోని గుహ కందరాల్లో చిక్కుకు పోయాం. కాని, ఎక్కడినుంచో కొంచెం వెలుగు వచ్చి పడుతున్నది. మనం సుర క్షితంగా యిక్కణ్ణించి బయటపడొచ్చు." అన్నాడు. గోమాంగ్ మాటలు వింటూనే కేశవుడూ, జయమల్లూ ఆత్రంగా అతడున్న చోటుకు పరిగెత్తారు. వాళ్ళకూ అంత దూరానవున్న సొరంగంలో కొద్దిపాటి వెలుగు కనిపించింది. కాని, అది ఎటునుంచి వస్తున్నదో మాత్రం అర్థం కాలేదు.

"సరే, యిక మనం బయలుదేరుదాం. యిక్కడ ఎటు చూసినా గుహ మార్గాలు కనిపిస్తున్నవి. దేని వెంట వెళితే, మనం బయలు ప్రదేశాన్ని చేరగలమో అర్థం కావటంలేదు," అన్నాడు జయమల్లు.

కేశవుడు మౌనంగా ముందుండి దారి తీశాడు. అతడికి తన ముసలితండ్రిని గురిం చిన దిగులుతోపాటు, యిప్పటి తన స్థితి కూడా దిగులు పుట్టిస్తున్నది. బహుశా, యిక్కడ అడ్డదిడ్డంగా వున్న సొరంగ మార్గాల్లో చిక్కుకుని, తనూ, తన స్నేహితు లిద్దరూ మరణించవచ్చని కూడా అతడు భావించాడు.

ముందు నడుస్తున్న కేశవుడికి కొంత దూరం పోయిన తరవాత, హఠాత్తుగా







మార్గం రెండు మూడు వైపులకు చీలి పోవటం కనిపించింది. తను వాటిల్లో దేని వెంట వెళ్ళాలి? అన్న ప్రశ్న ఆతడికి ఎదురయింది. ఆతడి తటపటాయింపు గ్రహించిన వాడిలా వెనకవున్న జయమల్లు, "కేశవా! ఆలోచించేందుకేముంది? ముక్కుకు సూటిగా నడువు. ఈ కాస్త గుడ్డివెలుగు వున్నంతవరకూ, మనం నిరాశ చెందనవసరంలేదు," అన్నాడు.

జయమల్లు మాట ముగించేలోపల, ఎడమవైపునున్న సొరంగ మార్గాన్నుంచి కీచుమన్న వికృత ధ్వని వినిపించింది. ఆ వెంటనే రెక్కలల్లాడినప్పుడయే తపతపమనే ధ్వనిలాటి శబ్దం వినబడింది. కేశవుడు చప్పున కత్తి దూసి మార్గం మలుపు తిరిగి నిశ్చేష్టుడయిపోయాడు. అతడి వెనకవున్న జయమల్లుకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. కోయగోమాంగ్ 'దయ్యం' అంటూ కీచుమన్నాడు. జయమల్లు బిగ్గరగా నవ్వాడు. కేశవుడు తన అంబుల పొది కేసి చేయి పోనిచ్చాడు. గోమాంగ్, ఆ సరికే బాణం ఎక్కుపెట్టి వున్నాడు.

సొరంగ మార్గంపైన ఎగుడుదిగుడుగా వున్న రాళ్ళమీద నిలువెత్తునవున్న ఒక నల్లని ఆకారం తారట్లాడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో కూడా ఆ ఆకారం నోటిపళ్ళు తళతళ మెరుస్తున్నవి.

"గోమాంగ్, అది దయ్యం కాదు, దయ్యపు గబ్బిలం! బాణం ఎక్కుపెట్టావు గదా, గురిగా దాని తలమీద తగిలేలాకొట్టు!" అన్నాడు జయమల్లు. అదే క్షణంలో గోమాంగ్ వదిలిన బాణం రివ్వుమంటూ వెళ్ళి, దయ్యపు గబ్బిలం తలను తాకింది. గబ్బిలం కీచుమంటూ అరిచి పల్లటీలు కొడుతూ కిందపడిపోయింది.

గోమాంగ్ ముందుకు వెళ్ళి గిలాగిలా కొట్టుకుంటున్న గబ్బిలాన్ని ఒక అంబుతో పొడిచి చూస్తూ, "అడవిలో పుట్టి అడవిలో





పెరిగిన వాణ్ణయినా, ఇంత పెద్ద గబ్బిలాన్ని నే నెన్నడూ చూడలేదు," అన్నాడు.

"ఆ మాట కొస్తే, నేనూ చూడలేదు. మన మేదో ఒక వింత ప్రపంచంలోకి వెళు తున్నామని నా అనుమానం," అన్నాడు జయమల్లు.

"బహుశా, యిదే రాకాసిలోయకు వెళ్ళే మార్గమేమో!" అన్నాడు కేశవుడు.

"మీకేమైనా అరుపులు...తోడేళ్ళ అరుపుల్లాంటివి, వినబడుతున్నాయా?" అని ప్రశ్నించాడు, కోయగోమాంగ్.



కేశవుడూ, జయమల్లూ ఓ క్షణకాలం ఆగి, "అవును, ఏవో జంతువులు మొరుగుతున్న ధ్వని అస్పష్టంగా వినబడుతున్నది," అన్నారు ఆశ్చర్యంగా.

"అయితే యిక మనం బతికి బయట పడ్డట్టే. తోడేళ్ళున్నచోట, కావలసినంత వేట వుంటుంది. తినేందుకు కొల్లలు కొల్లలు!" అన్నాడు గోమాంగ్ ఉత్సాహంగా.

"ముందు మనం గజిబిజిగా వున్న, ఈ సొరంగమార్గాల నుంచి బయటపడ్డప్పుడు గదా, తిండి మాట," అన్నాడు కేశవుడు.

"నావి పాము చెవులు! నన్ను దారి తీయనియ్యండి. సూటిగా ఆ తోడేళ్ళ మంద మధ్యకి తీసుకుపోతాను," అంటూ గోమాంగ్ చెవులు రిక్కించి, తోడేళ్ళ అరుపులు ఏవైపు నుంచి వస్తున్నవో పసిగడుతూ ముందు నడవ సాగాడు. నాలుగైదు నిమిషాల కాలం సొరంగ మార్గాల్లో నడిచిన తరవాత, వాళ్ళకు హఠాత్తుగా ఒక గుహ వైపు నుంచి కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు కనిపించింది. ముగ్గురూ ఉత్సాహంతో ఎగిరి గంతులేశారు. గుహ బయట చిన్నచిన్న పొదలూ, కొంచెం దూరంలో పెద్దపెద్ద చెట్లూ వాళ్ళ కంట బడినై. తోడేళ్ళ అరుపులు కూడా మరింత దగ్గిరగా వినిపించసాగినై.

కేశవుడూ, అతడి అనుచరులూ వెలుగు వస్తున్న గుహ ద్వారం నుంచి బయటికి





వచ్చారు. గుహ ముందు ఒక పక్కగా సమతలంగా వున్న ప్రదేశంలో, పది పన్నెండు జింకలూ, కొన్ని లేళ్ళూ మందగా నిలబడి వున్నవి. వాటి చుట్టూ గుండ్రంగా తిరుగుతూ నాలుగు తోడేళ్ళు పెద్దగా అరుస్తున్నవి. తమను సమీపించవచ్చే తోడేళ్లను, మెలితిరిగిన కొమ్ములు గల జింకలు కొన్ని తలలు వంచి పొడిచేందుకు ప్రయత్నిస్తున్నవి. "తోడేళ్ళను ఎదిరించే జింకలను, నేనెక్కడా చూడలేదు," అన్నాడు జయమల్లు.

"అది నీ దురదృష్టం. ప్రాణరక్షణకు, తోడేలును చంపిన కొండ గొర్రెను నేను చూశాను," అన్నాడు కోయగోమాంగ్. వాళ్ళీ విధంగా మాట్లాడుకునేంతలో తోడేళ్ళ దృష్టి వాళ్ళమీద పడింది. అవి చప్పున జింకల చుట్టూ తిరిగేవల్లా ఆగి, కోరలు చూస్తూ, ఆ ముగ్గురికేసి రాసాగినై. కేశవుడు బాణం ఎక్కుపెట్టి ఒక తోడేలును కొట్టాడు. బాణం గుండెల్లో తగలగానే, తోడేలు పెద్ద పెట్టున అరిచి, ఎగిరి అంత దూరాన పడింది. మిగతా తోడేళ్ళు భయంకరంగా మొరుగుతూ కేశవుడూ వాళ్ళున్న చోటుకు పరిగెత్తిరాసాగాయి. గోమాంగ్, జయమల్లు కూడా బాణాలు ఎక్కుపెట్టి వదిలారు. గోమాంగ్ దెబ్బకు మరొక తోడేలు కింద





పడింది. తత్తిమ్మా తోడేళ్ళు రెండూ ఒక్క క్షణం నిలబడి, తరవాత పెద్దగా మొరిగి, బండరాళ్ళ మీది నుంచి దూకుతూ అడవి లోకి పారిపోసాగినై.

కోయ గోమాంగ్ పెద్దగా నవ్వి, "అరె, జింకలూ, లేళ్ళూ ఎక్కడ?" అంటూ ఆశ్చర్యపడ్డాడు.

"నువ్వు చూడలేదా? అవి ఎప్పుడో పారిపోయినై. తోడేళ్ళ బారినుంచి తప్పుకుని, మన బారిన పడేందుకవేమీ తెలివి తక్కువవి కావు," అన్నాడు కేశవుడు.

"నాకు చచ్చే ఆకలేస్తున్నది. దొరికితే ఒక లేడిని తినేయగలను," అన్నాడు గోమాంగ్.

"అందరికీ ఆకలిగానే వుంది. కాని, మనం మండూకుడూ, బ్రహ్మదండి అనుచరుల్నుంచి ప్రమాదం రాకుండా చూసుకోవాలి. వాళ్ళు మన కోసం కొండలూ, గుట్టలూ గాలిస్తున్నారు," అన్నాడు జయమల్లు.

కోయ గోమాంగ్ చుట్టూ ఓమారు కలయ చూసి, "నన్నడిగితే, అసలిది నరభక్షకుల లంకే కాదంటాను. ఇక్కడి చెట్టూ చేమలూ, ఈ కొండ తీరూ అంతా భిన్నంగా వున్నది. ఏమంటావ్, కేశవా?" అన్నాడు.

కేశవుడు కూడా చుట్టూ పరీక్షగా చూసి, "మనం బహుశా, కొండ గుహల్లో కందరాల్లో పడి, మరో లంకకో, దేశానికో చేరినా చేరి వుండొచ్చు. అయినా, మన జాగ్రత్తలో మనం వుండాలి," అంటూ జయమల్లు కేసి తిరిగి, "మల్లూ, మా అయ్య నరభక్షకులకు దొరక్కుండా పారిపోయి వుంటాడంటావా?" అని ప్రశ్నించాడు.

"ఊఁ, అందుకు సందేహమా? మీ అయ్యకన్న జిత్తులమారిని నే నెక్కడా చూడలేదు. చెట్ల మీద వుండి, అంతమంది నరభక్షకుల్ని ఎలా హడలకొట్టాడో చూశావు గదా? ఆ వెంట వున్న చిన్న గడేజంగ్





ధైర్యసాహసాల్లో సింహం అంటే నమ్ము," అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలతో కేశవుడికి కొత్త ఉత్సాహం కలిగింది. అతడు అడవి కేసి చూస్తూ, "మనం ముందు ఏదైనా ఆహారం సంపాయించాలి. నాకు దాహంకూడా అవుతున్నది. ఈ దగ్గిర్లో ఎక్కడో నీరుండక పోదు," అంటూ ముందుకు నడిచాడు.

ముగ్గురూ కొండ సమీపాన్నుంచి, నిశ్శబ్దంగా కదిలి అడవిలోకి నడవసాగారు. అప్పటికి సూర్యుడు కొంచెంగా పడమటి దిక్కుకు వాలాడు. ముగ్గుర్నీ ఆకలి బాధిస్తున్నది. చెట్లనేమైనా పళ్ళుగాని, తేనె తుట్టెలుగాని దొరుకుతవేమో అని గోమాంగ తల ఎత్తి పరీక్షగా చూస్తూ నడవసాగాడు. అట్లా నడుస్తున్న గోమాంగ హఠాత్తుగా ఒక కాలు భూమిలోకి గుచ్చుకుపోవటంతో పెద్దగా కేక పెట్టాడు. పక్కనే వున్న జయమల్లు అతడి జబ్బ పుచ్చుకుని వెనక్కు లాగాడు.

చూడటానికి సమతలంగా వున్న ఆ ప్రదేశంలో, ఏ కారణంవల్ల గోమాంగ ఊబిలో చిక్కుకున్నవాడిలా ముందుకు పడబోయాడో వాళ్ళకు అర్థంకాలేదు. కేశవుడు అక్కడ అడ్డదిడ్డంగా పడివున్న చెట్ల కొమ్మల్నీ, రెమ్మల్నీ తొలిగించాడు. దిగువను వాళ్ళకు ఒక గొయ్యి కనిపించింది. అందులో నిలువునా పాతివున్న గసిక కర్రల మీద ఒక పులి కొన వూపిరితో కొట్టుమిట్టాడుతున్నది.

"ఇది, మనుషుల కోసమో, జంతువుల కోసమో ఎవరో పెట్టిన మాటు. కాస్తలో ప్రమాదం తప్పుకున్నాం," అన్నాడు కేశవుడు. అదేసమయంలో అన్ని వైపులనుంచీ, రాళ్లూ, కర్రలూ వాళ్ళమీదకు జడివానలా వచ్చి పడసాగినై. కేశవుడూ, అతడి అనుచరులూ విల్లంబులు పైకెత్తి, భూమిమీద బోర్లా పడుకుని, చుట్టూ కలయ చూడసాగారు. ఎక్కడా మనిషి జాడ లేదు.

—(ఇంకా వుంది)








## 23

[కేశవుడూ, అతడి అనుచరులు గుహ కందరాల్లో పడి, తిరిగి తిరిగి కొంత సేపటికి బయిటికి వచ్చారు. జింకలను చంపేందుకు కాట్లాడుతున్న కొన్ని తోడేళ్ళు వాళ్ళ మీద పడినై. వాటిని చంపి, ముగ్గురూ అడవిలోకి బయలు దేరేంతలో, అన్ని వైపుల నుంచి రాళ్ళూ, కర్ర ముక్కలూ జడివానలా వాళ్ళ మీదికి వచ్చి పడసాగినై. తరవాత]

కేశవుడు తను దాక్కున్న రాతి చాటు నుంచి మెల్లిగా పాకుతూ, జయమల్లూ, కోయ గోమాంగ్‌లు వున్న చోటుకు వెళ్ళి చిన్న గొంతుతో, "జయమల్లూ! మనం తిరిగి నరభక్షకుల వాతపడలేదు గదా?" అని ప్రశ్నించాడు.

జయమల్లు అడ్డంగా తలాడిస్తూ, "వీళ్ళు నరభక్షకులై వుండరు. ఇంత నిశ్శబ్దంగా, మన కంటికి కనపడకుండా దాగివుండి, మన మీద దాడి చేస్తున్నారంటే, వీళ్ళెవరో మరొకజాతి మానవులు. నరభక్షకులైతే పెద్ద రణగొణధ్వని చేసేవాళ్ళు," అన్నాడు.

కేశవుడు మరేదో మాట్లాడబోయేంతలో రాళ్ళుపడటం ఆగిపోయింది. ఒకటి రెండు క్షణాల నిశ్శబ్దం తరవాత, జయమల్లు వున్నచోటు నుంచి మోకాళ్ళమీద లేచి, ముందుకు చూశాడు. అతడితోపాటు కేశవుడూ, కోయగోమాంగ్ లేవబోయేంతలో,








చెట్ల చాటు నుంచి పెద్ద కేక వినబడింది: "వాళ్ళ ముగ్గుర్నీ ప్రాణాలతో పట్టుకోండి. రెక్కల మనుషులకు యిద్దాం. మన జాతి వాళ్ళు ముగ్గురు బతికినా బతికినట్టే!"

రెక్కల మనుషులు, మన జాతివాళ్ళు, అన్న మాటలు వింటూనే, జయమల్లు ఎగిరి లేచి నిలబడి, "ఇక అడవి లోపలికి పరిగెత్తుదాం రండి," అంటూ గుబురుగావున్న చెట్ల కేసి పరిగెత్తసాగాడు. కేశవుడూ, కోయగోమాంగ్ అతణ్ణి అనుసరించబోయేంతలో, దుక్కలా వున్న ఒక అడవిజాతివాడు పెద్ద కర్రతో గోమాంగ్ మీదికి వచ్చాడు. గోమాంగ్ ఆ కర్రతోనే, వాణ్ణి మెడ మీద గట్టిగా పొడిచి ముందుకు పరిగెత్తాడు. కేశవుడు కూడా అతణ్ణి అనుసరించాడు.

అడవిలోకి చాలా దూరం పరిగెత్తిన తర వాత ముగ్గురూ రొప్పుతూ రొస్తూ ఒక చెట్టు కింద కూచున్నారు. శత్రువులు తమను తరుముకురావటం లేదన్న నమ్మకం వాళ్ళకు కలిగింది. 'రెక్కల మనుషులు' అన్న మాట కోయగోమాంగ్‌కు బెదురు పుట్టించింది. అతడు కేశవుడి కేసి భయంగా చూస్తూ, "కేశవా, ఆ అడవిజాతివాళ్ళు అన్న మాటలు విన్నావు గదా? వాళ్ళకు రెక్కల మనుషులు తెలుసు!" అన్నాడు.

"అవును, రెక్కలమనుషు లేమిటి? ఇదేదో వింతగా వున్నదే!" అన్నాడు కేశవుడు.

"మీ యిద్దరూ అలాంటివాళ్ళు వున్నారని ఎప్పుడూ వినలేదా?" అని ప్రశ్నించాడు కోయగోమాంగ్.

కేశవుడూ, జయమల్లూ కూడా లేదన్నట్టు అడ్డంగా తలలు వూపారు.

"పక్షుల్లా ఎగిరే, రెక్కల మనుషులనే వాళ్ళు వున్నారు. కాని, ఎక్కడ వున్నారో మాత్రం మా కోయవాళ్ళకు తెలియదు. వున్నట్టు మాత్రం విన్నాం. వాళ్ళు మహా క్రూరులు," అన్నాడు కోయగోమాంగ్.







"పక్షుల్లాగా ఎగిరే మనుషులు వుండటం అసంభవం. నేను నమ్మను," అన్నాడు జయమల్లు.

"అయితే, ఆ అడవి మనుషులు వేసిన కేక అర్థం ఏమిటి?" అన్నాడు కేశవుడు.

"ఏమో! నా కర్థం కావటంలేదు," అంటూ జయమల్లు లేవబోయేంతలో, "అయ్యో, రెక్కలమనిషి, చచ్చాం!" అన్న పెద్ద ఆర్తనాదం వినబడింది.

ఆ ఆర్తనాదం వింటూనే ముగ్గురూ అటు కేసి పరిగెత్తారు. ఒక అడవిమనిషి ప్రాణ భయంతో వణికిపోతూ అరుస్తున్నాడు. అతడికి కొంచె ముందుగా నడుస్తున్న మరొకణ్ణి, చెట్టుకొమ్మ మీది నుంచి దూకిన పక్షిలాంటి పెద్ద ఆకారం ఒకటి, అంత ఎత్తుకు లేపి, దూరంగా విసిరివేసింది.

"రాకాసిపక్షి!" అంటూ కోయగోమాంగ్ కేకపెట్టాడు. అంతలో ముగ్గురూ కేకలు పెడుతున్న అడవిమనిషిని సమీపించి, "నీ స్నేహితుణ్ణి రక్షించే ప్రయత్నం ఏమీ చెయ్యక, అలా ఊరికే గగ్గోలుపడి పోతావేం!" అన్నారు.

ఆ మాటలు వింటూనే అడవిమనిషి చప్పున వెనుదిరిగి చూసి, ప్రాణం తేరుకున్నవాడిలా ముఖంపెట్టి, "రెక్కలమని







షికి చిక్కినవాణ్ణి రక్షించటం ఎవరితరం అవుతుంది? పైగా, వాళ్ళు మా గుహ వాసుల మీద పగబట్టి వున్నారు. వాళ్ళ దేవత కోసం బలికి పంపవలసిన యిద్దర్ని మేం పంపలేదు." అన్నారు.

జయమల్లు అందరికన్న ముందుగా పరిగెత్తి, రెక్కలమనిషి విసిరివేసినవాణ్ణి సమీపించి, వాడిలో ఏమైనా ప్రాణం వుందో లేదో అని పరీక్షించి చూశాడు. కాని, వాడప్పటికే మరణించాడు.

"వీడు సగం భయంతో గుండెలాగి చచ్చాడని నా అనుమానం. అంత ఎత్తు నుంచి మనిషిపడితే, ఏ కాళ్ళు చేతులో విరగొచ్చు కాని, చావు యింత తొందరగా రాదు," అన్నాడు జయమల్లు.

"ఇంతకూ ఆ రెక్కలమనిషెక్కడ?" అంటూ కేశవుడు చెట్టుకొమ్మల్లోకి చూశాడు.

"వా డింకెక్కడుంటాడు? ఆకాశంలోకి ఎగిరిపోయాడు," అన్నాడు అడవిమనిషి.

జయమల్లు ఆలోచనలో పడ్డాడు. అడవిమనిషిని చంపినవాడు రెక్కలమనిషి అనేందుకు సందేహం లేదు. పొడవైన పెద్ద రెక్కలూ, మామూలు మనిషికి వున్నట్టు కాళ్ళూ చేతులూ వాడికి వున్నవి. వాడు నిజంగానే ఆకాశంలోకి ఎగిరిపోగలడా? మనిషైనవాడికి అదెలా సాధ్యం? లేక వాడు గొప్ప మంత్రవేత్తా?

"ఆ ఎగిరేమనుషులు ఎందరుంటారు? ఎక్కడుంటారు?" అని ప్రశ్నించాడు జయమల్లు, అడవిమనిషిని. వాళ్ళు చాలా మంది వున్నారనీ, కాని, సంఖ్య తెలియదనీ చెప్పి, వాడు జయమల్లుకు పడమటి దిక్కు చూపిస్తూ, "అదుగో, ఆ కొండల వెనక ఎక్కడో వాళ్ళుండే ప్రదేశం వున్నది. అక్కడకు వెళ్ళి ప్రాణాలతో తిరిగివచ్చినవాళ్ళెవరూ లేదు," అన్నాడు.

ఈ మాటలు వింటూనే జయమల్లు, కేశవుడి కేసి తిరిగి, "కేశవా! ఇందులో ఏదో



మోసం వున్నది. ఎగిరేమనిషంటూ ఎవడో ఒకడు...ఏ మంత్రశక్తివల్లనో, మరే అద్భుత సాధన వల్లనో వుండవచ్చుగాని—వందలా వేల సంఖ్యలో అలాంటి వాళ్ళు వుండేందుకు అవకాశంలేదు. ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలి," అన్నాడు.

"అలాగే చేద్దాం. ఆ ఎగిరేశక్తి ఎలా వస్తుందో గ్రహిస్తే, మనం దారి పొడుగునా ఈ ప్రమాదాలకు గురి కాకుండా, సూటిగా ఎగిరిపోయి రాగాసిలోయలో వాలవచ్చు," అన్నాడు కేశవుడు.

హఠాత్తుగా వాళ్ళు నిలబడి వున్నచోటుకు అన్ని వైపుల నుంచీ పెద్ద కలకలం బయలు దేరింది. కనుమూసి తెరిచేంతలో, నలభై యాభై మంది అడవిమనుషులు పెద్ద పెద్ద ఈటెలు ఊపుతూ వాళ్ళను చుట్టుముట్టి, అంత దూరాన్నుంచే, "లొంగిపొండి. పారి పోయేందుకు ప్రయత్నించారో, చంపుతాం!" అంటూ కేకలు పెట్టారు.

కేశవుడు చప్పున తమ పక్కన నిలబడి వున్న అడవిమనిషిని ముందుకు లాగి, అతడి వెనక బాణం ఎక్కుపెట్టి నిలబడ్డాడు. జయమల్లూ, కోయగోమాంగ్ కూడా చెరొక వైపుకూ తిరిగి అడవిమనుషుల కేసి బాణాలు గురిపెట్టారు. జయమల్లు కంచు కంఠంతో, "మేం ప్రాణాలతో మీకు దొరకటం కల్ల. మేం చచ్చే ముందు మీలో సగం మందిని చంపుతాం. మీతో మాకు శత్రుత్వం లేదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి," అని కేకపెట్టాడు. కేశవుడి ముందు నిలబడి వున్న అడవి మనిషి, తన జాతివాళ్ళ కేసి చేయి వూపుతూ, "వీళ్ళకేమీ హాని చెయ్యకండి. రెక్కల మనిషి నుంచి నన్ను కాపాడాడు," అని అరిచాడు.

"కావాలంటే మీ గుహవాసులందర్నీ, రెక్కల మనుషుల నుంచి కాపాడగలం. మా బాణాలకు యీ లోకంలో తిరుగు లేదు," అన్నాడు కేశవుడు.









అడవిమనుషులంతా ఒకళ్ళను చూసి మరొకళ్ళు ఈటెలు దించారు. వాళ్ళ నాయకుడైన వృద్ధుడు ఈటెను తల కిందులుగా పట్టుకుని ముందుకు వస్తూ, "నిజంగా మీరు మాకు రెక్కలమనుషుల నుంచి రక్షణ కల్పించగలరా? ఎంతో కాలంగా వాళ్ళ దేవతకు రోజుకు యిద్దరు చొప్పున మా జాతివాళ్ళను బలికి ఒప్ప చెపుతున్నాం," అన్నాడు.

"మీకు రక్షణ యివ్వటమే కాదు, మొత్తం ఆ రెక్కల మానవజాతిని సర్వనాశనం చేస్తాం. మా మాట నమ్మండి," అన్నాడు జయమల్లు.

అడవిమనుషుల నాయకుడు, తన ఈటెను దూరంగా విసిరివేశాడు. అతడి అనుచరులంతా తమ ఈటెలను కూడా అదే ప్రదేశంలో ఒక గుట్టగా పడవేశారు. కేశవుడూ, అతడి స్నేహితులూ విల్లంబులు దించారు. అడవిమనుషుల నాయకుడు కేశవుణ్ణి సమీపించి, అతడి విల్లును పరీక్షించి చూస్తూ, "ఇలాంటి ఆయుధాలు వాడటం మా చేతకాదు. రెక్కలమనుషుల్లో కొందరు వీటిని ఉపయోగించటం చూసినవాళ్ళున్నారు. మీరు నిజంగా వాళ్ళకు సమఉజ్జీలు. మాకు వాళ్ళ బెడద వదిలించండి. రోజుకు మా జాతి వాళ్ళిద్దర్ని పొట్టనపెట్టుకుంటున్నారు. మీకు మా చేతనైన సహాయం చేస్తాం," అన్నాడు.

"మీకు రాకాసిలోయకు దారి తెలుసా?" అన్నాడు కోయగోమాంగ్.

జయమల్లు కోపంగా అతణ్ణి వారించి, "ఆ సంగతులు మాట్లాడేందుకు యిది తగిన సమయం కాదు. సరే, రెక్కలమనుషులకు బలిగా రోజూ మీరు పంపే యిద్దర్నీ ఏ ప్రదేశంలో ఆ దుర్మార్గులకు ఒప్ప చెపుతారు?" అని అడిగాడు.

అడివిమనుషుల నాయకుడు తల ఎత్తి చెట్లచాటు నుంచి కొంచెంగా కనబడుతున్న







ఒక కొండ శిఖరాన్ని చూపుతూ, "ఆ ప్రదేశం యిక్కడికి అరకోసు దూరంలో వుంటుంది. చీకటి పడగానే, మేము నిర్ణ యించిన మా జాతి వాళ్ళిద్దరు అక్కడికి వెళతారు. వాళ్ళను ఆ రెక్కల మనుషులు ఎత్తుకు పోతారు," అని చెప్పాడు.

"ఆ దుష్టు లెంతమంది అక్కడికి వస్తారు? ఏ విధంగా మీరు బలికి పంపిన వాళ్ళిద్దర్నీ ఎత్తుకుపోతారు?" అని జయ మల్లు అడిగాడు.

"వాళ్ళెంతమంది వస్తారో, ఏ విధంగా ఎత్తుకు పోతారో చూసినవాళ్ళెవరూ లేరు. కాని, మా వాళ్ళను కాళ్ళతో పట్టుకుని, వాళ్ళు ఆకాశంలోకి లేచి పోతారని వదంతిగా చెప్పుకుంటారు. అందులో వున్న నిజం ఎంతో నాకు తెలియదు," అన్నాడు అడవి మనుషుల నాయకుడు.

"అయితే, యిక మీరు వెళ్ళి ఆ బలికి పంపేవాళ్ళను పంపండి. మా ప్రయత్నంలో మేముంటాం. రేపు ఉదయానికల్లా, మీరు పంపిన వాళ్ళిద్దర్నీ వెంట పెట్టుకుని రావటమేగాక, ఆ దుర్మార్గుల అసలు రహస్య మేమిటో కూడా తెలుసుకువస్తాం. అంతకూ, మీరుండే గ్రామం ఎక్కడ?" అని అడిగాడు జయమల్లు.



"మేము కొండ గుహల్లో నివసిస్తాం. మేము అనాదిగా గుహ వాసులం. మిమ్మల్ని కలుసుకునేందుకు రేపు సూర్యోదయానికల్లా యిక్కడికి వస్తాం," అన్నాడు గుహ వాసుల నాయకుడు. తరవాత అతడు తన అను చరులతో వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు కొండ శిఖరం కేసి నడిచారు. దారిలో కోయ గోమాంగ్ రెండు కుందేళ్ళను కొట్టి, వాటి కాల్చిన మాంసంలో తన స్నేహితు లిద్దరికి భాగం పెట్టాడు.

ముగ్గురూ కొండ ప్రాంతానికి చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అంతలో చంద్రోదయ మయింది. ఆ వెలుగులో చెట్ల

నీడల కింద నడుస్తున్న వాళ్ళకు, కొంచెం ఎడంలో ఏదో అలికిడి అయిన ధ్వని విన బడింది. ముగ్గురూ పొదలచాటుకు వెళ్ళి నక్కి కూచున్నారు. అల్లంత దూరంలో, ఒక పెద్ద వృక్షం కింద యిద్దరు నిలబడివున్నారు. వాళ్ళల్లో ఒకడు రెండవ వాడికి ఏదో హెచ్చరిక చేశాడు. ఆ వెంటనే యిద్దరూ చెట్టు బోదె పట్టుకుని పైకి పాక సాగారు.

"చూశావా, వాళ్ళ రెక్కలు!" అన్నాడు కేశవుడు, మెల్లిగా జయమల్లుతో. జయమల్లు తల వూపాడు. అంతలో ఆ చెట్టు కేసి మరో యిద్దరు వస్తున్నారు. కొయు గోమాంగ్ వాళ్ళ కేసి పరీక్షగా చూసి, "వాళ్ళిద్దరూ గుహ వాసులు. రెక్కల మనుషుల దేవతకు బలి పశువులుగా పంపబడ్డవాళ్ళు," అన్నాడు.

"వాళ్ళను రక్షిస్తామని మనం మాట యిచ్చాం!" అన్నాడు కేశవుడు. జయమల్లు అవునంటూ తల వూపి బాణం ఎక్కు పెట్టి ముందుకు కదిలాడు. కేశవుడూ, గోమాంగ్ కూడా బాణాలు ఎక్కు పెట్టి ముందుకు నడిచారు.

"నాకు ఆ దుర్మార్గుల తంత్ర మేమిటో చాలావరకు తెలిసిపోయింది. వాళ్ళిద్దర్లో ఏ ఒకడూ ప్రాణాలతో పారిపోకూడదు. తెలిసిందా?" అన్నాడు జయమల్లు.

"వాళ్ళు గుహ వాసుల్ని తన్నుకుని ఆకాశంలోకి ఎగరక ముందే, మనం కొట్టాలి. అలా కాకపోతే మన బాణం దెబ్బకు అందరు," అన్నాడు కొయు గోమాంగ్.

అంతలో "రాకాసి పక్షిమాతకూ, జై!" అన్న అరుపు మాను చిటారు కొమ్మల్లో మారు మోగింది. ఆ వెంటనే రెండు నల్లని ఆకారాలు, రెక్కలు టపటప లాడిస్తూ, చెట్టు కింద నిలబడిన గుహ వాసుల మీదికి రాసాగినై. కేశవుడూ, జయమల్లూ, కొయు గోమాంగ్ వింటి తాళ్ళను చెవివరకూ లాగి, జయః మంటూ మూడు బాణాలను వాటి మీదికి వదిలారు. —(ఇంకా వుంది)






## 24

[కేశవుడూ, అతడి అనుచరులూ కొండ గుహల్లో నివసించే జాతివాళ్ళకు, రెక్కల మనుషుల నుంచి రక్షణ కల్పిస్తామని, వాగ్దానం చేశారు. తరవాత రాత్రివేళ ఇద్దరు గుహవాసులను; తమ దేవతకు బలి యిచ్చేందుకు ఎత్తుకుపో ప్రయత్నిస్తున్న రెక్కల మనుషుల మీదికి, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ బాణాలు ఎక్కుపెట్టి వదిలారు. తరవాత-]

కేశవుడూ వాళ్ళు వదిలిన బాణాలు గురితప్పి జుయ్ఁ మంటూ పెద్ద శబ్దం చేస్తూ పోయి బలంగా చెట్ల కొమ్మలను తాకినై. ఆ ధ్వని వింటూనే రెక్కల మనుషులు కిందికి దూకేవాళ్ళల్లా, గాలిలో ఆగి, "మోసం, నమ్మకద్రోహం!" అంటూ అరిచి, దూరంగా వున్న చెట్ల చాటుకు ఎగిరిపోయారు.

"ఆ దుర్మార్గులు, మన బాణం వేటు నుంచి చాలా దూరం పారిపోయారు. ఇప్పుడేమిటి చేయటం?" అన్నాడు కేశవుడు. జయమల్లు పొదలచాటు నుంచి లేచి నిలబడుతూ, "వాళ్ళు ఎంతో దూరం ఎగిరిపోయి వుండరని, నా నమ్మకం. వెతుకుదాం, రండి!" అంటూ బయలుదేరాడు. అంతలో ప్రాణాపాయం నుంచి బయటపడిన గుహవాసులిద్దరూ అక్కడికి పరిగెత్తుకుని వచ్చి, "అయ్యా, ఆ రెక్కల మనుషులు ఆకాశంలోకి ఎగిరిపోయారు. కాని, అంతకన్న







దుర్మార్గులైన శ్వానకర్ణి ముఠావాళ్ళు మన కేసి వస్తున్నారు. మనం ప్రాణాలతో పారి పోలేం," అన్నారు.

శ్వానకర్ణి అన్నపేరు వింటూనే జయ మల్లు ఆశ్చర్య పడి, "ఎవడా శ్వానకర్ణి? పేరు వింతగా వుందే! వాడి ముఠావాళ్ళు మన మీదికి ఎటు నుంచి దాడి చేసేందుకు వస్తున్నారు?" అని అడిగారు.

గుహవాసులు జవాబు చెప్పే లోపలే, కోయగోమాంగ్ పక్కకు తిరిగి చూస్తూ, "అవిగో కాగడాలు! ఒక మందకు మంద మన కేసి వస్తున్నారు," అంటూ బాణం ఎక్కు పెట్టాడు. జయమల్లూ, కేశవుడూ అతడు చెప్పిన వైపుకు చూశారు. గుహ వాసుల్లాగే వున్న చాలామంది అడవి మనుషులు, ఈటెలు పట్టుకుని, కాగడాలు వూపుతూ నిశ్శబ్దంగా తమ కేసి రావటం వాళ్ళకు కనిపించింది.

జయమల్లు బాణం ఎక్కు పెట్టి వాళ్ళ కేసి కొంత దూరం నడిచి ఆగి, "మీరెవరో మాకు తెలియదు. మీకూ మాకూ ఎలాంటి శత్రుత్వం లేదు. మీ దారిన మీరు పొండి. అలా చేయక పోయారో, మీకు మా చేతుల్లో చావు తప్పదు," అన్నాడు. కేశవుడూ, కోయగోమాంగ్ కూడా బాణాలు ఎక్కు పెట్టి, అతడి పక్కన నిలబడ్డారు. గుహ వాసు లిద్దరూ వాళ్ళ వెనక దాక్కున్నారు.

కాగడాల వెలుగులో ముందు నడుస్తున్న ఒక అడవి మనిషి, చేతిలోని ఈటెను పై కెత్తి, "మీకూ మాకూ శత్రుత్వం లేని మాట నిజం. మీ దారిన మీరు పొండి. మాక్కావలసిం దల్లా, మీ వెంట వున్న, బిడాలి ముఠావాళ్ళు. వాళ్ళిద్దర్నీ మాకు ఒప్పగించండి," అన్నాడు.

ఎవరీ బిడాలి? అన్న అనుమానం జయ మల్లునూ, అతడి తోటి వాళ్ళనూ ఆశ్చర్య పరిచింది. శ్వానకర్ణి, బిడాలి—ఎవరు వీళ్ళు? ఎందుకు వీళ్ళ మధ్య శత్రుత్వం?









"అయ్యో, విడాలి మా నాయకుడు. ఇవ్వాళ ఉదయం వేళ ఆయన్ని మీరు చూశారు. మాలాగే ఈ శ్యానకర్ణి ముఠా వాళ్ళు కూడా కొండ గుహల్లో నివశించే జాతి వాళ్ళే. అయినా, వాళ్ళకూ మాకూ బద్ధవైరం. వాళ్ళకు మమ్మల్ని ఒప్పచెప్పారో నిలువునా కోసి చంపేస్తారు," అన్నాడొక గుహావాసుడు, వణికిపోతూ.

"జయమల్లా! మనం వీళ్ళను రక్షిస్తామని మాట యిచ్చాం. ఏమైనా సరే, ఆ మాట నిలబెట్టుకోవలసిందే," అన్నాడు కేశవుడు. కోయగోమాంగ్ తలాడించి, వింటి తాడు బలంగా లాగబోయాడు.

జయమల్లు అతన్ని వారిస్తూ, "కేశవా! మనం చేసిన వాగ్దానం నిలబెట్టుకోలేనంత పిరికిపందలం కాదు. కాని, పరిస్థితి చూశావా? మన విరోధులు నలభై యాభై మంది వరకూ వున్నారు. మనం వాళ్ళందర్నీ చంపి పారిపోగలగటం సాధ్యమయేదికాదు," అన్నాడు.

"అయితే, ఏమిటి నీ ఆలోచన?" అన్నాడు కేశవుడు అనుమానంగా.

"రాజీ మాటలతో వాళ్ళను ముందుకు రాకుండా ఆపుదాం. అలా సాధ్యం కాక పోతే, అన్నిటికీ తెగించి పోరాటం చేద్దాం," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు





వేసి, "ఇప్పుడు మాట్లాడింది శ్వానకర్ణియేనా? అలా అయితే, ఈటె అవతల పారేసి, ఒక్కడూ ముందుకు రాకోరతాను. ఇదుగో, నా విల్లంబులు వదిలేశాను," అంటూ తన విల్లంబులను కింద పడవేశాడు.

"శ్వానకర్ణి మా నాయకుడు. ఆయన గుహ దగ్గిరే వున్నాడు. నేనాయన అనుచరుణ్ణి. కాలయాపనెందుకు? ఆ బిడాలి ముఠా వాళ్ళిద్దర్నీ వదిలి, మీ దారిన మీరు పొండి," అన్నాడు శ్వానకర్ణి అనుచరుడు.

"అలా ఎన్నటికీ జరగదు. వాళ్ళిద్దర్నీ మీరు పట్టుకోవాలంటే, ముందు మాతో యుద్ధం చేయాలి. అందుకు తయారయ్యారో,



మీలో ఒక్కడూ బతకడు. మా బాణాల దెబ్బ మీకు తెలియదేమో? ఇంతకు ముందే యిద్దరు రెక్కల మనుషుల్ని చెట్ల మీంచి కింద పడేలా కొట్టాం," అంటూ జయమల్లు బాణం ఎక్కు పెట్టాడు.

ముగ్గురూ విల్లంబులతో ముందుకు నాలు గడుగులు వేసేసరికి, శ్వానకర్ణి అనుచరుడు వెనుదిరిగి, తన ముఠావాళ్ళతో ఏదో అన్నాడు. వెంటనే అందరూ అతడి చుట్టూ గుంపుగా చేరి గడబిడగా మాట్లాడుకోసాగారు.

"కేశవా! ఆ గొడవ చూశావా? మన మీద దాడి చెయ్యటమా? మానటమా? అన్న సమస్య తేలక వాళ్ళల్లోవాళ్ళే తన్ను కునేట్టున్నారు. ఇదే మంచి అదను. ఒక పేచీ వేసి చూస్తాను," అంటూ జయమల్లు అడవి మనుషుల కేసి తిరిగి, "మీలో చావ దలుచుకున్నవాళ్ళంతా ముందుకు రండి, తతిమ్మా వాళ్ళు వెనక్కు తిరిగి పొండి. మీ నాయకుడు శ్వానకర్ణి యీ సమయంలో యిక్కడ వుంటే, మాతో స్నేహానికి తప్పక ప్రయత్నించేవాడు. మీరు వట్టి మంద మతుల్లా వున్నారు," అన్నాడు.

జయమల్లు యిలా అనగానే, శ్వానకర్ణి అనుచరుణ్ణని చెప్పుకున్నవాడు తోటివాళ్ళను పెద్దగా కసురుకుని, జయమల్లు కేసి రెండడు





గులు నడిచి, "మీరు కావాలంటే మా నాయకుడితో స్వయంగా మాట్లాడ వచ్చు. భయం లేకపోతే, మా వెంట రండి, ఆయన వుండే గుహకు తీసుకుపోతాం," అన్నారు.

భయం అన్న మాట వింటూనే కేశవుడికి ఎక్కడలేని పౌరుషం వచ్చింది. వాడు వింటి తాడును గట్టిగా లాగి మోగిస్తూ, "మేము కావాలంటే మీ నాయకుడి దగ్గిరకే కాదు, అతడి ముత్తాత దగ్గిరకైనా వస్తాం, నడవండి," అన్నాడు తీవ్రంగా.

జయమల్లుకు, కేశవుడు అనాలోచితంగా మాట జారాడేమో అన్న భయం కలిగింది. కాని, యిప్పుడు అన్న మాట మీద నిలవక తప్పదు. మాట తప్పితే, తాము భయపడు తున్నామనుకుని, ఆటవికులు ఒక్కుమ్మడిగా మీద పడవచ్చు......

జయమల్లు యిలా ఆలోచిస్తూనే వెనుదిరిగి, వెనక నిలబడి వున్న గుహవాసుల్లో ఒకడికి, అక్కణ్ణించి పారిపోయి, జరిగిన సంగతేమిటో తమ నాయకుడైన బిడాలికి చెప్పమన్నాడు. రెండవవాణ్ణి తమ వెంటే వుండమన్నాడు. అంతలో శ్వానకర్ణి అనుచరుడు పెద్దగా గొంతెత్తి, "మీ రన్నదే బావుంది. మా వెంట రండి. మా నాయకుడితో మాట్లాడుదురు గాని. ఆయన



మిమ్మల్ని మీ దారిన పొమ్మంటే పోవచ్చు. అనవసరంగా మీరూ మేమూ, ఆ బిడాలి ముసా వెధవ లిద్దరి కోసం యిక్కడ చావట మెందుకు?" అన్నాడు.

"సరే, మీరు ముందు నడవండి. మీ గుహలుండే చోటు చేరేవరకూ, మీకూ మాకూ యిప్పుడున్న దూరమే వుండాలి. ఏదైనా మోసం చేయ చూస్తే, మీలో ఒక్కడు కూడా బతకడు," అన్నాడు జయమల్లు.

ఆ తరవాత అంతా ముందుకు కదిలారు. ఒక అరగంట కాలం ప్రయాణం చేసి ఎత్తయిన కొండలు గల ఒకానొక ప్రాంతాన్ని చేరారు. అప్పటికి తూర్పు దిక్కు కొంచెం





కొంచెమే తెల్లనవుతున్నది. ఆ వెలుగులో జయమల్లుకూ, అతడి అనుచరులకూ ఎగుడు దిగుడుగా వున్న కొండలూ, వాటి అంచుల మీద నిలబడి వున్న గుహవాసులూ కనిపించారు. అందరూ ఆ ప్రదేశానికి చేరుతూ వుండగానే, పై నుంచి పెద్దపెద్ద కొండరాళ్ళు దొర్లి, కేశవుడూ వాళ్ళకేసి రాసాగినై. అది చూస్తూనే ముందున్న శ్వానకర్ణి అనుచరులు కేకలు పెడుతూ కొండ మీదికి పరిగెత్తారు.

ముందు నడుస్తున్న జయమల్లు . ఆగి, "గోమాంగ్! అదిగో, ఆ కుడివైపున వున్న బండ మీద ఎలుగుచర్మం కప్పుకుని నిలబడి వున్నవాడే శ్వానకర్ణి అయివుంటాడు. వాడికి బాణం గురిచేసి పెట్టు. కాని, నేను వదలమనేవరకూ వదలవొద్దు," అని చెప్పి, ముందుకు రెండడుగులు వేసి, "శ్వానకర్ణీ! మీరేదో నమ్మక ద్రోహం తలపెట్టినట్టున్నది. అలా అయితే ముందు చావ నున్నది, నీవు! చూశావా? నీ గుండెలకు బాణం ఎక్కు పెట్టి వున్నది. పారిపోయేందుకు ప్రయత్నించావో, బాణం నీ గుండెలలో నుంచి దూసుకు పోతుంది," అని కఠినంగా హెచ్చరించాడు.

జయమల్లు హెచ్చరిక పూర్తయే లోపలే శ్వానకర్ణి ముఠావాళ్ళు వాళ్ళ మీదికి కొండ రాళ్ళు దొర్లించటం ఆపేశారు. అంతలో



శ్వానకర్ణి అనుచరుడు, తమ నాయకుణ్ణి సమీపించి, జయమల్లూ వాళ్ళను చూపుతూ ఏమో చెప్పాడు. నాయకుడు అటూ యిటూ రెండు మూడుసార్లు తలాడించి, జయమల్లు కేసి తిరిగి పెద్ద గొంతుతో, "మీరు మా శత్రువులకు మిత్రులు, కనక—మాకు శత్రువులు. మీరు మా నుంచి ప్రాణాలతో పారిపోలేరు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే కేశవుడు విల్లు పైకెత్తి, "ఊఁ మల్లూ! యిక లాభం లేదు. ఆ శ్వానకర్ణినీ మరి కొందర్నీ కొట్టి పారిపోదాం. బాణం ఎక్కుపెట్టు," అన్నాడు.



జయమల్లు, కేశవుణ్ణి తొందర ఫడవద్దని వారించి, "కేశవా! మనం ఈ ప్రాంతాలకు కొత్తవాళ్ళం. ఇక్కడ నివసించే అడవిజాతి వాళ్ళందరితో వైరం పెట్టుకుని ఎక్కడికి పారిపోగలం? మనం పుట్టి పెరిగిన రాజ్యం వదిలినది మొదలు దారి పొడుగునా ప్రతి వాళ్ళతో విరోధం తప్ప, ఒక్కళ్ళతో కూడా మనకు స్నేహం కలవ లేదు. పులి మీద పుట్రలాగా, బ్రహ్మదండి మాంత్రికుడు మనను వెన్నాడే వుంటున్నాడు. మనం ఈ గుహవాసులతో మైత్రి చేయగలిగితే, వీళ్ళ నుంచి రాకాసిలోయకు వెళ్ళే మార్గం తెలుసుకునే అవకాశం కలగవచ్చు. అంతే కాక, నీ తండ్రి ఒకవేళ ఈ ప్రాంతానికి వస్తే, అతడికి వీళ్ళు సహాయపడే వీలుకూడా వుంటుంది," అన్నాడు.

తండ్రి పేరు వింటూనే కేశవుడు వెలవెల పోయి, విల్లంబులు దించుతూ, "కాని, వీళ్ళతో స్నేహం చేయటం ఎలా? వీళ్ళు పచ్చి మాంసం తినే ఆటవికులు!" అన్నాడు.

"అదంతా నాకు వదిలెయ్యి. రెక్కల మనుషుల్నుంచి రాబోయే ప్రమాదం చూపి, ఆ బిడాలికీ, ఈ శ్వానకర్ణికీ మైత్రి కలిగించేందుకు ప్రయత్నిస్తాను. వాళ్ళూ వీళ్ళూ కూడా కొండ గుహల్లో నివసించే వాళ్ళేగదా," అంటూ జయమల్లు శ్వానకర్ణి కేసి తిరిగి,





"శ్వానకర్ణీ! మేం నీ బెదిరింపులకు భయపడే వాళ్ళం కాదు. బిడాలి ముఠావాళ్ళను రెక్కల మనుషుల నుంచి కాపాడతామని వాగ్దానం చేశాం. ఆ రెక్కల మనుషుల్ని పదీ పన్నెండు మందిని చంపాం కూడా. మీరూ మీరూ పోట్లాడుకుంటూ వుంటే, ఆ దుర్మార్గులు నీ ముఠావాళ్ళను కూడా ఏదో ఒక రోజున ఎత్తుకు పోవటం మొదలు పెడతారు. ఇంతకూ—నీకూ ఆ బిడాలికీ వైరకారణం ఏమిటి?" అని అడిగాడు.

"వైర కారణమా? ఆ బిడాలి తండా వాళ్ళంత నీచులు ఎక్కడా వుండరు. నేను గుహలో లేని సమయం చూసి, వాళ్ళు మా మూల పురుషుడి రాతి గద ఎత్తుకుపోయారు. అది ఎన్నో మహత్తర శక్తులు గలది. అది తిరిగి సంపాయించుకునేందుకు, వాళ్ళ నందర్నీ సర్వనాశనం చేయబోతున్నాను," అన్నాడు శ్వానకర్ణి పళ్ళు కొరుకుతూ.

"ఆ రాతి గద బిడాలి తెచ్చి నీ కిచ్చేస్తే, మీ మధ్య వైరం పోయినట్టేనా?" అని ప్రశ్నించాడు జయమల్లు.

శ్వానకర్ణి హేళనగా నవ్వుతూ, "బిడాలి ఆ గద తెచ్చి నా కివ్వటమా? అదెలా సాధ్యం? ఆ గద కోసం వాడు ఎన్ని చావులైనా చస్తాడు, తన ముఠావాళ్ళనందర్నీ చావనిస్తాడు," అన్నాడు.

"బిడాలి రహస్యం నాకు తెలుసు. మీ మూల పురుషుడి రాతి గద బిడాలి చేత తెప్పించి, నీ కిప్పిస్తాను," అంటూ జయమల్లు, వెనక నిలబడి వున్న బిడాలి ముఠా వాడి కేసి తిరిగి, "అంతా విన్నావుగదా? వెంటనే వెళ్ళి, మీ నాయకుణ్ణి రాతి గద తీసుకుని యిక్కడికి రమ్మన్నానని చెప్పు. అతడి కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు," అన్నాడు. బిడాలి అనుచరుడు వెంటనే బయలుదేరి వెళ్ళాడు. —(ఇంకా వుంది)








## 25

[కేశవుడూ అతడి స్నేహితుల నుంచి, రెక్కల మనుషులు పారి పోయారు. అదే సమయంలో శ్వానకర్ణి అనే అడవిజాతి వాడి ముఠా, వాళ్ళను చుట్టు ముట్టారు. జయమల్లు శ్వానకర్ణికి—తను సహాయం చేస్తానన్న బిడాలికి రాజీకుదిర్చేందుకు ఒప్పుకుని, బిడాలి అనుచరుల్లొకణ్ణి, వాళ్ళ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు పంపాడు. —తరవాత]

తమ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు బయలుదేరిన బిడాలి అనుచరుడికి, దారిలో బిడాలి మరి పదిమంది తన ముఠావాళ్ళతో ఎదురయాడు. వాళ్ళందరి దగ్గిరా రకరకాల ఆయుధాలున్నాయి. అందరూ చెట్లచాటున పొంచి నడుస్తూ ముందుకు వస్తున్నారు. బిడాలి తన అనుచరుణ్ణి చూసి, "ఎందుకలా పరిగెత్తుతున్నావు? ఏం జరిగింది?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

బిడాలి అనుచరుడు, తను కేశవుడూ వాళ్ళచేత ఎలా రక్షించబడ్డాడో, రెక్కల మనుషులు ఏ విధంగా వాళ్ళ బాణాల దెబ్బకు అందకుండా పారి పోయారో, చెప్పబోయే సరికి, బిడాలి అతణ్ణి వారిస్తూ, "ఆ సంగతంతా, నీ వెంట వున్నవాడు వచ్చి చెప్పాడు. నే నడిగేది, మిమ్మల్ని ఆ శ్వానకర్ణి దుర్మార్గుడి ముఠావాళ్ళు చుట్టు ముట్టిం తరవాత జరిగిందేమిటని,"









అన్నాడు. బిడాలి అనుచరుడు శ్వానకర్ణి ముఠా నివసించే కొండ గుహ దగ్గిర జరిగిన సంభాషణా, జయమల్లు చేసిన వాగ్దానం సంగతి చెప్పి, "వాళ్ల మూలపురుషుడి రాతి గద తెచ్చి యిస్తే, తను మనతో శత్రుత్వం మానుకుంటానని శ్వానకర్ణి చెప్పాడు. జయమల్లు ఆ రాతి గద తెమ్మని నీకు చెప్ప వలసిందిగా నన్ను పంపాడు," అన్నాడు.

రాతి గద పేరు వింటూనే బిడాలి గతుక్కుమని, తన అనుచరులకేసి కళ్ళెర్ర చేస్తూ చూశాడు. వాళ్ళంతా తలలు వంచుకున్నారు. బిడాలి వచ్చే కోపాన్ని అపుకుంటూ, "నేను ముందే చెప్పాను. కాని, మీలో ఏ ఒక్కరికీ బుద్ధీ జ్ఞానం వున్నట్టు లేదు. మీరంతా కలిసి, ఆ భాగమారాను ప్రోత్సహించి, చేయించిన వెధవ పనితో ఎన్ని చిక్కులు వచ్చినయ్యో చూశారా? ఇప్పుడా రాతి గద ఎక్కడ వున్నదని వాళ్ళకు చెప్పేట్టు?" అన్నాడు.

"చాతనైతే, వాళ్ళ పూర్వీకుడి గదను ఆ శ్వానకర్ణినే తెచ్చుకోమనండి. ఆ రాతి ముక్క కోసం ఎంతో ధైర్యశాలీ, బలశాలీ అయిన మనవాడొకడు చచ్చాడు," అన్నాడు బిడాలి అనుచరుల్లో ఒకడు.

బిడాలి కోపాన్ని అపుకోలేక చేతిలోవున్న ఈటెను బలంగా ఒకసారి నేలకు తాటించి, "వాడి కెంత ధైర్యం బలంవుంటే మాత్రం, నిప్పులు కక్కే సింహాన్ని చంపగలడా? ఆ ప్రయత్నంలో వాడూ చచ్చాడు, గదా పోయింది," అంటూ ఒక్క క్షణకాలం ఆలోచించి, "ఇక నడవండి. జరిగిందేదో ఆ శ్వానకర్ణికే చెబుదాం," అన్నాడు.

"మనం పదిమంది కంటె ఎక్కువలేం. శత్రువు గుహకు ఎలా వెళ్ళటం? వాళ్ళు మన మీది కొస్తే, మనం ఏమయేట్టు?" అన్నాడొకడు బిడాలి కేసి చూస్తూ.

"ఇదీ మీ ధైర్యం! ఇంత ప్రాణ భయం వున్నవాళ్ళు, ఆ రాతి గద జోలికెందుకు









పోయారు? సరే. అదంతా యిప్పుడు తవ్వి లాభంలేదు. క్వానకర్ణి నుంచి మన కెలాంటి ప్రమాదం రాకుండా, ఆ కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ రక్షించగలరు. వాళ్ళ చేతుల్లో వున్న కొత్తరకం ఆయుధాలు చూశారుగదా. వాటి దెబ్బకు తిరుగులేదు," అన్నాడు బిడాలి.

బిడాలి తన ముఠావాళ్ళతో కేశవుణ్ణీ అతడి స్నేహితుల్నీ సమీపించేసరికి, అక్కడ వాళ్ళు క్వానకర్ణితో మాట్లాడుతున్నారు. బిడాలి రావటం చూస్తూనే, క్వానకర్ణి కోపంతో ముక్కుపుటాలు ఎగరవేస్తూ, "చూశారా! వాళ్ళు ఆ రాతి గద తేవటం లేదు. వాళ్ళతో ఇంక రాజీమాట లేమిటి?" అన్నాడు కోపంగా.

జయమల్లు, బిడాలి కేసి తిరిగి, "ఏం బిడాలీ! ఆ రాతి గద వెంట తెమ్మని నీ అనుచరుడితో కబురు చేశానే. ఎందుకని తేలేదు? క్వానకర్ణితో శత్రుత్వం యింకా పొడిగించాలని వున్నదా?" అని అడిగాడు.

"నా కెవరితోనూ శత్రుత్వం నెరపాలని లేదు. ఈ అరణ్యంలో ఏ ముఠావాళ్ళతోనూ నాకు విరోధం లేదు. కావాలని క్వానకర్ణే నాతో విరోధం పెట్టుకున్నాడు. మా వాళ్ళు దొంగిలించారనే రాతి గద లాంటివి ఇరవై రాతి గదలు అతడి కివ్వగలను. సరా," అన్నాడు బిడాలి.

"నాక్కావలసింది, మా మూలపురుషుడి రాతి గద. దానిలో ఎంతో మహత్తు వున్నది. మీరు దొంగిలించుకుపోయిన దానికి బదులుగా వెయ్యి గద లిస్తామన్నా, నే నొప్పను," అన్నాడు క్వానకర్ణి రౌద్రంగా.

"ఆ మహత్తున్నమ్మే, మావాడు మడుగు పక్క గుహలోవున్న నిప్పులుకక్కే సింహాన్ని చంపేందుకు వెళ్ళి, హతమారిపోయాడు," అన్నాడు బిడాలి యీసడింపుగా.

"అది సరే, గద ఎక్కడున్నది?" అని ప్రశ్నించాడు జయమల్లు.



"గదా వాడూ కూడా అయిపూ అజా లేకుండా పోయారు. ఆ సింహం వున్న గుహలోకి వాడు ప్రవేశించటం చూసిన వాళ్ళున్నారు తప్ప, బయటికి రావటం చూసిన వాళ్ళు లేరు. అది వాణ్ణి చంపి తినేసి వుంటుంది," అన్నాడు బిడాలి.

"మోసం! నేను నమ్మను!" అంటూ శ్వానకర్ణి అరవటం ప్రారంభించాడు.

జయమల్లు బిడాలిని దూరంగా తీసుకుపోయి, నిజం చెప్పవలసిందిగా కోరాడు. బిడాలి ప్రమాణాలు చేసి జరిగినదంతా చెప్పి, "ఆ భాగమారా నా ముఠావాడయినా, ఆ గద దొంగిలించటం సంగతి



నా కేమీ తెలియదు. నా ముఠాలోని కుర్రకాయ ప్రోద్బలంతో వాడా పని చేశాడు. తగిన శిక్ష అనుభవించాడు," అన్నాడు.

జయమల్లు, శ్వానకర్ణి దగ్గరకు వచ్చి, "శ్వానకర్ణీ, నువ్వు బిడాలి మాటలు నమ్మవచ్చు. మీ మూలపురుషుడి గదలో అంత మహత్తు వున్నదనుకుంటే, దానిని మేము తెచ్చి పెట్టగలం. మీరూ మీరూ సఖ్యంగా వుండండి," అన్నాడు.

"బిడాలి మాటలు నమ్మటం అంటే, ఆ గద నిప్పులుకక్కే సింహం గుహలో వున్నదనుకోవాలి. సింహం మనిషిని తిన్నదేమోకాని, రాతి గదను కూడా తిన్నదనుకోవటం కుదరదుగదా? ఆ సింహం గుహలో ప్రవేశించి, ఆ గదను మీ రెలా తేగలరు?" అన్నాడు శ్వానకర్ణి ఆశ్చర్యంగా.

"మా శక్తి యింకా మీకు తెలియలేదన్నమాట. పదండి, ఆ సింహంవుండే మడుగూ, గుహా చూపండి," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు. కేశవుడూ, కోయగోమాంగ్ అతడి వెనక బయలుదేరారు.

బిడాలి శ్వానకర్ణి తమ తమ అనుచరులతో అరణ్యంలో కొంత దూరం నడిచి ఒక పెద్ద నీటి మడుగు దగ్గిరకు వచ్చారు. ఆ నీటి మడుగుకు అవతలి ఒడ్డున ఒక ఎత్తయిన





కొండ వున్నది. అందులో అనేక గుహలు వున్నవి. మడుగునీరు, కొండ అంచువరకూ ఆనుకుని పొర్లిపొర్లి ప్రవహిస్తున్నది. ఒక పెద్ద నీటిపాయ ఏదో ఆ మడుగులోంచి, దూరంగా వున్న కొండల కేసి ప్రవహించటం జయమల్లు గమనించాడు.

"అదుగో, ఆ కనిపించే పెద్ద గుహ సింహానికి నివాసస్థానం. అక్కడికి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వచ్చినవాడెవడూ లేడు," అన్నాడు బిడాలి. శ్వానకర్ణి అవునన్నట్టు తలాడించి జయమల్లు కేసి చూశాడు.

జయమల్లు, కేశవుణ్ణీ, కోయగోమాంగ్‌నూ కొంచెం దూరంగా తీసుకువెళ్ళి, సాహసించి సింహం వున్న గుహలోకి ప్రవేశించి, దానిని చంపటమా, మానటమా అన్న సమస్య గురించి చర్చించాడు. ఇంత దూరం వచ్చిం తరవాత, యిప్పుడు వెనక్కు తిరగటం తెలివైన పని కాదని కేశవుడూ, గోమాంగ్ కూడా సలహా యిచ్చారు. కాని, నిప్పులు కక్కే సింహం అంటున్నారే, దాన్ని తమ బాణం దెబ్బలతో చంపగలగటం సాధ్యమా అన్న అనుమానం వాళ్ళకు కలిగింది.

"ఎంత బలమైన మృగాన్నయినా సరే, ఒక్క అంబు దెబ్బతో కదలా మెదలక పడేలా చేయగలిగిన విషం నా దగ్గిర వున్నది.



ఆ విషం పూసిన బాణం తగిలితే, ఆ సింహం చాపచుట్టలా కింద పడి వూరుకుంటుంది. కాని, బాణం గురి తప్పితే మాత్రం మనకు చావు తప్పదు," అన్నాడు గోమాంగ్.

"మూడు బాణాలు గురి తప్పటం సాధ్యమా?" అన్నాడు కేశవుడు.

"కాని, అది హఠాత్తుగా మన మీద ఏ రాళ్ళచాటునుంచో దూకితే, ఎంగాను?" అని ప్రశ్నించాడు గోమాంగ్.

"ఆ ప్రమాదం రాకుండా, మనం తగు జాగ్రత్తలో వుందాం. అసలు ఆ సింహం ఆ గుహలో వున్నదో, మరెటయినా పోయిందో ముందు తెలుసుకోగలిగితే బావుణ్ణు. అది







నిశ్చయంగా గుహలో వున్నదని తెలిస్తే, అది మన మీద దొంగ చాటుదెబ్బ తీయకుండా జాగ్రత్తపడవచ్చు," అన్నాడు జయమల్లు.

"సింహం గుహలో వున్నదీ లేనిదీ తెలుసుకోవటం, ఏమంత కష్టంకాదు. కొన్ని జంతువులను—ఏ మేకల్నో, దున్నపోతుల్నో ఆ గుహకేసి తోలితే, నిజం తెలిసిపోతుంది. వాటిని చూసి సింహం గుహనుంచి బయటికి రావచ్చు. లేదా, జంతువులు అది వున్నట్టు వాసనపట్టి దూరంగా పారిపోవచ్చు," అన్నాడు కోయ గోమాంగ.

ఈ ఉపాయం జయమల్లుకూ కేశవుడికీ కూడా నచ్చింది. వాళ్ళు ఈ సంగతి చెప్పగానే, శ్వానకర్ణి తన ముఠావాళ్ళను పంపి, పది మేకలనూ, కొన్ని ఎనుబోతులనూ అక్కడికి తెప్పించాడు. తరవాత వాటి నన్నిటినీ ఒకదానికొకటి తాళ్ళతో కట్టి, మడుగు కవతల వున్న కొండ గుహ కేసి తోలించాడు.

జంతువులు నీటిలో ఈదుతూ సింహం వుండే గుహ కేసి మామూలుగానే వెళ్ళి, గుహ మరి కొంచెం దూరంలో వుందనగా, పెద్దగా బెదిరిపోయి, తాళ్ళు తెంచుకుని, అరుస్తూ చెల్లా చెదురుగా నీటి వాలున పడి పారిపోసాగినై.

"సింహం గుహలోనే వున్నది, సందేహం లేదు. కాని, అది జంతువులను పట్టేందుకు గుహ నుంచి బయటికి ఎందుకు రాలేదో, తెలియకుండా వున్నది," అన్నాడు బిడాలి.

శ్వానకర్ణి వికటంగా నవ్వుతూ, "నీ ముఠా వాళ్ళు దానికి మనిషి మాంసం రుచి ఎలా వుంటుందో చూపించారు. ఇక అది మను మళ్ళి తప్ప తినదు. చాతనైతే మీ వాడి నొకణ్ణి పంపు, గుహలోనుంచి బయటికి దూకు తుంది," అన్నాడు.

శ్వానకర్ణి మాటలకు ఉగ్రుడైపోయి బిడాలి ఏదో అనబోయేంతలో, జయమల్లు అతణ్ణి సమాధానపరుస్తూ, "ఇప్పుడు మళ్ళీ

మీరు తగూలాడుకోకండి. సింహాన్ని చంపి, రాతిగద తెచ్చేపని మానెత్తిన వేసుకున్నాం. మీరు చేయవలసిందల్లా, మాకు ఒక తెప్ప కట్టివ్వటం," అన్నాడు.

శ్వానకర్ణి అజ్ఞ యివ్వగానే అతడి అనుచరులు కొన్ని ఎండు కర్రలు తెచ్చి, వాటిని చెట్ల ఊడలతో గుదికట్టి మడుగులోకి తోశారు. ఈ లోపల కోయ గోమాంగ్, తను దాచి వుంచుకున్న విషాన్ని అన్ని బాణాల మొనలకూ రాసి, వాటిని బాగా ఎండ పెట్టాడు. ముగ్గురూ తెప్ప ఎక్కి, అది తోసేందుకు అమర్చిన గడకర్రలను చేతికి తీసుకున్నారు.

జయమల్లు, మడుగు ఒడ్డున నిలబడివున్న బిడాలినీ, శ్వానకర్ణినీ ఉద్దేశించి, "మీరు, యిక్కడ వున్నా సరే, లేక శాంతంగా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయినా సరే, మాకు అభ్యంతరం లేదు. మేము ఒక గంటలో ఆ రాతి గద తీసుకుని వస్తాం," అన్నాడు.

బిడాలిగాని, శ్వానకర్ణిగాని మాట్లాడలేదు. వాళ్ళిద్దరికీ జయమల్లూ అతడి అనుచరులు యిక తిరిగి రావటం అంటూ వుండదన్న భయం పట్టుకున్నది. అది గ్రహించిన జయమల్లు, "గంట ఎందుకు, పావుగంటలోనే తిరిగి వస్తాం. రాతి గదను శ్వానకర్ణికీ, నిప్పులుకక్కే సింహం చర్మాన్ని బిడాలికీ బహూకరిస్తాం," అన్నాడు పెద్దగా.

తెప్ప క్రమంగా మడుగు దాటి సింహం వుండే గుహను సమీపించింది. "గుహలో ఏదో అలికిడైనట్టు నాకు అనుమానంగా వున్నది," అన్నాడు కోయ గోమాంగ్.

"అనుమానాలతో ఏం పని, మనం గుహలోకి వెళ్ళబోతున్నాం గదా," అంటూ కేశవుడు, తెప్ప ఒడ్డు తాకగానే ఎగిరి గంతేసి కిందికి దూకాడు. ముగ్గురూ నిశ్శబ్దంగా నడుస్తూ గుహను సమీపించి, లోపలికి తొంగిచూశారు. —(ఇంకావుంది)








## 26

[బిడాలి, శ్వానకర్ణి ముఠాలకు రాజీ కుదిర్చేందుకు జయమల్లు చేసిన ప్రయత్నం ఫలించలేదు. శ్వానకర్ణి ముఠావాళ్ళ మూల పురుషుడి రాతి గద నిప్పులు కక్కే సింహం గుహలో వున్నదని బిడాలి చెప్పారు. ఆ గద తెచ్చేందుకు కేశవుడూ, అతడి స్నేహితులు మడుగు దాటి సింహం గుహను సమీపించి, లోపలికి తొంగి చూశారు. తరవాత—]

గుహ లోపలి భాగం ఏమంత చీకటిగా లేదు. ఎక్కడినుంచో వెలుగు దానిలోకి పడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో, అందరి కన్న ముందు నిలబడి గుహ లోపలికి తొంగి చూసిన కేశవుడికి, ఏవో నిప్పు రవ్వలు లేచి చెల్లా చెదరైనట్టు కనిపించింది.

"నిజంగా, గుహవాసులు చెప్పినట్టు లోపల వున్నది నిప్పులు కక్కే సింహమే అయితే, అది మన బాణం వేటు దూరం లోనే వున్నది," అంటూ కేశవుడు తన అనుచరుల కేసి చూశాడు. ఈలోపల జయమల్లూ, కోయగోమాంగ్ కూడా గుహలో రేగిన నిప్పు రవ్వలను గమనించారు.

"మనం సింహాన్ని బయటికి వచ్చేట్టు చేయాలి. అలా చేయగలిగామా దాన్ని చంపటం తేలిక. అలా కాక, మనం గుహలో ప్రవేశించటం ఏమంత క్షేమం కాదు," అన్నాడు జయమల్లు.









''సింహం మనను చూసి బెదురుకుని పారిపోయింది. సందేహం లేదు,'' అన్నాడు కొయగోమాంగ్.

''ఇక మనం గుహలోకి జొరబడి దాన్ని వెంటబడి తరిమి వేటాడటమే మార్గం, ఏమంటావ్, జయమల్లూ?'' అని ప్రశ్నించాడు కేశవుడు.

జయమల్లు గుహ లోపలికి రెండడుగులు వేసి ఆగి, ''గుహవాసులు చెప్పినంత భయంకర జంతువేమీ కాదు, ఈ సింహం! పోతే, తతిమ్మా సింహాల్లో లేని ప్రత్యేకత దీని కొకటి వుంది. అది, ముక్కుల్లో నుంచో, నోట్లో నుంచో నిప్పు రవ్వలు రాల్చటం. అది చూసే గుహవాసులు అంత భయపడి పోయారు. సరే, జాగ్రత్తగా నడవండి. మనం వదిలే మూడు విష బాణాల్లో ఏ ఒక్కటి తగిలినా సింహం చచ్చినదాని కిందే లెక్క. అంతేనా గోమాంగ్?'' అన్నాడు.

''ఆ విషం సంగతి నాకు బాగా తెలుసు. నీ కెలాంటి సంశయం అక్కర లేదు,'' అన్నాడు కొయగోమాంగ్ నమ్మకంగా.

ముగ్గురూ గుహ ప్రవేశించి ముందుకు నడవసాగారు. కొంత దూరం లోపలికి పోయేసరికి, వాళ్ళకు గుహ రెండు మూడు భాగాలుగా చీలి పోవటం కనిపించింది.

జయమల్లు యిలా అంటూ వుండగానే, కొయగోమాంగ్ గుహ ముందున్న ఒక పెద్ద రాయి తీసుకుని బలంగా గుహలోకి విసురుతూ, 'ఏహోయ్!' అంటూ బిగ్గరగా అరిచాడు. ఆ ధ్వని గుహలో మారు మోగింది. ఆ వెంటనే లోపల నిప్పు రవ్వలు చేటలతో చెరిగినట్టు లేచినై.

కేశవుడు చప్పున బాణం ఎక్కు పెట్టి సూటిగా గుహలోకి వదులుతూ, ''సింహం మన మీదికి దూకేందుకు వస్తున్నది,'' అంటూ హెచ్చరించాడు. కాని, మరుక్షణం గుహను నిశ్శబ్దం ఆవరించింది. నిప్పు రవ్వల కాంతి మాయమయింది.







అంతా వెలుగుగానే వున్నది. కాని, ఎక్కడా సింహం జాడలేదు.

"మళ్ళీ తిరిగి మనం గుహ కందరాల్లో పడ్డాం. ఏదారి ఎటు పోతుందో చెప్పలేం. సింహం, ఈ మార్గాల్లో దేనివెంట పారిపోయినట్టు?" అన్నాడు కేశవుడు.

కోయగోమాంగ్ మోకాళ్ళ మీద పాకుతూ గుహ చీలికలైన ప్రదేశాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూసి, "సింహం, యిదుగో, ఈ కుడి వైపు సొరంగ మార్గాన పోయింది. యిక కదలండి," అంటూ బయలుదేరాడు.



జయమల్లు అతడి భుజం, పట్టుకుని ఆపుతూ, "గోమాంగ్, తొందరపడకు. నువ్వన్నట్టు సింహం ఆ మార్గానే పోయినా, అది ఏ మలుపో తిరిగి, వెనక్కు వచ్చి, మన మీద హఠాత్తుగా దూకవచ్చు. ఆ సంగతి ఆలోచించావా?" అన్నాడు.

జయమల్లు యిలా అనగానే, గోమాంగ్ ఆశ్చర్యం కనబరుస్తూ, "అవును, జయమల్లూ. నువ్వన్నది నిజమే. మనలో ఒకళ్ళు వెన్ను కాస్తూ వెనక్కు నడవటం మంచిది. అప్పుడు సింహం మన మీద దొంగ దెబ్బ తీయలేదు," అన్నాడు.

జయమల్లూ, గోమాంగ్ ముందు నడుస్తుండగా, కేశవుడు వెనక్కు తిరిగి నడుస్తూ వాళ్ళను అనుసరించాడు. ఆ విధంగా వాళ్ళు గుహ మార్గాల వెంట కొంతదూరం నడిచే సరికి హఠాత్తుగా గోమాంగ్, చిన్న కేక వేసి, "చూడండి! అదిగో, మనిషి పుర్రె. బహుశా యిది చీదాలి ముఠా వాడైన భాగమారా దయి వుంటుంది. వాడే గదా శ్యానకర్ణి వాళ్ళ గద తీసుకుని ఈ గుహలోకి ప్రవేశించింది," అన్నాడు.

జయమల్లు ఆగి, అంత దూరంలో వున్న పుర్రెను చేతికి తీసుకుని పరీక్షించి చూసి, "గోమాంగ్, నువ్వన్నట్టు యిది భాగమారాదే కావచ్చు. ఆ రాతి గద కూడా యీ దాపులనే ఎక్కడో వుంటుంది," అన్నాడు.







ముగ్గురూ సొరంగ మార్గంలో గద కోసం వెతకసాగారు. కేశవుడు వికటంగా నవ్వుతూ, ఒక మూల నుంచి దాదాపు నాలు గడుగుల పొడ వున్న ఒక రాతి ముక్కను, చివర గుండ్రంగా రాతి ముళ్ళతో వున్న దానిని పైకెత్తి, "ఇదేనా, అద్భుత శక్తు లున్న శ్వానకర్ణి మూల పురుషుడిగద!" అన్నాడు.

జయమల్లు ఆ రాతి ముక్కను పరీక్షించి చూసి, "ఇది రాతి గద అనే దాంట్లో సందేహం ఏమీ లేదు. అద్భుత శక్తుల మాట ఆ గుహవాసులకే తెలియాలి! సరే, వచ్చిన పని అయింది. యిక బయట పడదామా?" అన్నాడు.



"సింహం మాటేమిటి?" అని అడిగాడు కేశవుడు.

"అవును, దాన్ని చంపుతామని మాట యిచ్చాంగదా, చంపకుండా ఎలా పోవటం?" అన్నాడు కోయగోమాంగ్.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ రాతి గదను కోయగోమాంగ్ చేతి కిచ్చి, "మనం సింహాన్ని చంపుతామని ఎవరికీ వాగ్దానం చెయ్యలేదు. రాతి గదను శ్వానకర్ణికి తెచ్చి యిస్తామని చెప్పాం. ఆ పని పూర్తయింది. సింహం సంగతి మనకెందుకు? అది ఎంత భయంకర మృగమో కూడా మనకు తెలియదు. అనవసరంగా దుస్సాహసం చెయ్యటం వివేకం కాదు," అంటూ కేశవుడి కేసి తిరిగాడు.

జయమల్లు అన్నదానికి కేశవుడు ఏదో జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ ఎగిరి గంతేసి, "నిప్పులు కక్కే సింహం! బాణాలు ఎక్కు పెట్టండి," అంటూ రాతి గదను పైకెత్తాడు.

సింహం హఠాత్తుగా ఒక మలుపు తిరిగి భయంకరంగా గర్జిస్తూ ముందుకు దూకింది. జయమల్లూ, కేశవుడూ బాణాలు ఎక్కు పెట్టే లోపల గోమాంగ్ తన చేతిలో వున్న రాతి గదతో, దాని తల మీద గట్టిగా ఒక







దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే సింహం చెంగున వెనుదిరిగి పరిగెత్తసాగింది. కేశవుడూ, జయమల్లూ వదిలిన బాణాలు దానికి తగలలేదు.

"దీనికి సింహమని ఎవరు పేరు పెట్టారో గాని, యిది సింహం కాదు; మా కోయ వాళ్ళు దీన్ని సింహళీక మంటారు. మా కొండ ప్రాంతాల కూడా యివి వున్నవి. దాని ముక్కు నుంచి వెలువడే రవ్వల్లో కాంతి వుంటుంది తప్ప; వేడిమి వుండదు," అన్నాడు కోయగోమాంగ్.

"దాని మెడా, మూతీ చూసిన వాడెవడూ అది అసలు సింహపు జాతి జంతువంటేనే నమ్మడు. పైగా, వట్టి పిరికి గొడ్డులా వున్నది. అయినా, ఈ వర్ణనంతా యిప్పు డెందుకు. ఎదురయింది గనక, దాని అంతు తేల్చుదాం," అంటూ జయమల్లు ముందుకు పరిగెత్తాడు.

సింహం గుహ మార్గాన కొంత దూరం సూటిగా పరిగెత్తి, ఒక మలుపు తిరిగింది. జయమల్లు మలుపు సమీపిస్తూనే వేగం తగ్గించి, ముందుకు తొంగి చూసి పెద్దగా నవ్వుతూ, "ఇదేదో మన కోసం యిక్కడ పొంచి వుంటుందని భయపడ్డాను. కాని, అంతు లేకుండా పారిపోయింది. యిప్పు డేమిటి చేయటం?" అన్నాడు.

కేశవుడూ, కోయగోమాంగలు జయమల్లును సమీపించి, ముందున్న సొరంగం కేసి చూశారు. గోమాంగ్ రాతి గదను రెండు చేతులతో పట్టుకుని పైకెత్తి అట్టూ యిటూ ఊపుతూ, "దీనిలో ఏదో అద్భుత శక్తి వున్నది, సందేహం లేదు. ఒక్క దెబ్బకే ఆ సింహళీకం ఎంత బెదిరి పోయిందో చూశావుగదా?" అన్నాడు.

"ఇక వెనక్కు తిరిగి పోవటమే మంచి దేమో," అన్నాడు జయమల్లు.

"ఇంత శ్రమపడి వూరికే పోవటం ఎందుకు. ఆ సింహాన్ని చంపి దాని చర్మం







వలుచుకుపోదాం," అన్నాడు కేశవుడు. ముగ్గురూ గుహ మార్గం వెంట నడవసాగారు. కాని ఎక్కడా సింహం జాడ లేదు. అది మరే గుహ మార్గంలోనో దాక్కొని వుంటుం దని వాళ్ళు భావించారు. కాని, యిన్ని సొరం గపు బాటల్లో దాన్ని వెతికి చంపటం ఎలా?

జయమల్లు వెనక్కు తిరిగి నడవబోయిన వాడల్లా చప్పున ఆగి, "మనం వచ్చిన మార్గానే తిరిగి నీటి మడుగు దగ్గిరకు వెళ్ళేందుకు, దారి మీకు గుర్తుందా? లోగడ మనం గుహ కందరాల్లో దారి తప్పినట్టే, మళ్ళీ దారి తప్పంగదా!" అన్నాడు.

ఆ ప్రశ్నతోగాని అందరికీ తాము చేసిన పొరపాటు తెలిసి రాలేదు. సింహాన్ని చంపా లన్న ఉత్సాహంలో ఎటు పోతున్నదీ గుర్తు పెట్టుకోకుండానే ముగ్గురూ సొరంగ మార్గాల వెంట పరిగెత్తారు. ఇప్పుడు ఏ మార్గాన వెళితే, తాము గుహవాసులుండే ప్రాంతా లకు చేరగలరో వాళ్ళకు అర్థంకాలేదు.

"మనం తొందరపడి ఏదో ఒక సొరంగ మార్గాన్ని పట్టి, దారి తెలియక తరవాత గందరగోళ పడటం మంచిది కాదు. ముందుగా మనం నీటి మడుగుకు ఎంత దూరంలో వున్నామో గ్రహించ గలిగితే బావుంటుంది," అన్నాడు జయమల్లు.

"ఆ సంగతి గ్రహించటం ఎలా?" అన్నాడు కేశవుడు.

జయమల్లు జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ అక్కడ ఎగుడు దిగుడుగా వున్న రాళ్ళమీంచి పైకి పాకి, ఒక కంతలో నుంచి తల దూర్చి బయటికి తొంగి చూస్తూనే, "హా, తల్లీ, కొనలమ్మా!" అంటూ మూలిగి, కాసేపు ఆశ్చర్యంగా తల పంకించి, చప్పున కిందికి దూకాడు.

"ఏమిటంత ఆశ్చర్యపడ్డావ్? ఏం కన బడింది?" అని జయమల్లు, గోమాంగ్‌ను ప్రశ్నించాడు. గోమాంగ్ మెల్లిగా మాట్లాడ మన్నట్టు అందరికీ సౌంజ్ఞ చేసి, "మనం





తిరిగి ప్రమాదాల్లో తల దూర్చాం. గుహ కందరాల్లో పడి మనం రెక్కల మనుషు లుండే ప్రాంతం చేరటమేగాక, బ్రహ్మ దండి మాంత్రికుడికూడా చేరువ అయ్యాం," అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి పేరు వింటూనే కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళిద్దరూ, గోమాంగ్ ఎక్కి చూసిన కంత దగ్గిరకు పోతున్నంతలో, గోమాంగ్ వాళ్ళను హెచ్చరిస్తూ, "మీరు తొందరపడి ఏదన్నా చేసి, మనం వున్న ప్రాంతం వాళ్ళకు తెలిసేలా చేయకండి. రెక్కల మనుషులు బ్రహ్మ దండి మాంత్రికుడి ముందు వ్యాయామ ప్రదర్శనలు చేస్తున్నట్టున్నది," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ నిశ్శబ్దంగా పైకి పాకి కంతలో నుంచి బయిటికి తొంగి చూశారు. ఎదురుగా ఒక పెద్ద మైదానం, పెద్ద పెద్ద వృక్షాలు. వాటి మీది నుంచి అనేక మంది రెక్కల మనుషులు పక్షుల్లా ఎగిరి కిందికి దూకుతున్నారు. అక్కడ వున్న ఒక ఎత్తయిన రాతి ఆసనం మీద బ్రహ్మదండి మాంత్రికుడు కూచుని వుండి, చేతిలో గల మంత్రదండాన్ని అటూ యిటూ ఊపుతున్నాడు.

"ఈసారి వీణ్ణి ప్రాణాలతో పోనివ్వ కూడదు, చిత్రవధ చేయాలిసిందే," అన్నాడు కేశవుడు రోషంగా.

జయమల్లు తల వూపి ఏమో చెప్ప బోయేంతలో, రెక్కల మనుషులు ఒక్కసారిగా హాహాకారాలు చేసి, చెల్లా చెదరుగా పారిపోసాగారు. బ్రహ్మదండి ఎగిరి రాతి మీద నిలబడి మంత్రదండాన్ని గాలిలో ఊపుతూ, "అం హం ఫట్ ఘట్...కాల భైరవా..." అంటూ కేకలు ప్రారంభించాడు. నిప్పులు కక్కే సింహం పారిపోతున్న రెక్కల మనుషుల కేసి వేగంగా పరిగెత్తుతున్నది. —(ఇంకా వుంది)






# 27

[కేశవుడూ అతడి అనుచరులు నిప్పులు కక్కే సింహం గుహ ప్రవేశించారు. వాళ్ళకు రాతి గద కనిపించింది. సింహం మీదికి రాగా గోమాంగ్ దానిని గదతో కొట్టాడు. అది గుహ విడిచి, రెక్కల మనుషులూ, బ్రహ్మదండి మాంత్రికుడూ వున్న ప్రదేశాని కేసి పరిగెత్త సాగింది. బ్రహ్మదండి హుం ఫట్ అంటూ అరవసాగాడు. తరవాత—]

బ్రహ్మదండి పెట్టే కేకలతో, రెక్కల మనుషులు చెల్లా చెదరుగా పారిపోతూ, ప్రాణభీతితో అరిచే అరుపులతో, మైదాన ప్రదేశమంతా దద్దరిల్లి పోయింది. నిప్పులు కక్కే సింహం మాత్రం రెక్కలమనుషుల జోలికి పోక, అల్లంత దూరంలోవున్న అడవి కేసి సూటిగా పరిగెత్తసాగింది.

సింహం బాగా బెదిరి పోయిందనీ, అది తన ప్రాణరక్షణకు అడవి కేసి పారి పోతున్నదనీ ముందుగా గ్రహించినవాడు, బ్రహ్మదండి మాంత్రికుడు. ఆ వెంటనే అతడు మంత్రదండాన్ని సింహం కేసి ఝళి పిస్తూ, "జై కాలభైరవా! ఫట్ ఘట్ హుం...సింహాన్ని చెవులు పట్టుకుని, అడవి లోకి లాగెయ్, ఉపాసకుల చూడల మర్రీ!" అంటూ ఒక పెనుకేక పెట్టి, "హేయ్, జితా శక్తీ! మీ రెక్కడ? రండి, రండి, భయం లేదు. సింహాన్ని కాననంలోకి







తరిమేస్తున్నాను," అంటూ తన అంగరక్షకులను పిలిచాడు. కేక వింటూనే జిత, శక్తి వర్మలు ఒక చెట్టు చాటు నుంచి తొంగి చూసి, నిప్పులు కక్కే సింహం అరణ్యం కేసి దౌడు తీస్తున్నదని గ్రహించి, కత్తులు దూసి, గిరగిరా తిప్పుతూ, "ఆఁ వచ్చాం, వచ్చాం, బ్రహ్మదండీ! సింహం మా కత్తి వేటుకు అందకుండా తప్పుకున్నది. అరణ్యంలోకి జొరబడి దాన్ని వేటాడమంటావా?" అని అడిగారు.

బ్రహ్మదండి పెద్దగా నవ్వుతూ, "మీ ధైర్య సాహసాలు నాకు తెలియనివా? అయినా, సింహాన్ని యిప్పుడు అరణ్యంలోకి వెళ్ళి వేటాడటం క్షేమం కాదు. ముందు రెక్కల పురుగుగాళ్ళకు ధైర్యం చెప్పి మంద వేయటం అవసరం. వాళ్ళ నాయకుడు... ఆ గూబ ముఖం వెధవ ఎక్కడ? వాణ్ణి వెంటనే యిక్కడికి పిలుచుకు రండి, లేకపోతే నేనే వాడున్న చోటుకు వస్తాను. నా అనుమానం రూఢి అయింది! ఆ కేశవుడి జుట్టు మన చేతికి దొరికినట్టే!" అన్నాడు.

కేశవుడి పేరు వింటూనే జితశక్తివర్మలు ఉలిక్కి పడి చుట్టూ కలయ చూస్తూ, "కేశవుడా? ఎక్కడ?" అంటూ బ్రహ్మదండి కేసి అనుమానంగా చూశారు.

బ్రహ్మదండిమాంత్రికుడు ఏ మాత్రం తొణుక్కుండా, "జితా, శక్తీ! మీరు తొందర పడకండి! వాడెక్కడో యీ ప్రాంతాలనే తన అనుచరులతో తిరుగు తున్నాడు. మనం జాగ్రత్తగా తిరుగులేని పథకం ఒకటి వేసి వాళ్ళందర్నీ పట్టేయాలి? ముందు నేను చెప్పిన పని చెయ్యండి," అన్నాడు.

జిత, శక్తివర్మలు వెళ్ళేసరికి రెక్కల మనుషుల నాయకుడు తన అనుచరులందర్నీ ఒక చోటుకు చేర్చి, వాళ్ళు సింహాన్ని చూసి అంతగా హడలి చెల్లా చెదరైనందుకు కూకలు వేస్తున్నాడు. "మనది గరుడ వంశం! మన శక్తికీ,







ధాటికి యీ లోకంలో తిరుగు లేదు. మన వంశం వాళ్ళు తప్ప, ఆకాశంలోకి పక్షిలా ఎగర గలిగిన వాళ్ళు యింకెవరున్నారు? ఆ నిప్పులు కక్కే సింహాన్ని మీరు ఎగిరి వెళ్ళి, గరుడపక్షి సర్పాన్ని తన్నినట్టుగా తన్ని ముక్కలు ముక్కలు చేయవలసింది. అది. చేయకపోగా పిరికివాళ్ళలా పారి పోతున్నారు!" అంటున్నాడు వాడు.

జిత, శక్తివర్మలు అతణ్ణి సమీపించి బ్రహ్మదండి అతడి కోసం ఎదురు చూస్తున్నట్టు తెలియపరిచారు. బ్రహ్మదండి పేరు వింటూనే రెక్కల మనుషుల నాయకుడు, ముఖం కందగడ్డలా చేసుకుని, "మీ బ్రహ్మదండి మాంత్రికుడంటె నాకు అపనమ్మకం కలుగుతున్నది. తన మంత్ర శక్తితో ప్రతిదాన్నీ భస్మం చేయగలనని చెపుతూంటాడే, ఆ సింహాన్ని ఎందుకని భస్మం చేయలేదు? అది అరణ్యంలోకి పారిపోయింది. అది ఏ క్షణాన్నయినా తిరిగి వచ్చి, మావాళ్ళ వ్యాయామ క్రీడల్ని పాడు చేయవచ్చు," అన్నాడు కోపంగా.

జిత, శక్తివర్మలు వంగి వంగి దణ్ణాలు పెడుతూ, "ఆ నిప్పులు కక్కే సింహం కంటె కూడా ప్రమాదకరులైన వాళ్ళ వల్ల మనకు కీడు రానున్నది," అని చెప్పారు.



రెక్కల మనుషుల నాయకుడు తలకు తగిలించుకున్న గద్దముక్కు కుళాయిని ఒకసారి పైకెత్తి, "మనకు కీడు రానున్నదా? ఎవర్నుంచి? ఆ బిడాలీ, శ్వానకర్ణి ముఠాలు ఏకమై మన మీదికి దండు రావటం లేదు గదా?" అన్నాడు కొంచెం బెదురుగా.

"ఆ వివరాలు మాకు తెలియవు. మీరొక్కసారి దయ చేయండి. సర్వం బ్రహ్మదండి వివరిస్తాడు," అన్నారు జిత, శక్తివర్మలు.

రెక్కల మనుషుల నాయకుడు బ్రహ్మదండి మాంత్రికుడున్న చోటుకు బయలు దేరాడు. అతణ్ణి అంత దూరాన రావటం







చూస్తూనే బ్రహ్మదండి కూచున్న రాతి మీది నుంచి లేచి, అతడికి ఎదురు వెళ్ళి, "పులుగురాయా! దయ చేయండి, దయ చేయండి," అంటూ ఆహ్వానించాడు.

పులుగురాయా, అన్న పిలుపుతో ఉబ్బి పోయిన రెక్కల మనుషుల నాయకుడు, బ్రహ్మదండిని సమీపిస్తూ గాలిలోకి కొంచెం ఎగిరి పెద్దగా నవ్వుతూ, "బ్రహ్మదండీ, ఏమిటి మనకు రానున్న కీడు? నీ వాలకం చూస్తే, అలాంటి ప్రమాదం ఏమీ వున్నట్టు లేదే," అన్నాడు.

"కీడా? అలాంటిదేమీ లేకపోగా, మనకు గొప్ప మేలు కలిగే లక్షణాలు కనబడుతున్నవి. అడవిలో నీ అనుచరుల నుంచి దేవతకు బలి యివ్వనున్న యిద్దరు గుహవాసులను విడిపించిన ద్రోహుల ముఠా, ఆ కొండ గుహల్లో ఎక్కడో దాగి వున్నదని, నాకు గట్టి నమ్మకం కలిగింది. నిప్పులు కక్కే సింహం వెనకా ముందులు చూడకుండా, మన జనాల్లో పడి పారిపోయిన తీరు చూస్తే, ఆ దుర్మార్గులు దాన్ని చంపేందుకు ప్రయత్నించారనీ, అది తప్పించుకు పరిగెత్తిందనీ తెలియటం లేదా?" అన్నాడు బ్రహ్మదండి ఉత్సాహంగా.

బ్రహ్మదండి యిలా అనగానే, పులుగు రాయుడు ఎగిరి గంతేసి, "కేశవుడూ, వాడి అనుచరులా! ఇంక కావలసిం దేమిటి? నాకు అర్ధరాజ్యమూ, నీకు రాకాసిలోయలో వున్న వెండి బంగారాలూ! చూస్తారేం, పదండి, వాళ్ళనిప్పుడే కొండ గాలించి పట్టేద్దాం," అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు తనకు ప్రాణాపాయం కలిగినప్పుడల్లా, తనను పట్టుకున్న వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని వాగ్దానం చేశాడు. చండమండూకుడి నుంచి బయట పడేందుకు అతడికీ, తరవాత రెక్కల మనుషుల నాయకుడైన పులుగురాయుడికి





దొరికి అతడికీ, మీకు అర్ధరాజ్యం వస్తుందని మాట యిచ్చేశాడు. పైగా, చండమండూకుడి నరమాంస భక్షకులకు దొరికిన స్థూల కాయుణ్ణి, తనకు తోడుగా వుంటాడని చెప్పి, మండూకుణ్ణించి ఆ బానిస యువమానిని కాపాడి, తన వెంట తెచ్చుకున్నాడు.

పులుగురాయుడి తొందరపాటు చూసి బ్రహ్మదండి మాంత్రికుడు ముఖం చిట్లించి, "పులుగురాయా, యిది వేగిరపాటుకు సమయం కాదు. కేశవుడూ, అతడి వెంట వున్న జయమల్లూ, కోయవాడూ మహా జిత్తులమారి వెధవలు. మనం ఒక్కుమ్మడిగా కొండ గుహల కేసి వెళితే, వాళ్ళు గుహ కందరాల్లో పడి మనకు చిక్కకుండా పారిపోగలరు. వాళ్ళను గుహలు విడిచి వచ్చేలా చేయాలి. అప్పుడు మనం వాళ్ళను చేజిక్కించుకోవచ్చు," అన్నాడు.

"అదెలా సాధ్యం? నువ్వు చెప్పేదాన్ని బట్టి చూస్తే వాళ్ళేమీ అమాయకులు కాదే," అన్నాడు పులుగురాయుడు.

"వాళ్ళ జిత్తులమారి తనాన్ని, కాలభైరవుడి కరుణాకటాక్షం వల్ల నేను జయిస్తాను. దానికి మన స్థూలకాయుడు... ఆ బానిస యువమాని వున్నాడే...వాడి సహాయం అవసరం. ఆ మాంసం పోగును



పిలిపించండి," అన్నాడు బ్రహ్మదండి.

వెంటనే పులుగురాయుడు తన అనుచరులను బానిస యువయువమాని కోసం పంపాడు. ఈ లోపల బ్రహ్మదండి, తన అంగరక్షకులైన జిత, శక్తివర్మలతో బయలుదేరి, కొంత దూరం వెళ్ళి, చెట్ల చాటున వున్న ఒక గుడిసె ముందు నిలబడ్డాడు.

"నీ ఎత్తుగడ ఏమిటి బ్రహ్మదండీ? మళ్ళీ ఏదో కొంప మీదికి తెచ్చేట్టున్నావు. ఆ మహాకాయుడికి ఎలాంటి పని ఒప్పచెప్పబోతున్నావు?" అని అడిగాడు జితవర్మ.

"నీ చచ్చు ప్రశ్నలతో నా ఆలోచన చెడకొట్టకు. ఆ బానిస యువమానిని నర







భక్షకులు తినకుండా కాపాడింది, నేను. ఆ కారణం వల్ల వాడు నా బానిస కింద లెక్క. నేను యిష్టమొచ్చిన విధంగా వాణ్ణి ఉపయోగిస్తాను," అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు విసుగ్గా.

"వాడు, నీ బానిస ఎలా అవుతాడు? వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని ప్రమాణం చేశావుగదా?" అని అడిగాడు శక్తివర్మ.

"వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని, ప్రమాణం చెయ్యలేదు. అర్ధరాజ్యంలో తనకు నచ్చిన వాళ్ళను బానిసలుగా పట్టుకుపోయి అమ్ముకునే అధికారం యిస్తానన్నాను," అన్నాడు బ్రహ్మదండి కోపంగా.

ఆ సమయంలో ఫులుగురాయుడు వాళ్ళను సమీపించి, "ఏమిటి, మీలోమీరు పోట్లాడుకుంటున్నారులా వుంది?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి చప్పున అతడి కేసి తిరిగి చిరునవ్వు నవ్వుతూ, "పోట్లాట కాదు. నా అంగరక్షకు లిద్దరూ స్వయంగా కొండ గుహల్లోకి వెళ్ళి, ఆ కేశవుడి ముఠాను పట్టుకొస్తామంటున్నారు. నేను తొందర పడ వద్దని చెపుతున్నాను," అన్నాడు.

ఆ తరవాత ఒకటి రెండు నిమిషాలకు స్థూలకాయుడు రెక్కల మనుషుల వెంట బ్రహ్మదండి వున్న చోటుకు వచ్చి, "ఏం, మహామాంత్రికా! నాతో కావలసిన పనేమిటి?" అంటూ భుజాన వేళాడుతున్న కొరడా చేతిలోకి తీసుకున్నాడు.

బ్రహ్మదండి, స్థూలకాయుణ్ణి దూరంగా తీసుకుపోయి రహస్యంగా అతడితో కొంత సేపు మాట్లాడాడు. మాంత్రికుడి మాటలకు అతడు మొదట్లో భయం బెదురూ కనబరిచినా, ఆఖరుకు తృప్తుడైనట్టు ముఖం పెట్టి, కొరడాను పైకెత్తి పెద్దగా ఝళిపించి, కోర మీసాలను మెలి వేసి, ఒక రంకె వేశాడు.

బ్రహ్మదండి, ఫులుగురాయుడి దగ్గిరకు వచ్చి, "ఫులుగురాయేంద్రా! కేశవుడు యిక మన అరచేతి ఆమలకం, తిరుగు





లేదు. తమరూ, తమ అనుచరులు కొద్ది మంది మాతో కలిసి, ఆ రాతి గుట్టలున్న ప్రదేశానికి రండి. స్థూలకాయుడు ఒక నాటకం ఆడబోతున్నాడు. అంతా ఒక్క నిమిషం పని. వివరాలు యిప్పుడడక్కండి," అన్నాడు ప్రాధేయపడుతున్నట్టు.

ఆ వెంటనే పులుగురాయుడు నలుగు రైదుగురు అనుచరులతో బ్రహ్మదండి చెప్పిన గుట్టల ప్రదేశానికి బయలుదేరాడు. బ్రహ్మదండీ, జిత శక్తివర్మలు అతన్ని అనుసరించారు. స్థూలకాయుడు కొరడాను గాలిలో గిర్రున తిప్పుతూ, వాళ్ళ వెనగ్గా నడిచి వెళ్ళి, గుట్టలలో వున్న ఒక పెద్ద రాతి మీద ఎక్కి, బ్రహ్మదండి ముఠా దగ్గిరకు రాగానే, వాళ్ళను కొట్టబోతున్న వాడిలా కొరడా ఝళిపిస్తూ, "ఏయ్, బ్రహదండీ, జితా శక్తీ, పులుగురాయా! యిక మీరు నా నుంచి పారిపోలేరు. మిమ్మల్నందర్నీ, ఆ కేశవుడికి అమ్మేస్తాను. అతడి చేతిలో మీకు చిత్రవధ తప్పదు. మీరు చావగానే, ఆ కేశవుడు నిరాటంకంగా రాకాసిలోయకు వెళ్ళి ధనరాసులు తెచ్చు కుంటాడు. నేనూ అతడి వెంట వెళతాను," అంటూ కొండలు మార్మోగేలా అరవసాగాడు.

గుహ కప్పులో వున్న కంత గుండా యిదంతా చూస్తున్న కేశవుడికీ, జయ



మల్లుకూ, కోయగోమాంగ్‌కూ చాలా ఆశ్చర్యం కలిగింది. మహాక్రూరుడైన స్థూలకాయుడు బతికి వుండటమేగాక, వాడు బ్రహ్మదండినీ వాడి అనుచరులనూ బాని సలుగా పట్టుకున్నాడంటే, వాళ్ళకు నమ్మ శక్యం కాకుండా వున్నది.

"కేశవా, యిందులో ఏదో పెద్ద మోసం వున్నది," అన్నాడు జయమల్లు. కేశవుడు ఏదో జవాబు చెప్ప బోయేంతలో, స్థూలకాయుడు కొరడాను ఛపీ మని ఒకసారి మోగించి, "యిక మీరంతా వెళ్ళండి, బ్రహ్మదండీ! జాగర్త, ఆ చీకటి గుడిశె దాటిపోయారో, నా నౌకర్లు మిమ్మల్నందర్నీ నిలువునా కోసేస్తారు," అంటూ గావు కేక పెట్టాడు. ఆ తరవాత బ్రహ్మదండీ వాళ్ళు వెళ్ళి పోవటం కేశవుడికీ అతడి అనుచరులకూ కనిపించింది. స్థూలకాయుడు మాత్రం యింకా రాతి మీదే నిలబడి మీసాలు మెలి వేస్తూ, కొరడాను గాలిలో తిప్పుతూ ఛెళ్ళు ఛెళ్ళుమనిపిస్తున్నాడు.

"మల్లూ! యిదే మనకు మంచి అదను. స్థూలకాయుణ్ణి పట్టుకుని అసలు రహస్య మేమిటో తెలుసుకుందాం. ఒకవేళ బ్రహ్మదండీ, రెక్కల మనుషులూ మన మీదికి దాడి చేయవస్తే, తిరిగి యిదే కంతకుండా గుహలో ప్రవేశించి కనబడకుండా మాయం కావచ్చు," అంటూ కేశవుడు కంత నుంచి బయిటికి వచ్చి, నేల మీద పాకుతూ స్థూలకాయుడు నిలబడి వున్న రాతి కేసి బయలు దేరాడు. జయమల్లు కేశవుణ్ణి తొందర పడ వద్దని హెచ్చరించబోయాడు. కాని, కేశవుడు అసరికే అయిదారు గజాల దూరం ముందుకు వెళ్ళిపోయాడు.

ఇక చేసేదిలేక జయమల్లూ, కోయ గోమాంగ్‌లు కూడా కేశవుడి వెనక పాకుతూ బయలుదేరారు. —(ఇంకా వుంది)








## 28

[బ్రహ్మదండి మాంత్రికుడు, కేశవుడూ వాళ్ళు, కొండ గుహల్లో దాగి వున్నారని గ్రహించాడు. ఆ వెంటనే అతడు స్థూలకాయుణ్ణి కొండ దగ్గిరకు పంపి, రామంతా అతడికి చానినలుగా దొరికినట్టు, కేకలు వేయించాడు. అది విన్న కేశవుడూ అతడి అనుచరులు గుహ నుంచి బయిటికి వచ్చి, స్థూలకాయుడి కేసి పాకుతూ రాసాగారు. తరవాత—]

కేశవుడు నిశ్శబ్దంగా పాకుతూ పోయి, స్థూలకాయుడు నిలబడి వున్న రాతి వెనక ఆగి, కత్తిని అతడి కాళ్ళకు అడ్డంగా ఆనించి, "స్థూలకాయా! చెప్పేది నిశ్శబ్దంగా విను. ఆటూ యిటూ గెంతటంగాని, నీ వెనక ఎవరో వున్నట్టు సూచనగాని చేశావే, నీ రెండు కాళ్లూ ఒక్క వేటుకు తెగిపోగలవు," అన్నాడు గొంతు తగ్గించి మాట్లాడుతూ.

స్థూలకాయుడు ఒక క్షణకాలం స్తంభించిపోయాడు. తరవాత నిలువెల్లా ఓసారి వణికిపోయాడు. ప్రాణభీతితో ఒక్కసారిగా అరుద్దామనుకున్నాడు గాని, కేశవుడి హెచ్చరికా, పదునుగా కాళ్ళకు ఆనించబడి ఒరుసు కుంటున్న కత్తీ, అతడి బుద్ధిని అదుపులో పెట్టినై.

"ఎవరు నువ్వు? కేశవుడివి కాదు గదా?" అన్నాడు స్థూలకాయుడు వినపడీ వినపడనట్టు.

"నేను కేశవుణ్ణే! నా వెనక పది పదిహేను మంది కత్తులవాళ్ళూ, బాణాల







వాళ్ళూ వున్నారు. కదిలావో, చచ్చినవాడివే! ఇక చెప్పు! నువ్వు, నిజంగా బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ ఆ పక్షివేషంవాణ్ణీ బానిసలుగా పట్టుకున్నావా? లేక అంతా కపట నాటకమా?" అని ప్రశ్నించాడు కేశవుడు.

"అంతా కపట నాటకమే. ఆడేది నేనైనా, ఆడిస్తున్నవాడు ఆ మాంత్రిక వెధవ. ప్రాణభయం కొద్దీ వాడు చెప్పినదానికి ఒప్పుకున్నాను. నన్ను చంపకు, నీ పుణ్యముంటుంది," అంటూ స్థూలకాయుడు బావురుమన్నాడు.

స్థూలకాయుడు బొమ్మలా కదలామెదలక నిలబడి వుండి, పెదాలు మాత్రం ఆడిస్తూ ఏవో ధ్వనులు చేస్తూ వుండటం, అల్లంత దూరంలో వున్న చెట్ల చాటు నుంచి గమనిస్తున్న బ్రహ్మదండికీ, పులుగు రాయుడికీ ఆశ్చర్యం కలిగించింది.

"వాడట్టా ఎండు మానులా నిగ్ర నిగడదీసుకు పోయాడేం? ఏదైనా గుర్రపు వాత రోగం కాదుగదా?" అన్నాడు పులుగు రాయుడు కోపంగా.

బ్రహ్మదండి ఆ ప్రశ్నకు అడ్డంగా తలాడిస్తూ, "అలాంటిదేం కాదని నా అనుమానం. వాడు మనం వేసిన గాలం! ఆ గాలానికి చేప పడిందని నాకు తోస్తున్నది. అయినా సంశయం ఎందుకు? ఒకసారి సొంజ్ఞ చేసి చూద్దాం. జవాబు వస్తుందో లేదో తెలిసిపోతుంది," అంటూ తన మంత్రదండాన్ని పైకెత్తి, స్థూలకాయుడి కేసి ఆడించాడు.

బ్రహ్మదండికి జవాబిచ్చేందుకు స్థూలకాయుడు తన చేయి ఎత్తబోయి, అంతలో కేశవుడి కత్తి కాళ్ళను మరింత గట్టిగా ఒరుసుకోవటంతో ఆగిపోయాడు.

కేశవుడు తన పక్కనే వున్న జయమల్లూ, కోయగోమాంగ్‌ల కేసి తల తిప్పి, "ఏదేదో తన మిత్రులకు చెప్ప చూస్తున్నట్టున్నది," అన్నాడు.









"అందుకు సందేహం లేదు. కాని, మనకు రానున్న ప్రమాదం ఆలోచించావా? ఆ బ్రహ్మదండీ, పక్షి ముఖం వాడూ యీ సరికే మనను పట్టేందుకు, తమ అనుచరులతో బయలుదేరి వుండవచ్చు," అన్నాడు జయమల్లు.

కేశవుడు తన కత్తిని స్థూలకాయుడి మోచేతికి ఒకసారి తాకించి, "నిజం చెప్పక పోయావో, నీ కాళ్ళతోపాటు, చేతులు కూడా నరికేస్తాను. ఇప్పుడు బ్రహ్మదండీ, పక్షిముఖం వాడూ ఏం చేస్తున్నారు?" అని అడిగాడు.

"వాళ్ళిద్దరూ తల లొక చోట చేర్చారు; ఏదో రహస్యాలోచన చేస్తున్నట్టున్నది. జిత శక్తివర్మలు తమ కత్తుల్ని చెట్టు బోదె మీద సాన బెడుతున్నారు," అన్నాడు స్థూలకాయుడు. వాడు చెప్పిన దాంట్లో అబద్ధం ఏమీ లేదు. బ్రహ్మదండీ, పులుగురాయుడూ కలిసి ఆసరికే కొందరు రెక్కల మనుషుల్ని, శత్రుబలమేపాటో తెలుసుకు వచ్చేందుకు పంపారు. వాళ్ళల్లో కొందరు పెద్ద పెద్ద వృక్షా లెక్కి, అక్కణ్ణించి రాతి మీద నిలబడి వున్న స్థూలకాయుణ్ణీ, ఆ వెనక నక్కి వున్న కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ చూశారు.

"ఇంతకూ శత్రువులు ముగ్గురే ముగ్గురు! పిల్లి కూనల్ని పట్టినట్టు వాళ్ళను మెడలు పట్టి యివతలికి యీడ్చవచ్చు," అనుకుంటూ - రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు పరిగెత్తుకు వెళ్ళి, తాము చూసింది చెప్పారు.

తన అనుచరులు యిచ్చిన భోగట్టా వింటూనే, పులుగురాయుడు కనుబొమలు ముడిచి, "ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది, బ్రహ్మదండీ! ముగ్గురే ముగ్గురు మానవ మాత్రులు, యింత ధైర్యంగా మన మధ్యకు వస్తారంటే నేను చచ్చినా నమ్మను," అన్నాడు.









"వాళ్ళ సంగతి తెలియకపోతే నేనూ నమ్మను!" అంటూ బ్రహ్మదండి పెద్దగా నవ్వి, "వాళ్ళల్లో ఒకడు కేశవుడూ, రెండవ వాడు జయమల్లనే నా పూర్వ శిష్యుడూ. పోతే, ఆ మూడవవాడు కోయకుంత అయి వుంటాడు. ఆ ముగ్గురూ మహిష లగ్నంలో పుట్టినవాళ్ళు. ఆ జాతకులకు వెనక చూపూ వుండదు, ముందు చూపూ వుండదు. ఏటికి అడ్డంపడి యీదటమే," అన్నాడు.

"అయితే యిప్పుడు మనం చేయవలసిం దేమిటి?" అన్నాడు పులుగురాయుడు.

"ఏముంది, వాళ్ళ ముగ్గుర్నీ చుట్టు ముట్టి పట్టేద్దాం," అన్నాడు బ్రహ్మదండి.

"వాళ్ళా, బాణాలూ, కత్తులూ వెంట వుంచుకు తిరిగేవాళ్ళే. అంత తేలిగ్గా దొరుకుతారని నేననుకోను. మనలో చాలామందిమి చావ వలసి వస్తుంది. ముందు ఆ స్థూల కాయుణ్ణి వాళ్ళు చంపేస్తారు," అన్నాడు పులుగురాయుడు.

"వాడు సరభకకులకు దొరికి ఎప్పుడో చచ్చినవాడే, నేను ప్రాణం పోసి వెంట పెట్టుకు వచ్చాను. ఆవ్యాళితో వాడికి ఆయుష్షు తీరిపోయిందనుకుందాం! పోతే, నువ్వూ నేనూ ఎంతో కాలం బతికి వుండి, అర్ధరాజ్యమూ, రాకాసిలోయలోని ధన రాసులూ అనుభవించ వలసిన వాళ్ళం. అందువల్ల మనం తొందరపడి, ఆ దుర్మా ర్గుల బాణం వేటుకు అందే దూరంలోకి వెళ్ళకూడదు. నీ నా అనుచరుల్ని, వాళ్ళను పట్టి తెచ్చేందుకు పంపుదాం," అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు.

"అంతే చేద్దాం," అంటూ పులుగు రాయుడు పక్కకు తిరిగి తన అనుచరు లకు సౌంజ్ఞ చేశాడు. వెంటనే ముప్పై నలభై మంది రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు వచ్చారు. పులుగురాయుడు వాళ్ళతో కొంచెంసేపు రహస్యంగా మాట్లాడి, యిక వెళ్ళమన్నట్టు చేతులు వూపాడు.



రెక్కల మనుషులు రెండు ముఠాలుగా చీలిపోయి, కొందరు చెట్ల మీదికి ఎక్క సాగారు. మరి కొందరు రాళ్ళ వెనక నక్కుతూ, స్థూలకాయుడున్న ప్రదేశానికి బయలుదేరారు.

“ఏం, జితా, శక్తీ! మీ రిక్కడే వున్నా రేం? ఆ కేశవుడూ వాళ్ళను పట్టేందుకు సాయపడరా?” అని అడిగాడు పులుగు రాయుడు జితశక్తివర్మలను.

ఆ ప్రశ్న వింటూనే జితశక్తివర్మలు పదును పెడుతున్న కత్తులను ఒరలలో పెట్టి, “ఆ నీచుల్ని పట్టుకుని, మా చేతుల్ని మలినం చేసుకుంటామా! మా పని బ్రహ్మ దండి మాంత్రికుడి అంగరక్షణ చేయటం. బ్రహ్మపుర రాజగురువు మమ్మల్ని పంపింది అందుకేగదా, బ్రహ్మదండీ?” అంటూ మాంత్రికుణ్ణి ప్రశ్నించారు.

బ్రహ్మదండి వచ్చే కోపాన్ని దిగ మింగుతూ, “అవును, అవును,” అంటూ తలాడించి వూరుకున్నాడు.

ఈలోపల రెక్కల మనుషులు తమ మీద దాడికి వస్తున్నట్టు ముందుగా చూసి కేశవుడికీ జయమల్లుకూ కోయగేమాంగ్ హెచ్చరిక చేశాడు. మహావృక్షాల మీదికి పాకిపోతున్న వాళ్ళను చూస్తూనే కేశవుడు



నవ్వి, “ఈ పక్షి వెధవలు అంత ఎత్తు నుంచి, మన మీదికి దూకి, మనను పట్టు కుంటారన్నమాట! సరే, బాణాలు ఎక్కు పెట్టి, ముందు ఒకళ్ళిద్దర్ని పడకొట్టండి, మిగతా వాళ్ళు పారిపోతారు. ఇంతకూ వీళ్ళ నాయకు లెక్కడ?” అన్నాడు, విల్లంబులు చేతికి తీసుకుంటూ.

ఆ వెంటనే జయమల్లూ, గోమాంగ్ కూడా తమతమ విల్లంబులు తీసుకున్నారు. కేశవుడు చెట్ల మీదికి పాకుతున్న ఒక రెక్కల మనిషి మీదికి గురిపెట్టిన బాణాన్ని చప్పున దించుతూ, జయమల్లుకేసి తిరిగి, “జయమల్లూ! వీళ్ళ నెంతమందిని చంపినా









మనకు కలిగే మేలులేదు. ఆ బ్రహ్మదండిని ముందు మారణం చెయ్యాలి. వాడెక్కడ? వాడూ మన మీదికి వస్తున్నాడా? ఏయ్, స్థూలకాయా! బ్రహ్మదండి యిటుకేసి వస్తున్నాడా? నిజం చెప్పు," అని స్థూలకాయుణ్ణి ప్రశ్నించాడు.

స్థూలకాయుడు నిలువెల్లా వణికిపోతూ, "వాడు రావటంలేదు. వాడూ, పిట్టల నాయకుడూ చెట్ల కింద నిలబడి యిటుకేసే చూస్తున్నారు," అన్నాడు.

"ఆ దుర్మార్గుడికి మన శక్తేమిటో తెలుసు, కేశవా! సరే, యిక మనం యిక్కడ కాలయాపన చెయ్యకూడదు. ఇద్దరు ముగ్గురు రెక్కల మనుషుల్ని పడకొట్టి, మనం గుహ కంతలో నుంచి తిరిగి కొండ పొట్టలోకి వెళ్ళిపోదాం," అంటూ జయమల్లు బాణం గురి చేసి చెట్ల మీదికి చరచరా పాకిపోతున్న రెక్కల మనుషుల్లో ఒకడి మీదికి దాన్ని వదిలాడు.

కేశవుడూ, అతడి అనుచరులు తమ దృష్టిని రెక్కల మనుషుల మీదికి మళ్ళించారని గ్రహించిన స్థూలకాయుడు రాతి మీది నుంచి ఛెంగున కిందికి దూకి, కాలి సత్తువ కొద్దీ, బ్రహ్మదండి, పులుగురాయుళ్ళ కేసి పరిగెత్తుతూ, "వాళ్ళు అంతా కలిసి ముగ్గురే! చంపండి, పట్టుకొండి," అంటూ అరవసాగాడు.

"ఆహాఁ, కేశవా! ఈ దుర్మార్గుడు మన నుంచి బతికి బయటపడ్డాడు. అయినా, ఒక దెబ్బ కొట్టి చూద్దాం, తగులుతుందేమో!" అంటూ కోయగోమాంగ్ లేచి నిలబడి పారిపోతున్న స్థూలకాయుడి మీదికి బాణం వదిలాడు. కాని, ఆ బాణం స్థూలకాయుడి పక్కగా దూసుకుపోయి, బ్రహ్మదండి, పులుగురాయుడూ నిలబడివున్న చెట్టు బోదెకు టపీ మని తగిలింది.

బాణం చేసిన ధ్వని వింటూనే బ్రహ్మదండి ఎగిరి గంతేసి, "ఆ దుర్మార్గులు





ముగ్గురూ మన మీదికే బాణాలు వదులుతున్నారు పులుగేంద్రా! పరిగెత్తు!" అంటూ వెనుదిరిగి చెట్లలోకి పారిపోసాగాడు. పులుగురాయుడూ, ఇతర శక్తివర్మలూ అతణ్ణి అనుసరించారు.

గోమాంగ్‌తో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా లేచి నిలబడ్డారు. వాళ్ళకు పారిపోతున్న బ్రహ్మదండి ముఠా కనిపించింది. వాళ్ళను వెంట పడి తరమటమా, మానటమా అని వాళ్ళు ఆలోచించేంతలో చెట్ల మీది నుంచి, చావగా మిగిలిన రెక్కల మనుషులు భయంకరంగా అరుస్తూ, వాళ్ళ మీదికి ఎగిరి రాసాగారు.

కేశవుడూ, అతడి అనుచరులు బాణాలు ఒక దాని వెంట ఒకటిగా కిందికి దూకుతున్న రెక్కల మనుషుల మీదికి వదిలారు. వాళ్ళల్లో బాణం దెబ్బలు తగిలిన కొందరు బాధతో అరుస్తూ, అంత ఎత్తు నుంచి గాలిలో పల్టీలు కొడుతూ కిందపడసాగారు.

ఇక తిరిగి తాము గుహలో ప్రవేశిద్దామని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకుని వెనుదిరిగేంతలో, రెక్కల మనుషుల్లో రెండవ ముఠా రాళ్ళ చాటు నుంచి ఒక్కుమ్మడిగా గావు కేకలు పెడుతూ, లేచి నిలబడ్డారు. వాళ్ళందరి వద్దా పొడవైన ఈటెలు వున్నవి.



"ఇక బాణాలతో లాభం లేదు, కత్తులకు పని చెప్పండి. శత్రువులు మన గుహ మార్గాన్ని అడ్డుకున్నారు. పోరాడుతూ వీళ్ళ చక్రబంధం నుంచి బయట పడటం ఒక్కటే యిప్పుడు మనం చేయవలసింది. మనం వీళ్ళకు దొరక్కుండా ఎటు పారిపోయినా ఫరవా లేదు," అంటూ జయమల్లు కత్తి దూసి రెక్కల మనుషుల్ని ఎదుర్కొన్నాడు.

కేశవుడూ, గోమాంగ్, జయమల్లుల కత్తి దెబ్బలకు రెక్కల మనుషుల్లో ఒక్కొక్కడే చావు కేక పెట్టి కింద పడసాగారు. వాళ్ళు చేతులకు కట్టు కున్న పక్షి రెక్కలు, ఈ ద్వంద్వ యుద్ధంలో వాళ్ళకు చాలా ఆటంకంగా తయారయినై. వాళ్ళల్లో కొందరు ఈటెలను అటూ యిటూ తిప్ప బోయి, ఆ వేగానికి కట్టుకున్న రెక్కలు ఒకదాన్నొకటి మెలివేసు కోవటంతో, చాప చుట్టల్లా కింద పడసాగారు.

"మనం జయించాం, కేశవా! ఇక, మనం గుహలోకి ప్రవేశించి, క్షేమంగా శ్వాసకర్ణి ముఠాను చేరవచ్చు," అంటూ జయమల్లు అటుకేసి రెండడుగులు వేసి నిశ్చేష్టుడైపోయాడు.

ఎదురుగా దడి కట్టినట్టు నిలబడిన తన అనుచరులతో పులుగురాయుడు ప్రత్యక్షమయాడు. జయమల్లుతో పాటు, కేశవుడూ, కొయుగోమాంగ్ కూడా అటుకేసి చూసి, తరవాత చుట్టూ కలయచూశారు. వలయాకారంలో తమను రెక్కల మనుషులు వందల సంఖ్యలో చుట్టు ముట్టినట్టు వాళ్లు గ్రహించారు. బ్రహ్మదండి ఎక్కడ? అన్న అనుమానం వాళ్ళకు కలిగింది. ఆ వెంటనే బ్రహ్మదండి మాంత్రికుడి కంచు కంఠం పలికింది: "ఆ కేశవుణ్ణి మాత్రం ప్రాణాలతో పట్టుకుని, మిగతా యుద్ధుల్ని నిలువునా నరికేయండి!" —(ఇంకా వుంది)








## 29

[ కేశవుడూ అతడి అనుచరులను పట్టుకునేందుకు, బ్రహ్మదండి మాంత్రికుడు చేసిన తంత్రం పారింది. బ్రహ్మదండి, పులుగురాయుడూ తమ అనుచరులతో, కేశవుణ్ణీ అతడి స్నేహితు లిద్దర్నీ చుట్టు ముట్టారు. బ్రహ్మదండి కేశవుణ్ణి ప్రాణాలతో పట్టుకుని, తతిమ్మా యిద్దర్నీ నిలువునా నరికి వేయమని కేకపెట్టాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడి కేక వింటూనే కేశవుడు, ఆ ధ్వని వచ్చిన వైపుకు తల తిప్పాడు. తనకు అడ్డంగా వున్న రెక్కల మనుషులను పక్కకు తొలగ తోస్తూ, మాంత్రికుడు ముందుకు వచ్చాడు. అతడికి యిరు వైపులా జిత, శక్తివర్మలు కత్తులు దూసి నిలబడి వున్నారు. బ్రహ్మదండిని చూస్తూనే కేశవుడు కళ్ళెర్ర చేసి ముందుకు ఉరక బోయాడు. అంతలో నలుగు రైదుగురు రెక్కల మనుషులు అతడి మీద పడి ఆయుధాలన్నీ లాగి వేశారు. ఆ తరవాత జయమల్లూ, కోయగోమాంగ్ కూడా నిరాయుధులుగా చేయబడ్డారు.

నిస్సహాయంగా నిలబడి వున్న ఆ ముగ్గురి కేసి చూసి, జిత, శక్తివర్మలు వికటంగా ఒక పెద్ద నవ్వు నవ్వి, కత్తులు పైకెత్తుతూ, "ఆహాఁ, కత్తుల్ని యింతకు ముందే బాగా సాన పట్టి వుంచటం మంచిదయింది. ఒక్క వేటుతో రెండు తుండేలు చేయగలం!" అంటూ ముందుకు రాబోయారు. కాని,







అంతలో స్థూలకాయుడు తన కొరడాను పైకెత్తి పెద్దగా రంకె పెట్టి, వాళ్ళ కత్తుల్ని కొరడాతో చుట్ట బెడుతూ, "ఏయ్ః, జితా, శక్తీ! ఆగండి. వాళ్ళను చంపేందుకు వీలులేదు. వాళ్ళు ఒకప్పుడు నా బానిసలు. అరవై బంగారు కాసుల విలువ చేస్తారు. ఆ డబ్బు ముందు నా కిచ్చి తరవాత మీ యిష్టం వచ్చినట్టు చంపుకోండి," అన్నాడు.

స్థూలకాయుడి మాటలకు జితవర్మ తోక తొక్కిన తాచులా లేచి, "ఓయ్ః మాంసం పోగూ! ముందు నువ్వు ఆ కొరడాను నా కత్తికి అడ్డం తియ్యి. వాళ్ళిప్పుడు నీ బానిసలు కారు. వాళ్ళ నెప్పుడో అమ్ముకున్నావ్. ఆ కొన్న వర్తకులు చచ్చారు కూడా!" అన్నాడు.

"ఆ వర్తకులు చచ్చారు గనకే, నా వస్తువులు తిరిగి నా పరం అయినై. నీకీ పాటి వ్యవహార జ్ఞానం కూడా లేదా? అయ్యో, అనాగరిక మానవుడా!" అన్నాడు స్థూలకాయుడు.

జిత, శక్తివర్మలు రెచ్చిపోయి, కత్తులు జార విడిచి స్థూలకాయుడి మీద కలియబడ్డారు. స్థూలకాయుడు వాళ్ళను పిల్లి ఎలుకను పట్టినంత ఒడుపుగా పట్టుకుని నేల కేసి కొట్టాడు.

అంతవరకూ వినోదం చూస్తున్న వాడిలా నిలబడిన బ్రహ్మదండి మాంత్రికుడు, తన మంత్ర దండాన్ని పైకెత్తి ఒకసారి ఛీ అంటూ చీదరించుకుని, పులుగురాయుడి కేసి తల తిప్పి, "పులుగేశా! యిక మనం చూస్తూ వూరుకుని లాభం లేదు. ఈ మతిలేని వెధవలు ముగ్గురూ కుక్కల్లా కాట్లాడుకుని, ఆ కేశవుణ్ణి కూడా చంపటమో, లేక వాడు తన అనుచరులతో పారిపోయేందుకు అవకాశం కలిగించటమో చేస్తారు. ముందు ఆ కాట్ల కుక్కల్ని విడదీయండి," అన్నాడు.

పులుగురాయుడు తన చేతిలో వున్న ఈటెను పోట్లాడుకుంటున్న వాళ్ళ కేసి





గురి పెట్టి, "జితా, శక్తీ! మీరిక ఆ ఎను బోతుగాణ్ణి వదలండి. ఈ దొరికిన ముగ్గురూ నా వాళ్ళు. వాళ్ళను పట్టుకున్నది, నేను. తెలిసిందా?" అన్నాడు రౌద్రంగా.

పులుగురాయుడి హెచ్చరిక వింటూనే జిత, శక్తివర్మలు స్థూలకాయుడి పట్టు విడిపించుకుని, కింద పడి వున్న తమ కత్తుల్ని తీసుకుని, దూరంగాపోయి, పళ్ళు కొరుకుతూ నిలబడ్డారు.

స్థూలకాయుడు రొప్పుతూ తన కొరడా భుజాన వేసుకుని బ్రహ్మదండి మాంత్రికుడి కేసి గుడ్లురుముతూ చూశాడు.

బ్రహ్మదండి కేశవుణ్ణి సమీపించి అతడి భుజం పట్టుకుని కుదుపుతూ, "వత్సా, కేశవా! నీ మేలుకోరే నన్ను, నా శిష్య ద్రోహి బడుమల్లు చెప్పుడు మాటలు విని ఎంత అపార్థం చేసుకున్నావో, ఆలోచిస్తూంటే నా ఆత్మ గిలగిల కొట్టుకుంటున్నది. నిన్ను కోటీశ్వరుణ్ణి చేయటమేగాక, లోకానికే అధిపతిని చేద్దామనుకున్నాను. ఇది, నా కోర్కె మాత్రమే కాదు; ఆ ఉపాసకుల ఊడల మర్రి కాలభైరవుడి ఆజ్ఞ! ఆ శత్రుల పాలిటి బ్రహ్మయముడే నిన్ను తిరిగి నా పరం చేశాడు. మన యిద్దరం ఏకమవటం అంటే అగ్నికి వాయువు తోడైనట్టే. మన దెబ్బకు



తిరుగు వుండదు. ఏమంటావ్?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి మాటలు వింటూంటే కేశవుడికి ఒళ్ళు మండి పోయింది. అతడు మాంత్రికుడి చేతిని తన భుజం మీది నుంచి విసురుగా లాగి వేసి, "బ్రహ్మదండీ, నీ కల్లబొల్లి మాటలు నేను నమ్ముతా ననుకోకు. నీ వేపాటి మంత్ర శక్తి గల వాడవో నాకు తెలుసు!" అన్నాడు ఉద్రేకంగా.

బ్రహ్మదండి లోపల పొంగే కోపాన్ని అణుచుకుంటూ, "కేశవా, యీ ఒక్క సారికి నీ యీసడింపు మాటలను సహించాను. మరోసారి నా మంత్ర శక్తిని కించ







వదుస్తూ మాట్లాడావే, నిన్ను నిలువునా బూడిద చేసి, ఆది శరీరానికి రాసుకుని ఆ కనబడే మొసళ్ళ మడుగులో స్నానం చేసి, నా కాలభైరవుడి దగ్గిరకు వెళ్ళి పోతాను. ఈ జయమల్లు కుంకకు ఒక్క చారల గాడిద వేషం వేసే మంత్రం తప్ప మరేం తెలుసు?" అంటూ జయమల్లు కేసి తిరిగి, "ఈ ద్రోహిని, ఆ కోయ వెధవనూ ఈటెలతో శరీరాలు తూట్లు తూట్లుగా పొడిచి, గద్దలకు ఆహారంగా వెయ్యండి," అన్నాడు పళ్ళు పటపట కొరుకుతూ.

బ్రహ్మదండి మాంత్రికుడు మాట ముగించే లోపలే జిత, శక్తివర్మలు కత్తులెత్తి జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ పొడవ బోయేంతలో, పులుగురాయుడు తన ఈటెతో వాళ్ళ కత్తులను కింద పడేలా కొట్టి, "ఆగండి, ఆగండి! 'గద్దలకు ఆహారం' అన్న మాట వింటూనే నాకో ఆలోచన వచ్చింది. వీళ్ళిద్దరి రూపు రేఖలూ చూస్తూంటే వీళ్ళు గద్ద జాతి మానవుల్లా కనిపిస్తున్నారు. మా గరుడ జాతి వాళ్ళకు, గద్ద జాతి వాళ్ళు సర్వ కాలాల్లో సేవకా వృత్తి చేసి బతకాలని శాస్త్రం వున్నట్టు విన్నాను. కనక, వీళ్ళిద్దరూ నా సేవకులు," అంటూ తన అనుచరుల కేసి తిరిగి, "ఒరేయ్, వీళ్ళను నా గృహానికి తీసుకు పోయి జాగ్రత్తగా కాపాడండి. నా ఈడు పులా ఆవీ చెదలు పట్టకుండా దులిపి ఎండ వేసే పని నేర్పండి. వాళ్ళు పారిపోయారో, మీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

పులుగురాయుడి అనుచరులు జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ భుజాలు పట్టుకుని యీడ్చుకు పోబోయేంతలో, బ్రహ్మదండి వాళ్ళకు అడ్డు పడి, పులుగు రాయుడితో, "పులుగు ప్రభో! మీరు అతిగా తొందర పడకండి. వీళ్ళ సంగతి మీకు ఆవగింజంత కూడా తెలీదు. వీళ్ళు పారి పోతారనే భయం మీ కొద్దు. వాళ్ళు పారి





పొదరిస్తే, మీ ప్రాణాలు తీసిం తరవాతే పారిపోతారు. నా మాట విని, వీళ్ళ నిక్కడే ముక్కలు ముక్కలుగా నరికించి కాకులకు మేతగా వేయండి," అన్నాడు.

బ్రహ్మదండి యిలా అనగానే పులుగు రాయుడు చిదరించుకుంటున్న వాడిలా ముఖం పెట్టి, "ఏం, బ్రహ్మదండీ! ప్రతి స్వల్పానికీ నువ్వు కనబరచే భయం, చేసే గోల చూస్తూంటే, నువ్వు కాకి జాతి మానవుడిలా కనిపిస్తున్నావు. గద్ద జాతి మానవులను, కాకి జాతి మానవులు అన్ని వేళలా ఉడిగం చేస్తూ జీవించాలని శాస్త్ర పుస్తకాల్లో వుంది. ఆ సంగతి నీకూ తెలుసు! కనక నిన్ను ఈ యిద్దరికీ సేవకుడిగా నియమిస్తున్నాను," అన్నాడు.

పులుగురాయుడి మాటలతో బ్రహ్మదండి శవమెత్తిన వాడిలా అయిపోయి, గంతులు వేస్తూ, మంత్ర దండాన్ని గిర్రున తిప్పుతూ, "పులుగు దొరా, ఈ కాలభైరవొ పాసముణ్ణి ఎంత మాటన్నారు! సరే, నేను నా కేశవుణ్ణి వెంట బెట్టుకుని రాకాసిలోయకు వెళ్ళి పోతాను. మీకు వాగ్దానం చేసిన విధంగా, మీ దేవతకు బలి మనుషుల్ని తప్పక పంపుతాను. రేపు సూర్యోదయంతోనే, నా ప్రయాణం," అన్నాడు.



"అందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. యిక కదలండి," అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అతడి వెంట అందరూ కదిలారు. కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ పది మంది రెక్కల మనుషులు ముందూ వెనకా కాపుండి నడిపించారు. బ్రహ్మదండి, స్థూలకాయుడికి సౌంజ్ఞ చేసి గుంపు నుంచి పక్కకు తీసుకుపోయి రహస్యంగా, "వీర చూడామణీ! నే చెప్పేది శ్రద్ధగా విను. యిక మనం ఈ పక్షి ముఖం వెధవ దగ్గిర వుండటం ప్రమాదకరం. రేపు తెల్లవారుతూనే, నేనూ, జిత, శక్తివర్మలూ, నువ్వూ కలిసి, ఆ కేశవుణ్ణి తీసుకుని రాకాసి







లోయకు వెళ్ళి పోదాం. ఆ కేశవుడు పారిపోకుండా జాగ్రత్త పడ్డామంటే, రాకాసి లోయలోని ధనరాసులన్నీ మనవే. వాడు వెంట లేకుండా అక్కడ మనం ఒక గుడ్డి గవ్వకు కొరగాం. అదీ సంగతి," అన్నాడు.

"ఆ వెధవ కుర్రకుంకను గురించి నువ్వంతగా వాపోవటం ఏం బాగా లేదు. నా లెక్కన వాడు ఇరవై బంగారు కాసుల కన్న ఎక్కువ విలువ చెయ్యడు," అన్నాడు స్థూలకాయుడు పెదాలు చప్పరిస్తూ.

"అన్నన్నా, ఎంత మాట! ఆ కేశవుడు సామాన్యుడనుకున్నావా? వాడు రాజయోగాన్ని భుజాన వేసుకుని పుట్టాడు. వాడి మూపు మీద పడగ విప్పిన పాము ఆకారం గల మచ్చ చూస్తే, నువ్విలా మాట్లాడవు. దాన్ని స్వయంగా ఆ కాలభైరవుడే అచ్చు గుద్దాడు, తెలిసిందా?" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు చెంపలు వేసుకున్నాడు.

"వాడు బ్రహ్మపురానికి రాజైన నాకు గాని, నువ్వు చెప్పేది నేను నమ్మను. ఏదెలా అయితే నాకేం? నాకు చేసిన వాగ్దానం మాట మరవకు," అన్నాడు స్థూలకాయుడు.

బ్రహ్మదండీ, స్థూలకాయుడూ రహస్యంగా మాట్లాడుకోవటాన్నేగాక, అంతకు ముందు జరిగిన సంఘటనలన్నీ కూడా బిడాలీ, శ్వానకర్ణీ నియమించిన వేగుల వాళ్ళు, కొండ రాళ్ళ చాటు నుంచి గమనించారు. వాళ్ళు కేశవుడూ, అతడి అనుచరులు పులుగురాయుడికి పట్టు బడటం దగ్గిర నుంచి సర్వం ఎప్పటి కప్పుడు తమ నాయకులకు తెలియపరుస్తూనే వున్నారు.

కేశవుడూ వాళ్ళు గుహలో ప్రవేశించిన తరవాత నిప్పులు కక్కి సింహం పారిపోవటాన్ని గురించి విన్న బిడాలీ, శ్వానకర్ణీ యిక తమకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదని నిశ్చయించుకుని, గుహలో ప్రవేశించి, కొంత సేపటికి కోయగోమాంగ్ వదిలిపోయిన రాతి









గదను చూశారు. ఆ తరవాత వాళ్ళు కాలి గుర్తులను అనుసరిస్తూ నడిచి, సారంగం పైన వున్న కంత నుంచి బయట జరుగుతున్నదంతా గమనించారు.

"ఇంత మంది దుర్మార్గుల్ని వాళ్ళ స్వస్థలంలో ఎదిరించి గెలవటం కష్టం. పైగా, ఈ లోపల వాళ్ళు కేశవుణ్ణీ అతడి స్నేహితులనూ చంప వచ్చు," అన్నాడు బిడాలి.

శ్వానకర్ణి తన మూల పురుషుడి రాతి గదను కళ్ళ కొసారి అద్దుకుని, "ఇక, నా ముఠాకు అపజయ భయం లేదు. మన మిత్రులైన ఆ ముగ్గుర్నీ రక్షించే భారం నాది. తరవాత, వాళ్ళ సాయం కూడా తీసుకుని, మొత్తం ఈ రెక్కల పక్షిగాళ్ళను దుంపనాశం చేస్తాను," అన్నాడు.

"వాళ్ళను రక్షించే భారం నా మీద కూడా కొంత వున్నది. రెక్కల మనుషుల దేవతకు బలికానున్న నా ముఠావాళ్ళను ఆ ముగ్గురూ రక్షించారు. ఇంతకూ నీ ఆలోచన ఏమిటి?" అని అడిగాడు బిడాలి.

బిడాలి అలా ప్రశ్నించగానే శ్వానకర్ణి తల పంకిస్తూ కాసేపు వూరుకుని, తరవాత అంత దూరంలో వున్న తన ముఠా వాళ్ళలో యిద్దర్ని దగ్గిరకు పిలిచి, "మీరు చీకటి పడుతూనే, ఈ కంత నుంచి బయిటికి పోయి అక్కడ పడి వున్న పక్షి రెక్కలు తగిలించుకుని, రెక్కల మనుషుల్లా నటిస్తూ, పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళి, కేశవుడూ వాళ్ళ స్థితి ఎలా వున్నదో తెలుసుకు రావాలి," అని ఆజ్ఞాపించాడు.

"అదా నీ ఎత్తుగడ? బాగానే వుంది. నీ ముఠా వాళ్ళొకణ్ణీ, నా ముఠావాళ్ళొకణ్ణీ పంపుదాం. అది న్యాయంగా వుంటుంది," అన్నాడు బిడాలి. అందుకు శ్వానకర్ణి అంగీకరించాడు.

తరవాత కొంత సేపటికి సూర్యాస్తమానమై క్రమంగా చీకటి పడింది. శ్వానకర్ణి బిడాలి ముఠాల అడవిమనుషు లిద్దరూ





సొరంగాన్నుంచి బయటికి పాకిపోయి, అక్కడ మధ్యాహ్నం జరిగిన తన్నులాటలో రెక్కల మనుషులు వదిలిపోయిన పక్షి రెక్కల్లో తమకు కావలసినవి ఏరుకుని, చేతులకు తగిలించుకుని పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళారు.

దారిలో ఆ యిద్దర్నీ ఎవడూ అనుమానించి అటకాయించ లేదు. వాళ్ళు ఒక్కొక్క గుడారాన్నే దాటిపోతూ, చివరకు బ్రహ్మదండీ, స్థూలకాయుడూ వున్న గుడారం ముందు నుంచి వెళ్ళేటప్పుడు, కాగడాల వెలుగులో వాళ్ళిద్దర్నీ గుర్తించి, ఆ పక్కనే కేశవుడూ అతడి అనుచరు లుండవచ్చని ఊహించారు. తరవాత నాలు గడుగులు ముందుకు వెళ్ళేసరికి వాళ్ళు ఊహించినది నిజమని తేలిపోయింది. ఒక గుడారం ముందు జిత, శక్తివర్మలు కత్తులు పట్టుకుని కాపలా కాస్తున్నారు. లోపల కేశవుడూ, జయమల్లూ, కోయుగోమాంగ్ చాపల మీద కూచుని మాట్లాడు కుంటున్నారు.

అడవిమనుషు లిద్దరూ జంటగా జిత, శక్తివర్మలను సమీపించి, "దారి తొలగండి! లోపల వున్న ఆ ముగ్గురు దుర్మార్గుల్నీ తన వద్దకు తీసుకు రమ్మని పులుగుదొర ఆజ్ఞ అయింది," అన్నారు.

జిత, శక్తివర్మలు పక్కన వెలుగుతున్న కాగడాలతో అడవిమనుషుల ముఖాలను పరీక్షగా చూసి, దారి యిచ్చారు. కాని, అంతలో జితవర్మ కేదో అనుమానం తగిలి, "వీళ్ళు రెక్కల మనుషుల జాతి వాళ్ళలా లేరు. అడవి మనుషుల ముఖ లక్షణాలు కనబడుతున్నవి," అన్నాడు.

"అవునవును, నాకూ అదే అనుమానం కలిగింది, సుమా!" అంటూ శక్తివర్మ కత్తి దూసి, "ఏయ్, మీరెవరు? ఆగండి!" అంటూ ముందుకు వెళ్ళాడు.

—(ఇంకా వుంది)








## 30

[ఫలుగురాయుడి రెక్కల మనుషులకు కేశవుడూ, అతని అనుచరులు దొరికిపోయారు. కాని, ఆ రాత్రి కేశవుడూ వాళ్ళు వున్న గుడారంలోకి, బిడాలి శ్వానకర్ణి ముఖాల అడవి మనుషు లిద్దరు ప్రవేశించారు. గుడారం ముందు కావలి వున్న జిత, శక్తివర్మలు వాళ్ళను గుర్తించి కత్తులు దూసి, "ఆగండి!" అంటూ మీదికి వెళ్ళారు. తరవాత–]

శక్తివర్మ కత్తి దూసి ముందుకు వెళ్ళటం చూస్తూనే జితవర్మ కూడా కత్తి తీసుకుని అడవిమనుషుల దారిని అడ్డగించాడు. కాని, అడవిమనుషు లిద్దరూ వాళ్ళను తమ చేతులతోనే పక్కకు నెట్టుతూ, "పెద్దగా గోల చేయకండి. ఫలుగురాయుడు ఈ ముగ్గురు దుర్మార్గుల్ని రహస్యంగా తన వద్దకు తీసుకు రమ్మన్నాడు. ఈ సంగతి పక్క గుడారంలో వున్న బ్రహ్మదండి మాంత్రికుడికీ, స్థూలకాయుడికీ తెలియ కూడదు," అన్నారు.

ఆ మాటలతో జిత, శక్తివర్మలు ముఖ ముఖాలు చూసుకున్నారు. వాళ్ళిద్దరికీ అడవిమనుషుల ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. శక్తివర్మ కత్తి వరలో పెట్టబోయిన వాడల్లా ఆగి, చిన్న గొంతుతో, "ఫలుగు రాయుడు ఈ ముగ్గురు హంతకుల్ని తన దగ్గిరికి తీసుకు రమ్మని మిమ్మల్ని పంపితే,







తీసుకుపోండి, మా అభ్యంతరం ఏమీలేదు. కాని, మీ ముఖ కవళికలు చూస్తూంటే, మీరు రెక్కల మనుషుల జాతి వాళ్ళలా లేరు. దానికేమంటారు?'' అన్నాడు.

శక్తివర్మ యిలా అనగానే అడవి మనుషుల్లో ఒకడు నవ్వి, ''ఒక పని కలిగి, మేం కావాలనే అడవిమనుషుల తలలు తగిలించుకున్నాం. ఛీ, దారి తొలగండి! మీ యిద్దరూ పరమ శుంఠల్లా వున్నారు,'' అన్నాడు ముందుకు పోబోతూ.

జితవర్మ తోక తొక్కిన పాములా ఎగిరి పడి, కత్తితో అడవిమనిషి మీదికి దూక బోయాడు. అంతలో కేశవుడు అతడి కాళ్ళు రెండూ పట్టుకుని వెనక్కు గుంజటంతో ముందుకు బోర్లా పడిపోయాడు. మరు క్షణంలో కోయుగోమాంగ్, శక్తివర్మను పట్టుకుని ముందుకు పడదోశాడు.

జయమల్లు ఒక తాడుతో వాళ్ళిద్దర్నీ సమీపించి, ''కిక్కురుమన్నారో, మీ యిద్దరి ప్రాణాలూ నిలువునా తీసేస్తాం. చచ్చినట్టు పడివుండండి,'' అంటూ హెచ్చరించి, తాడుతో యిద్దరి చేతులూ కాళ్ళూ కలిపి కట్టాడు. అంతలో పక్కన వున్న గుడారంలో నుంచి బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు వినబడింది.

''ఇక్కడ జరిగిన గడబిడ బ్రహ్మదండి పసికట్టినట్టుంది. ఇక మనం పారిపోవటమే క్షేమం,'' అంటూ జయమల్లు గుడారంలో కనిపించిన ఆయుధాలు తీసుకున్నాడు.

ఆ సరికి బ్రహ్మదండీ, స్థూలకాయుడూ కూడా పెద్దగా గావుకేకలు ప్రారంభించారు: ''ఆ దుర్మార్గులు ముగ్గురూ జిత, శక్తి వర్మలను చంపి పారిపో చూస్తున్నారు. ఓ పులుగురాయా! రండి, గుడారాన్ని చుట్టుముట్టండి.''

ఆ కేకలు వింటూనే జయమల్లు గుడారం ద్వారం దగ్గిర ఆగి, అడవిమనుషులతో, ''మీ యిద్దరూ లోపలికి రావటం చూస్తూనే

మీ రెవరైందీ పోల్చుకున్నాం. లోగడ మిమ్మల్ని బిడారి, శ్యానకర్లి వెంట చూశాం. మీ ముఠాల వాళ్ళు పెద్ద బలగంతో యిక్కడికి దాడి వస్తున్నారా?" అని అడిగాడు.

"అలాంటిదేమీ లేదు. మీ రెలా వున్నారో చూసి రమ్మని మా నాయకులు మమ్మల్ని పంపారు," అన్నాడొక అడవిమనిషి.

కేశవుడు గుడారం నుంచి బయటికి వెళ్లి, బ్రహ్మదండి మాంత్రికుడున్న చోటు కేసి ఓమారు చూసి, జయమల్లుతో ఏదో చెప్పబోయేంతలో, స్థూలకాయుడు కొరడా ఝళిపిస్తూ అటుకేసి రాసాగాడు. అది గమనిస్తూనే కోయగోమాంగ్ కత్తి దూసి అతడి మీదికి ఉరకబోయేసరికి, వాడు పెద్దగా బొబ్బలు పెడుతూ వెనుదిరిగి, "ఆ క్రూరులు ముగ్గురికీ తోడుగా మరిద్దరు రెక్కల మనుషులు చేరారు. పులుగు రాయుడి ముఠాలోనే ముసలం పుట్టింది. స్వామి ద్రోహం, పులుగురాయా, స్వామి ద్రోహం!" అంటూ పరిగెత్తాడు.

జయమల్లు చుట్టూ ఓమారు కలయ చూశాడు. ప్రతి గుడారం ముందూ రెక్కల మనుషులు గుంపులుగా చేరుతున్నారు. కొందరు, "మోసం, స్వామి ద్రోహం!" అంటూ అటూ యిటూ పరిగెత్తుతూ, ఎదురైన వాళ్ళకు ఏమో చెపుతున్నారు.






"కేశవా, గోమాంగ్! మనం పారి పోయేందుకు ఒకే ఒక ఉపాయం నాకు తోస్తున్నది. ఈ పాటికే మన శత్రువులందరికీ, మనం గుడారంలో నుంచి తప్పించుకు బయట పడినట్టు తెలిసిపోయింది. వాళ్ళు క్షణాల మీద మనను పట్టుకునేందుకు యిక్కడికి వస్తారు. మనం ఎక్కడ వున్నదీ, ఎటు పారిపోతున్నదీ వాళ్ళకు తెలియకుండా తికమక పెట్టేందుకు ఒకటి చేద్దాం. ఆ వెలుగుతున్న కాగడాలు తీసుకుని, సాధ్యమైనన్ని గుడారాలకు నిప్పు పెడదాం. అప్పుడు బయలుదేరే గందరగోళంలో మనం పారిపోవచ్చు," అన్నాడు జయమల్లు.

జయమల్లు మాట ముగించే లోపలే కేశవుడూ, గోమాంగ్, అటవి మనుషు లిద్దరూ భగభగ మండే కాగడాలు తీసుకుని, "మోసం, స్వామి ద్రోహం!" అని అరుస్తూ, అందుబాటులో వున్న గుడారా లన్నిటికీ నిప్పు పెట్టారు. క్షణాల మీద అవి అంటు కుని భుగభుగ మంటూ మంటలు లేచినై.

బ్రహ్మదండి మాంత్రికుడూ, స్థూల కాయుడూ ఆ మంటలు చూస్తూనే ఠారెత్తి పోయాడు. బ్రహ్మదండి మంత్రదండాన్ని పైకెత్తి, "హాం కాలభైరవా! నాకు అగ్ని స్నానం రాసి పెట్టావా? నీ భక్తుణ్ణి పరీక్షి స్తున్నావా?" అంటూ మంటలను తప్పుకుని పరిగెత్తుతూ, స్థూలకాయుడితో, "వీర కంఠీరవా! నీ ప్రతాపం చూపటానికి యిదే అదను. ఆ దుర్మార్గులు ఎటు పారి పోతున్నారో కనిపెట్టి వుండు. నేను ఆ పిట్ట తల వెధవను నిద్ర లేపుతాను," అని చెప్పి, పులుగురాయుడు వుండే గుడారాని కేసి దౌడుతీశాడు.

బ్రహ్మదండి హడావిడిగా తన కేసి పరిగెత్తి రావటం చూస్తూనే, పులుగు రాయుడు పెద్దగా నవ్వి, "ఏం, మాంత్రికా! ఒళ్ళు పై తెలియకుండా డేగలా ఎగిరి వస్తున్నావ్, ఏమిటి కథ?" అని అడిగాడు.







"ఏమిటీ కథ? ఏం, పులుగు ప్రభో! మనందరి కేమన్నా మతులు పోయినయ్యా? ఆ దుర్మార్గులు మన గుడారాలకు నిప్పు పెట్టి పారిపోతూంటే, మీరు నవ్వుతూ యిక్కడ కూచున్నారా? పైగా, మీ సహచరుల్లోనే కొందరు స్వామిద్రోహులై, ఆ దుర్మార్గులతో కలిసిపోయారు," అన్నాడు బ్రహ్మదండి పెద్దగా రొప్పుతూ.

"ఆ స్వామిద్రోహుల్ని, ఆ పాపాత్ములు ముగ్గుర్నీ వలవేసి కొంగల్ని పట్టినట్టుగా పట్టి తెచ్చేందుకు నా అనుచరుల్ని ఎప్పుడో పంపాను. నువ్వేమీ హడావిడి పడక సావధానంగా కూచో. నీ అంగరక్షకులు జిత, శక్తివర్మ లెక్కడ? ఆ ఎనుబోతు బానిసల యజమాని ఏమయ్యాడు? వాళ్ళూ ఆ దుర్మార్గులతో కలిసి పారిపోయే ప్రయత్నంలో లేరుకదా?" అన్నాడు పులుగు రాయుడు, బ్రహ్మదండి మాంత్రికుడి కేసి గుచ్చి గుచ్చి చూస్తూ.

బ్రహ్మదండి ఆ ప్రశ్నతో గతుక్కుమని, "అలాంటిదేమీ జరగదు, పులుగు దొరా! వాళ్ళూ నీ అనుచరుల వెంట ఆ ద్రోహుల్ని పట్టి తెచ్చేందుకు వెళ్ళివుంటారు," అన్నాడు.

అంతలో నలుగురైదుగురు రెక్కల మనుషులు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళను చూస్తూనే, పులుగు రాయుడు, "ఆ ముగ్గురూ దొరికారా? స్వామిద్రోహం చేసిన దుర్మార్గు లెంతమంది?" అని ప్రశ్నించాడు.

రెక్కల మనుషుల్లో ఒకడు తమ నాయకుడికి వంగి వంగి దణ్ణాలు పెట్టి, "పులుగుదొరా! వాళ్ళు మొత్తం అయిదుగురు. వాళ్ళు మన వాళ్ళల్లో కొందరిని చంపారు. మన చక్రబంధం నుంచి బయటపడి సూటిగా మొసళ్ళ మడుగు కేసి పారిపోతున్నారు," అన్నాడు.

"అలా అయితే మన పని మరీ తేలికైనట్టే. వాళ్ళు మొసళ్ళ మడుగును చుట్టూ







పారిపోకుండా దారి అటకాయించండి. మడుగులో దిగి పారిపోయే ప్రయత్నం చేశారో, అందర్నీ మొసళ్ళు భక్షించి వేస్తయి. ఒడ్డున ఆగితే, మనం వేసిన వలలో చిక్కుకుంటారు. అదీ, మన ఎత్తుగడ! అర్థమైందా? ఇక వెళ్ళండి," అన్నాడు పులుగురాయుడు.

"ఆ కేశవుణ్ణి మాత్రం మొసళ్ళు తినకుండా చూడాలి, పులుగేంద్రా! వాడు చచ్చేందుకు వీలులేదు. రాకాసిలోయలోని ధనరాసుల కన్నిటికీ వాడే వారసుడు," అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు గోల ప్రారంభించాడు.

పులుగురాయుడు ఆ మాటలేవీ వినని వాడిలా లేచి నిలబడి, తన అనుచరులతో, "పదండి. వాళ్ళు మొసళ్ళ వాత బడ్డారో, మనవాళ్ళచేత చిక్కారో చూద్దాం," అంటూ బయలుదేరాడు. బ్రహ్మదండి అతణ్ణి అనుసరించాడు.

పులుగురాయుడు మొసళ్ళ మడుగు ప్రాంతం చేరేసరికి, ఆ ప్రదేశమంతా అటూ యిటూ పరిగెత్తే వాళ్ళతో, కేకలు పెట్టే వాళ్ళతో పెద్ద గొడవగా వున్నది. అతడు తన అనుచరుల్లో యిద్దరు ముగ్గుర్ని దగ్గిరకు పిలిచి, "ఏమయింది? వాళ్ళు మన వల నుంచి తప్పుకు పారిపోలేదుగదా?" అని ప్రశ్నించాడు.

"లేదు, దొరా! వాళ్ళను ఉచ్చులో బిగించేందుకు చుట్టూ కమ్ముకుంటూ వచ్చాం. వాళ్ళు మరెటు పోయేందుకూ దారిలేక, మొసళ్ళ మడుగు అంచున వున్న చెట్ల పొదల్లోకి దూరారు. ఇక మనం వాళ్ళను వెతికి, వాటి మధ్య నుంచి కుందేళ్ళను లాగినట్టు బయటికి లాగటమే మిగిలి వుంది," అన్నాడొకడు.

"భేష్, మహ బావుంది. ఆ పని కాస్తా అయిందనిపించండి," అంటూ పులుగురాయుడు ఎగిరి ఒక చెట్టు మోదు మీద నిల





బడ్డాడు. అతడి అనుచరులు కాగడాలతో పొదలన్నీ వెతుకుతూ ముందుకు కదిలారు.

అదంతా చూస్తున్న బ్రహ్మదండికి, కేశవుడు దుస్సాహసంతో మొసళ్ళ మడుగులో దూకి పారిపోయే ప్రయత్నం చేస్తాడేమో అనిపించింది. ఆ వెంటనే అతడు పెద్దగా గొంతెత్తి, "వత్సా, కేశవా! నీకొచ్చిన ప్రాణ భయం ఏమీలేదు. నీ వెంట వున్న ఆ ద్రోహుల్ని వదిలి, యిటు వచ్చెయ్యి. దయామయుడైన పులుగు రాజేంద్రుడు నిన్ను తప్పక క్షమిస్తాడు," అని కేకపెట్టాడు.

బ్రహ్మదండి పెట్టిన కేకకు జవాబుగా అన్ని వైపుల నుంచి, "బిడాలిక జై! శ్వాన కన్యక జై!" అన్న భీకరమైన నినాదాలు మార్మోగినై. ఆ వెంటనే పొడవైన ఈటెలు ఝుయ్‌మంటూ వచ్చి రెక్కల మనుషుల మీద పడసాగినై.

పులుగురాయుడు మోడు మీది నుంచి కిందికి దూకుతూ, "ఆ అడవిమనుషులు మన చక్రబంధానికి చుట్టూ చక్రబంధం బిగించారు. లాభంలేదు, పరిగెత్తండి, ఆకాశంలోకి గరుడపక్షుల్లా లేవండి," అంటూ వెనుదిరిగి కాలి బలం కొద్దీ పరిగెత్తసాగాడు. బ్రహ్మదండి కూడా అతడి వెనక పరిగెత్తుతూ, "జితా, శక్తీ! ఎక్కడ?" అని అరవసాగాడు.



రెక్కలమనుషుల గుడారాలు నిప్పంటుకుని మండిపోవటం చూసిన బిడాలీ, శ్వానకర్ణి, ఇదే మంచి తరుణం అనుకుని, తమ ముఠావాళ్ళతో వచ్చి రెక్కల మనుషుల మీద పడ్డారు. మొదట విసిరిన ఈటె దెబ్బలకే హడలుకుని రెక్కల మనుషులు పారిపోయే ప్రయత్నం చేయటంతో వాళ్ళకు ఎక్కడలేని ధైర్యం కలిగింది. కాని, వాళ్ళకు కేశవుడూ అతడి అనుచరు లెక్కడ వున్నదీ సూచనమాత్రంగానైనా తెలియలేదు. ఆ కారణం వల్ల తాము విసిరే ఈటెలు ఒకవేళ వాళ్ళకు తగిలినా తగలవచ్చునన్న అనుమానం శ్వానకర్ణికీ, బిడాలికీ కలిగింది. ఆ వెంటనే వాళ్ళు తమ అనుచరులకు ఈటెలు విసర వద్దని ఆజ్ఞాపించి, గొంతులెత్తి, "కేశవా, జయమల్లా! మీ రెక్కడ వున్నారు?" అంటూ కేకలు వేశారు.

బిడాలీ, శ్వానకర్ణి పెట్టిన కేకలు, మొసళ్ళ మడుగు అంచున గల పొదల్లో దాగివున్న కేశవుడి అనుచరులకూ, వారివెంట వున్న అడవిమనుషులకూ వినబడినై. కాని, వాళ్ళు జవాబిచ్చే లోపలే కొందరు రెక్కల మనుషులు అటుగా వచ్చి, వాళ్ళ మీద కలియబడ్డారు.

కేశవుడూ వాళ్ళకు తమ కత్తులు ఉపయోగించే అవకాశం కలగలేదు. ఒక వైపున మొసళ్ళతో నిండి వున్న మడుగూ, రెండవ వైపున చెట్ల పొదలూ—ఆ పరిస్థితిలో వాళ్ళు అన్నిటికీ తెగించి, రెక్కల మనుషుల మీద ముష్టా ముష్టి యుద్ధానికి దిగారు.

ఈ పోరాటంలో బలంగా దెబ్బలు తిన్నవాళ్ళూ, కాళ్ళు జారిన వాళ్ళూ మడుగులో పడసాగారు. కేశవుడూ, గోమాంగ్ కూడా రెండుసార్లు మడుగులో పడి, తిరిగి క్షణాల మీద ఒడ్డు చేరి, రెక్కల మనుషుల్ని అందులోకి నెట్టసాగారు. దూరంగా బిడాలీ, శ్వానకర్ణి పెట్టే కేకలు వాళ్ళకు వినబడుతూనే వున్నవి. —(ఇంకా వుంది)









# 31

[ అడవి మనుషుల సాయం వల్ల కేశవుడూ అతడి అనుచరులు బంధ విముక్తులైయ్యారు. తరవాత వాళ్ళు రెక్కల మనుషుల గుడారాలకు నిప్పుపెట్టి, అప్పుడు రేగిన గందరగోళంలో, పారిపోసాగారు. కాని, వాళ్ళను శత్రువులు మొసళ్ళ మడుగు వద్ద అటకాయించారు. చివాలీ, శ్వానకర్ణి కేశవుడి కోసం కేకలు పెట్ట సాగారు. తరవాత—]

కేశవుడి అనుచరులను రక్షించ వచ్చిన యిద్దరు అడవి మనుషులూ, తమ నాయకులు పెట్టే కేకలు విని ఎంతో ధైర్యం తెచ్చుకున్నారు. ఒకటి రెండు నిమిషాల కాలం రెక్కల మనుషుల చేతికి చిక్కకుండా పోరాడగలిగితే, ఆ తరవాత తమ జాతి వాళ్ళ సాయం వస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది. కేశవుడూ, జయమల్లు కూడా పరిస్థితి గ్రహించి, ఎక్కడలేని ధైర్యం తెచ్చుకున్నారు. వాళ్ళు కోయగోమాంగ్‌ను ఉత్సాహపరుస్తూ, రెక్కల మనుషులను మొసళ్ళ మడుగులోకి నెట్టసాగారు. ఇంతలో గోమాంగ్ కింద పడివున్న ఈటె నొకదాన్ని చేతికి తీసుకుని, దానితో రెక్కల మనుషుల్ని పొడుస్తూ, "కేశవా, యిక మనకు ప్రమాదం లేదు. ఆయుధం దొరికింది. మీరు కూడా ఈ దుర్మార్గులతో కుస్తీపట్లు మాని ఆయుధాలు తీసుకోండి," అని అరిచాడు.







గోమాంగ్ చేత ఈటె దెబ్బలు తిన్న రెక్కల మనుషులు కీచుమని అరుస్తూ మొసళ్ళ మడుగులో పడసాగారు. అది చూస్తూనే మిగిలిన వాళ్ళు అక్కడి నుంచి కాలిబలం కొద్దీ పరిగెత్తుతూ, "పులుగు రాయా! ప్రమాదం. గుహావాసులు వందల వేల సంఖ్యలో మన మీది కొస్తున్నారు," అని కేకలుపెట్టారు. ఆ హెచ్చరిక వింటూనే ఎక్కడెక్కడ వున్న రెక్కల మనుషులూ ఆ ప్రాంతం వదిలి అడవి కేసి బయలు దేరారు. తన అనుచరులను ప్రోత్సహించి, అడవి మనుషులతో యుద్ధానికి పూను కోవటం సాధ్యంకాదని పులుగురాయుడు గ్రహించాడు. కాని, ఒకసారి అడవి మను షులకు వెన్నుచూపితే, ఆ తరవాత వాళ్ళు తనను, పిరికిపంద కింద జమకట్టే ప్రమాదం వున్నది. ఇప్పు డేమి చేయుటం?

పులుగురాయుడి తటపటాయింపు గ్రహిం చిన బ్రహ్మదండి మాంత్రికుడు మంత్ర దండాన్ని పైకెత్తి, "జై కాలభైరవా!" అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, "పులుగు ప్రభో! యిది మనకు కష్టకాలం. గ్రహాలు వికటించినై. కాలభైరవుడు ఎందుకనో ఆగ్ర హించాడు. ప్రస్తుతానికి మనం చేయుగలిగిం దేమీ లేదు. ఆ గుహావాసులూ, జయమల్లు ముతా వచ్చి మన మీద పడకముందే, అడవి లోకి తిరోగమిద్దాం," అన్నాడు.

"మాంత్రికా, అదే నేనూ అనుకుంటు న్నాను. మా గరుడజాతి వాళ్ళకు రాత్రిళ్ళు బొత్తిగా కళ్ళు కనిపించవు. సూర్యోదయం కానివ్వండి, మా ధాటి చూపెడతాం," అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అంతలో జిత, శక్తివర్మలు అక్కడికి పరి గెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళ చేతుల్లో వున్న కత్తులు సగం విరిగి వున్నాయి. వాళ్ళ దేహాలు రక్తంతో తడిసి వున్నాయి.

జిత, శక్తివర్మలను చూస్తూనే బ్రహ్మ దండికి ప్రాణం లేచి వచ్చినట్టయింది.







అతడు వాళ్ళను సమీపించి, "జితా, శక్తీ! మీరు యింకా బతికే వున్నారా? ఆ దుర్మార్గులు మీ యిద్దర్నీ హత్య చేశారనుకున్నాను," అన్నాడు.

"వాళ్ళా ... మమ్మల్నా ... హత్యా!" అంటూ జితవర్మ పెద్దగా నవ్వి, "మా మొండికత్తులు చూడు, నెత్తురులో స్నానమాడిన మా శరీరాలు చూడు! ఎంత మంది శత్రువుల్ని చంపామో మాకే తెలీదు. కత్తులు విరిగిపోవటంతో వెనుదిరిగి యిటు పురోగమించి రావలసివచ్చింది," అన్నాడు.

జితవర్మ మాటలకు స్థూలకాయుడు విరగబడి నవ్వుతూ, "మీ యిద్దర్లో ఏ ఒకడూ శత్రువులను చూశామని చెప్పినా నేను నమ్మను. ఇంతసేపూ ఏ చెట్టుకొమ్మల్లోనో దాక్కుని వుంటారు!" అన్నాడు.

స్థూలకాయుడి మీదికి జిత శక్తివర్మలు తమ మొండికత్తుల్ని ఎత్తేంతలో, పులుగు రాయుడు వాళ్ళను కసురుతూ, "ఛీ, యిక వూరుకోండి. మీ నుంచే నా రాజ్యానికి యింత ప్రమాదం వచ్చింది. మీ కాపలాలో వున్న ఆ దుర్మార్గులు ఎలా తప్పించుకు పోగలిగారు? ఆ సంగతేదో యిక్కడే తేలాలి. మిమ్మల్ని రాకాసిపక్షిమాతకు బలిచేస్తాను," అంటూ ఈటెను వాళ్ళ మీదికి ఎత్తాడు.



అంతలో గుహవాసులు అటుకేసి వస్తున్న సూచనగా కేకలు వినబడినై. బ్రహ్మదండి మాంత్రికుడు, పులుగురాయుడి చేయి పట్టుకుని, "పులుగుదేవా! మీరు శాంతించండి. ఆ అడవిమనుషుల దండు యిటే వస్తున్నది. ముందు మనం యిక్కణ్ణించి పారిపోకపోతే ప్రమాదం," అన్నాడు.

బ్రహ్మదండి మాట ముగించే లోపలే పులుగురాయుడు అడవి కేసి పరుగులంకించుకున్నాడు. స్థూలకాయుడూ, బ్రహ్మదండి మాంత్రికుడూ, జిత, శక్తివర్మలు కూడా అతడి వెనక పరిగెత్తారు. జితవర్మ శక్తివర్మతో, "శక్తీ, చూశావా? మనం







శత్రువులను చీల్చి చెండాడేందుగ్గాను కనబరిచిన శూరవీరత్వం, సాహసధైర్యాలూ ఎందుక్కొరగాకుండా పోయినై. ఆ పిట్టతల వెధవా, బ్రహ్మదండీ కూడా మన దర్పబల శౌర్యాలను శంకిస్తున్నారు," అన్నాడు.

"వాళ్ళిద్దరే శంకించటమేం! ఈ మాంసం పోగు కూడా మనను అపహాస్యం పట్టిస్తున్నాడు. ఇప్పుడు మన కత్తులు మొండివయి పోయినై. మంచి కత్తులు సంపాయించగానే ఈ అందర్నీ కట్టకట్టి నిలువునా నరికేద్దాం," అన్నాడు శక్తివర్మ.

అంతలో వాళ్ళకు "బిడాలికి జై!" అన్న కేకలూ, రివ్వురివ్వు మంటూ మీదికి వచ్చిపడే ఈటెలూ ప్రత్యక్షమయినై. "మరి కొంచెం వేగంగా పరిగెత్తండి. శత్రువులు మనను చూసినట్టుంది. జితా, శక్తీ! మీ చచ్చు సంభాషణ కట్టిపెట్టి, నోళ్ళు మూయండి!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు లేడిలా ఛంగున ముందు కురికాడు.

కేశవుడు తన అనుచరులనూ, బిడాలీ, శ్వానకర్ణి ముఠా వాళ్ళనూ వెంటపెట్టుకుని వచ్చి, పులుగురాయుడు నివశించే గుడారాల ప్రాంతాన్ని చుట్టుముట్టే సరికి, అక్కడ వారికి రెక్కల మనుషు లెవరూ కనిపించ లేదు. ఆ దుర్మార్గులు ప్రమాదం శంకించి అడవి కేసి పారిపోయి వుంటారని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకున్నారు. కాని, చీకటిలో వాళ్ళను వెంబడించి చుట్టుముట్టటం సాధ్యమయేది కాదు. ఆ కారణం వల్ల కేశవుడు గుహవాసులను చిన్నచిన్న ముఠాలుగా అడవి ప్రాంతానికి వెళ్ళి, కనబడిన రెక్కల మనుషులను హతమార్చమన్నాడు. అలా బయలుదేరిన ఒక ముఠా చేతిలో పడవలసిన బ్రహ్మదండీ, పులుగురాయుడూ అదృష్టవశాన తప్పుకుని అడవిలోకి పారిపోగలిగారు.

రాత్రి గడిచి సూర్యోదయం అయేవరకూ కేశవుడూ అతడి అనుచరులు కాలుతున్న





పులుగురాయుడి గుడారాల ప్రాంతాలనే కాలం గడిపారు. రెక్కల మనుషులు చెట్ల మీది నుంచి కిందికి దూకేందుకు ఉపయోగించే పక్షిరెక్కలు వాళ్ళకు ఒకచోట గుట్టలు గుట్టలుగా కనిపించినై. వాటిని చూడగానే బిడాలికీ, శ్వానకర్ణికీ యింతకాలంగా వాళ్ళు చేసిన మోసం తెలిసిపోయింది.

"నిజంగా వాళ్ళు రెక్కలున్న మనుషులని మేం నమ్మాం. వాళ్ళు పక్షుల్లా ఆకాశంలోకి ఎగరగలరని కూడా మేం భావించాం. అంతా మోసం!" అన్నాడు బిడాలి.

"ఆ మోసమేదో యిప్పుడు తెలిసిపోయింది. ఇక ఆ నీచుల్ని అడవిబాతుల్ని వేటాడినట్టు వేటాడతాం. వాళ్ళు వట్టి పిరికి పందలు కూడా. వాళ్ళ ధైర్యం ఏపాటిదో కూడా యింతకు ముందు తేలిపోయింది," అన్నాడు శ్వానకర్ణి.

గుహవాసుల నాయకులిద్దరికి కలిగిన ఆత్మవిశ్వాసం చూసి, కేశవుడూ, జయమల్లూ చాలా సంతోషించారు. సూర్యోదయమై నాలుగుబారల పొద్దెక్కగానే, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగల గౌరవార్థం, బిడాలీ, శ్వానకర్ణీ గొప్ప విందు ఏర్పాటు చేశారు.

ఆ విందు జరిగేటప్పుడు ఆటలూ పాటలూ సాగినై. యువకులైన గుహవాసులు







మల్ల యుద్ధాలూ, ఈటెలతో రకరకాల వ్యాయామాలూ చేశారు.

ఏందు మధ్య జయమల్లు బిదాలికీ, శ్వానకర్ణికీ ఒక సలహా యిచ్చాడు. రెక్కల మనుషుల ప్రమాదం యిక లేదు గనక, వాళిద్దర్నీ తమ తమ ముఠాలతో కొండ గుహలు వదిలి వచ్చి, సమతలంగా వున్న ఆ ప్రాంతాల విశాలమైన గృహాలు నిర్మించుకో మన్నాడు.

ఈ సలహాకు శ్వానకర్ణి అనంగీకార సూచకంగా తల వూపి, "మేము మా తాత ముత్తాతలకు పూర్వం నుంచి కూడా గుహల్లోనే కాలం గడుపుతున్నాం. ఇప్పుడు ఆ ఆచారం వదిలి, ఈ చెట్ల కింద ఎలా నివశించటం?" అన్నాడు. బిదాలి కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చాడు.

జయమల్లు చిరునవ్వు నవ్వి, "అయితే, ఒక పని చెయ్యండి. ఒకేసారి అందరూ గుహలు వదిలి రాకుండా, మీలో కనీసం యువతరం వాళ్ళనైనా యిక్కడ నివశం చేలా చేయండి. గుహల్లో వుండటంకన్నా, యిక్కడ వెలుగూ, గాలీ వున్న ప్రాంతాల నివశించటం ఆరోగ్యకరం అని తెలితే, మిగతా వాళ్ళు కూడా ఆ తరవాత యిక్కడికి రావచ్చు. ఏది ఏమైనా, ఆ రెక్కల మనుషుల్ని మాత్రం తిరిగి యిక్కడికి వచ్చి గుడారాలు కట్టకుండా చూడండి. ఈ ప్రాంతం మంచినీటి సమృద్ధీ, ఆహార సమృద్ధీ కలది," అన్నాడు.

"ఆ రెక్కల మనుషుల్ని గురించిన భయం మా కేమీ లేదు. మీ సహాయం వల్ల నేను మా మూల పురుషుడి మహత్తర శక్తులు గల గద సంపాయించుకున్నాను. బిదాలికీ నాకూ మధ్య యిప్పుడు శత్రుత్వ మేమీ లేదు, మేము మిత్రులం. మా రెండు ముఠాలకూ మీరు చేసిన మేలు మరువ రానిది. మా నుంచి మీ కెలాంటి సహాయం కావాలో అడగండి. ఎంత కష్టసాధ్యమైన







డైనా చేయగలం," అన్నాడు శ్వానకర్ణి. శ్వానకర్ణి మాటలకు అంగీకార సూచకంగా బిడాలి తల వూపాడు.

జయమల్లు తన అనుచరు లిద్దరి కేసి ఓమారు చూసి, తరవాత బిడాలి, శ్వానకర్ణులతో, "మీరు, కోరితే మా కెలాంటి సహాయమైనా చేస్తారని మాకు తెలుసు. మేము రాకాసిలోయకు వెళ్ళాలి. అక్కడికి వెళ్ళి తిరిగివచ్చిన వారెవరైనా మీలో వుంటే చెప్పండి," అన్నాడు.




జయమల్లు యిలా అనగానే బిడాలి, శ్వానకర్ణులు ముఖముఖాలు చూసుకున్నారు. ఇద్దరి ముఖాల్లో ఆశ్చర్యం, భయం తాండవించింది. శ్వానకర్ణి గొంతు ఓమారు సవరించుకుని వూరుకున్నాడు. బిడాలి తల వంచుకుని చిన్నగొంతుతో, "ఆ రాకాసి లోయకు వెళ్ళివచ్చిన వాళ్ళెవరూ, మా తరం వాళ్ళలో బతికి లేరు. కాని, దాన్ని గురించి విన్నాం. అది ఈ అరణ్యాల కవతల గల కొండల్లో ఒక గొప్ప లోయ. అక్కడికి చేరటం చాలా కష్టం; తిరిగి రాగలగటం అంతకన్న కష్టం. ఇంతకూ అక్కడి కెళ్ళవలసిన పని మీకేం కలిగింది?" అని ప్రశ్నించాడు.

"బిడాలి! నీ మాటలనుపట్టి చూస్తాంటే, నీకు ఆ ప్రాంతాలకు వెళ్ళే దారి తెలుసు నన్నట్టు కనబడుతున్నది. ఆ మార్గం ఏదో చూపించు, చాలు. ఆ లోయలో పెరిగే ఒక గొప్ప ఓషధి మాకు కావాలి. బ్రహ్మపుర రాజుకు నయంకాని వ్యాధి ఒకటి పుట్టింది. ఆ ఓషధితో ఆయన వ్యాధి కుదరగలదని రాజవైద్యులు మమ్మల్ని పంపారు," అన్నాడు జయమల్లు.

"బిడాలి చెప్పినట్టు, ఆ లోయకు వెళ్ళటం, తిరిగిరావటం కూడా అసంభవం, ఆలోచించుకోండి," అన్నాడు శ్వానకర్ణి.

"అవన్నీ ఆలోచించకుండానే, యింత దూరం వచ్చామనుకున్నావా, శ్వానకర్ణీ? మేం ఎలాంటి ప్రమాదాలనైనా ఎదుర్కో







టానికి సిద్ధంగానే వున్నాం. దారేదో మాకు చూపండి. పోతే, మీరు మాకు చేయవలసిన మరొక సహాయం; ఆ పులుగురాయుడి వెంట, బ్రహ్మదండి అనే మాంత్రికుడొకడున్నాడు. వాడు మీకు దొరికితే ప్రాణాలతో మేం తిరిగివచ్చిన దాకా బందీగా వుంచినా సరే, లేక చంపినా సరే, మా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు జయమల్లు.

"ఓ ఆ సంగతి గుర్తు పెట్టుకుంటాం. మీకు రాకాసిలోయకు దారి చూపటమే కాదు, మీ వెంట నేనూ బిడాలీ కూడా వస్తాం. ఏమంటావ్ బిడాలీ?" అని అడిగాడు శ్వానకర్ణి.

బిడాలి ఎక్కడలేని ఉత్సాహం కనబరుస్తూ, "నేను పెద్దవాణ్ణయి పోయాను. నా ముఠాకు నాయకుడుగా తగిన యువకుణ్ణొకణ్ణి చూసి నియమించి, మీ వెంట రాగలను," అన్నాడు.

దీనికి కేశవుడూ, జయమల్లూ అభ్యంతరం చెప్పారు. తరవాత కొంత చర్చ జరిగిన మీదట, సూర్యాస్తమయానికి ఓ గంట ముందుగా, కేశవుణ్ణీ, జయమల్లునూ, కోదు గోమాంగనూ అక్కడవున్న ఎత్తయిన పర్వత శిఖరాల మీది నుంచి, బలమైన ఊడల సాయంతో బిడాలీ, శ్వానకర్ణి ముఠావాళ్ళు లోయలోకి దించారు.

ఆ లోయలో వున్న ఒకానొక సొరంగ మార్గం వెంటపోతే, అది రాకాసి లోయకు దారి తీయగలదని వాళ్ళు చెప్పారు.

ఊడల సాయంతో కొండశిఖరం మీది నుంచి లోయలోకి దిగిన కేశవుడూ అతడి అనుచరులకు దూరంగా డప్పులమోత వినబడింది. వాళ్ళు అటుకేసి చూశారు. గణాచారిలా జుట్టు విరబోసుకుని వున్న ఒకడు, చిందులు వేస్తూ కేకలు పెడుతున్నాడు. అతడి చేతిలో భయంకరరూపం గల ఒక పక్షి వున్నది. —(ఇంకా వుంది)








## 32

[ మొసళ్ళ మడుగు వద్ద కేశవుడూ అతడి అనుచరులను బిడాలీ, శ్యానకర్ణి రక్షించారు. ఆ తరవాత కేశవుడు తన మిత్రులిద్దరితో కలిసి, గుహావాసుల సాయం వల్ల కొండశిఖరం మీది నుంచి ఒకానొక లోయలోకి దిగారు. అక్కడ వాళ్ళకు భయంకరపక్షి పిశాచాన్ని చేత బట్టుకుని గంతులు వేస్తున్న గణాచారిలాటి వాడొకడు కనిపించాడు. తరవాత—]

లోయలోకి దిగుతూనే తమకు ప్రత్యక్షమైన ఈ వింత దృశ్యం చూసి కేశవుడూ, అతడి అనుచరులు ఆశ్చర్యపోయారు. జయమల్లు గణాచారిగ్గాని, అతడి ఎదురుగా చేరి డప్పులు వాయిస్తూ నాట్యం చేస్తున్న అతడి అనుచరులగ్గాని, కనబడకుండా వుండేందుకు, దాపుల నున్న ఒక మహా వృక్షం ఎక్కాడు.

ఆ వెంటనే కేశవుడూ, కోయగోమాంగ్ కూడా చెట్టు మీదికి పాకారు.

"వీళ్ళేదో నరమాంస భక్షకుల్లా కనబడుతున్నారు. ఆ గండభేరుండ పక్షిని చేత బట్టుకుని చిందులు తొక్కేవాడు, వాళ్ళ నాయకు డనేందుకు సందేహంలేదు. మళ్ళీ మనం చిక్కుల్లో పడలేదు గదా!" అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలకు కేశవుడేదో జవాబు చెప్పబోయేంతలో, గణాచారిలా గంతులు వేస్తున్న వాడు తన అనుచరుల కేసి తిరిగి, పెద్దగా గొంతెత్తి, "మన కష్టాలన్నిటికీ







కారణం, శత్రువులు మన గండభేరుండ పక్షి మాతల్ని సంహరించటమే. ఆ పక్షి మాతల్ని మనం కాపాడామో, ఆ మాతలు మనను కాపాడుతవి. గండభేరుండాల్ని రక్షించే సాహసం మీలో ఎవరైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు జవాబుగా అతడి అనుచరులు ఈటెలు పైకెత్తి, "గండభేరుండాల్ని పట్టుకుని, వాటి రెక్కలు నరికి ఎత్తుకు పోతున్న వాళ్ళెవరో మాకు తెలుసు. ఈనాటి నుంచి ఆ దుర్మార్గుల్ని ఈ ప్రాంతాల అడుగు పెట్టకుండా చేయగలం. యిదే, మా ప్రతిజ్ఞ!" అన్నారు.

"అలా అయితే, యిక వెళ్ళండి. రాత్రనక పగలనక, ఆ పక్షి మాతలు నివసించే లోయ ప్రాంతాలను శత్రువుల నుంచి కాపాడండి," అంటూ గణాచారి తన చేతిలో వున్న గండభేరుండపక్షిని వదిలేశాడు.

"ఇదీ సంగతి! ఫులుగురాయుడి ముఠా వాళ్ళు యీ ప్రాంతాల వున్న గండభేరుండ పక్షుల్ని పట్టుకుని, వాటి రెక్కలు నరుక్కు పోతున్నారన్న మాట," అన్నాడు జయమల్లు తల పంకిస్తూ.

"వాళ్ళు చేస్తున్న ఈ దుండగాల వల్ల మనం చిక్కుల్లోపడే ప్రమాదం వున్నది. మనం యీ గణాచారిగాడి అనుచరుల కంట బడితే, మననూ రెక్కల మనుషుల కింద జమకట్టి హత మార్చేందుకు ప్రయత్నిస్తారు," అన్నాడు కేశవుడు.

"మనకు అడుగడుగునా అవాంతరాలే. రాకాసిలోయను సమీపిస్తున్నామన్న సంతోషం ఏమీ లేకుండా పోయింది. వీళ్ళను తప్పుకుని కొండల్లోని ఆ సొరంగ మార్గం తెలుసుకోవటం ఎలా?" అని ప్రశ్నించాడు కోయుగోమాంగ్.

ఈ విధంగా చెట్టుకొమ్మల్లో దాగి వున్న ఆ ముగ్గురూ ఆలోచిస్తున్నంతలో గణాచారి కొద్ది మంది తన అనుచరుల్ని వెంటపెట్టు





కుని వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు మరికొంతసేపు కొమ్మల్లోనే వుండి, ఆ చుట్టు పక్కల ఎవరూ లేరని ధృవపడిన తరవాత మెల్లిగా చెట్టు దిగి వచ్చారు.

"ప్రస్తుతానికి ఆ గణాచారిమూలా భయం లేదు. బిడారీ, జ్ఞానకర్ణి చెప్పిన ఆ సారంగ మార్గమేదో తెలుసుకుంటే రాకాసిలోయకు చేరవచ్చుగదా," అన్నాడు కొయ్యగోమాంగ్.

ఆ మాటలకు జయమల్లు నవ్వి, "ఇన్ని కొండలూ, గుట్టలూ వున్న ఈ ప్రదేశంలో మనకు కావలసిన సారంగమార్గం వెతకటం తేలికకాదు. మనం ముందు ఈ లోయలో నివసించే వాళ్ళ కంటబడకుండా మెలకువతో వుండాలి. అది చాలాముఖ్యం," అన్నాడు.



కేశవుడు నిశ్శబ్దంగా చెట్లచాటున నడుస్తూ అల్లంత దూరంలో వున్న కొండల కేసి చేయిచూపి, "మనం ఆ ప్రాంతాలకు ఏ ప్రమాదం లేకుండా చేరగలిగితే, ఆ తరవాత ఆ సారంగ మేదో కనుక్కోవచ్చు. మాట్లాడకుండా నడవండి," అన్నాడు.

ఆ తరవాత ముగ్గురూ కొంతదూరం నడిచి ఒక కొండప్రాంతాన్ని సమీపించారు. ఆ కొండ ఎగుడు దిగుడుగా వున్న పెద్ద పెద్ద బండరాళ్ళతో నిర్జనంగా కనిపించింది. ఆ ప్రాంతాల గణాచారి అనుచరు లెవరూ లేరని నిశ్చయించుకున్న తరవాత కేశవుడూ వాళ్ళు చెట్ల చాటు నుంచి బయిటికి వచ్చి, కొండను సమీపించబోయారు.

హఠాత్తుగా వాళ్ళకు ఎదురుగా వున్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి కేకలు వినిపించినై. ముగ్గురూ తలలు ఎత్తి అటుకేసి చూశారు. నలుగు రైదుగురు అడవి మనుషులు వాళ్ళ కేసి ఈటెలు ఊపుతూ, "ఎవరు మీరు? వెనక్కు తిరిగిపొండి. ఒక్క అడుగు ముందుకు వేశారో ప్రాణాలు దక్కవు. గండభేరుండాల రెక్కలు నరుక్కు పోయే మీ దుర్మార్గం యిక సాగదు," అని పెద్దగా అరిచారు.







వాళ్ళ కేకలకు జవాబుగా జయమల్లు, "మేము గండభేరుండపక్షుల రెక్కలు నరుక్కుపోయేందుకు వచ్చిన వాళ్ళం కాదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి," అని కేకవేశాడు.

జయమల్లు మాట ముగిసేలోపలే కొండ మీది నుంచి పెద్ద పెద్ద రాళ్ళు వేగంగా వచ్చి వాళ్ళు నిలబడిన చోట పడసాగినై. కోయగోమాంగ్ రాళ్ళు విసిరే వాళ్ళతో ఏదో అనబోయేంతలో జయమల్లు అతడి భుజం పట్టుకు వెనక్కు లాగుతూ, "నువ్వేమి చెప్పినా, వాళ్ళ నుంచి నీ కొచ్చే జవాబు రాళ్ళవర్షం తప్ప మరేంవుండదు. వెనక్కు తిరిగి వాళ్ళ దెబ్బకు అందకుండా పారిపోవటమే ప్రస్తుతానికి క్షేమం," అన్నాడు.

జయమల్లు వెనకగా కేశవుడూ అతణ్ణి అనుసరించి కోయగోమాంగ్ కొంతదూరం పరిగెత్తి, అక్కడ వున్న రాళ్ళవెనక ఆయాస పడుతూ కూచున్నారు. కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు. గణాచారి అనుచరులు తమను వెన్నంటి వస్తున్నారేమో అన్న భయంతో, వాళ్ళ అలికిడి కోసం జాగ్రత్తగా కొద్దిసేపు విని, అలాంటిదేమీ లేకపోవటంతో ముగ్గురూ తృప్తిగా ఒక నిట్టూర్పువిడిచారు.

"మనం రాకాసిలోయను చేరేందుకు ఉపయోగపడే సొరంగ మార్గం ఎక్కడ వున్నదో నాకు తెలిసిపోయింది," అన్నాడు జయమల్లు. కేశవుడూ, గోమాంగ్ అతడి కేసి ఆశ్చర్యంగా చూశారు.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, "ఆశ్చర్యపడకండి. రాకాసిలోయ అనేది ఈ కొండల వెనక ఎక్కడో వున్నదనిగదా, బిడాలీ, శ్వానకర్ణి చెప్పింది. అంటే యీ కనబడే కొండలు దానికి ఒక వైపున వున్న ఆనకట్ట లాంటి వన్నమాట. వీటిని ఎక్కిచూస్తే లోయా, ఆవతల మరొక కొండల సాలుపూ కనబడిడే, ఆ మధ్యనున్న లోయ, రాకాసిలోయ!" అన్నాడు.







"అలా అయితే వాళ్ళు చెప్పిన 'ఒకానొక సారంగం' మాటేమిటి?" అని అడిగాడు కోయగోమాంగ్.

"ఒకానొక, అనటంలోనే ఆ బిదాలికీ, శ్వానకర్ణికి యీ ప్రాంతాల గురించిన వివరాలేవీ బాగా తెలియవని తెలిసిపోతున్నది. ఆ రాకాసిలోయకు వెళ్ళి తిరిగి వచ్చినవాడెవడూ లేడని వాళ్ళే చెపుతున్నారు గనక, ఆ సారంగం అదీ అంతా పుక్కిటిపురాణం ఎందుక్కాగూడదు?" అన్నాడు జయమల్లు.

"అలా అయితే, మనం ఏ విధంగా అయినా గణాచారి అనుచరుల కనుగప్పి, వాళ్ళున్న కొండప్రాంతం చేరాలని నీ అభిప్రాయం. అంతేనా, మల్లూ?" అని అడిగాడు కేశవుడు.

జయమల్లు అవునన్నట్టు తలవూపి, "మనం చీకటిపడ్డ తరవాత బయలుదేరటం మంచిది. ఈ లోపల యిక్కడే కాలక్షేపం చేద్దాం. ఇక్కడ శత్రుభయం ఉండదని నా నమ్మకం. ఆకలిగావున్నది. ఏదీ, మనం వెంట తెచ్చుకున్న ఆహారం బయటికి తీయండి," అన్నాడు.

కోయగోమాంగ్ పెద్ద పెద్ద టేకు చెట్టు ఆకులలో కట్టివున్న ఆహారాన్ని కట్లువిప్పి జయమల్లూ, కేశవుడి ముందు పెట్టాడు. ఆ తరవాత ముగ్గురూ తృప్తిగా భుజించి సూర్యాస్తమయం అయేవరకూ అక్కడే కాలం గడిపారు.

సూర్యాస్తమానం అయిన కొద్దిసేపటికి చంద్రోదయ మయింది. కేశవుడూ అతడి మిత్రబృందం కొండ ఎక్కేందుకు ప్రయాణమయారు. జయమల్లు తన అనుచరుల కేసి తిరిగి, "ఈ వెన్నెల మనకూ, గణాచారి ముఠా వాళ్ళకూ కూడా అనుకూలమైనదే. మనం ఈ ప్రాంతాలకు కొత్త గనక, దారిమార్గం వెతుక్కోవటానికి ఉపయోగంగా వుంటుంది, శత్రువులకు కూడా మన చర్యలు గుర్తించటం తేలిక. కనక, సాధ్య







మైనంత వరకూ చెట్ల చాటున—చీకటిలో నడవండి," అన్నాడు.

ముగ్గురూ ఆ విధంగా చీకటి మాటున నడుస్తూ, కొండప్రాంతం కేసి కొంతదూరం నడిచే సరికి, ఎదురుగా ఒక చెట్టు కింద నల్లని ఆకారం ఒకటి కదిలిన సవ్వడి వినిపించింది.

ఆ వెంటనే ముగ్గురూ అక్కడ గుబురుగా వున్న పొదలచాటున నక్కి కూచుని, ఆ ఆకారం కేసి పరీక్షగా చూశారు.

"ఒక్కడే ఒక్కడు! కొండ మీదికి వెళ్ళే మార్గాన్ని కాపలాకాచే గణాచారి అనుచరుడై వుంటాడు," అన్నాడు కోయుగోమాంగ్.



"అందుకు సందేహం ఏమీలేదు. కాని, వీడు యిక్కడ వుండగా మనం ముందుకు వెళ్ళటం అసంభవం. వీణ్ణి ఏదో విధంగా యిక్కడ కాళ్ళూ చేతులూ కట్టి పడ వెయ్యాలి," అన్నాడు కేశవుడు.

"అదేపాటి కష్టమయిన పని! నేను ఆ పక్కన వున్న పొదల్లోకి వెళ్ళి కొంచెం అలికిడి చేస్తాను. అదేమిటో చూసేందుకు వాడు బయలుదేరతాడు. మీరు వెనకనుంచి వాణ్ణి పట్టుకుని, అరవకుండా నోరు మూసి, కాళ్ళూ చేతులూ బిగించండి," అంటూ కోయుగోమాంగ్ వున్న చోటు నుంచి కదిలి, పిల్లిలా నక్కినక్కి నడుస్తూ పొదల చాటుకు వెళ్ళాడు.

కొద్దిసేపట్లో గోమాంగ్ వెళ్ళిన పొదల వెనక నుంచి చిన్నచిన్న ధ్వనులు బయలుదేరినై. ఆ వెంటనే గణాచారి అనుచరుడు ఈటెను పైకెత్తి, పొదలకేసి నడుస్తూ, "ఏయ్, ఎవరక్కడ? బయిటికి రండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

వాడా విధంగా పొదలను సమీపించే లోపల కేశవుడూ, జయమల్లూ నీడల్లా నిశ్శబ్దంగా కదిలి, హఠాత్తుగా వెనక నుంచి వాడి మీద పడ్డారు. కేశవుడు కాపలావాడి చేతులు రెండూ వెనక్కు విరిచి పట్టుకుని,

కాళ్ళను తన కాళ్ళతో మెలివేశాడు. జయమల్లు వాడి నోటిని తన చేత్తో గట్టిగా మూసి, మెడను వెనక్కు వంచాడు. కాని, ఈ లోపల గణాచారి అనుచరుడు కీచు మంటూ పెద్దగా ఒక కేకపెట్టాడు. ఆ వెంటనే కొండ మీది నుంచి అరుపులు వినబడినై.

"ఇక వీణ్ణి ఆలస్యం కాకుండా కాళ్ళూ చేతులూ కట్టి, నోట్లో ఆకలములు కుక్కండి. వీడు పెట్టిన కేక, కొండ మీద వున్న వీడి మిత్రులు వినటం ఒక విధంగా మనకు ఉపయోగపడవచ్చు," అన్నాడు జయమల్లు.

క్షణాల మీద జయమల్లు వాళ్ళు తమ పని ముగించుకుని కొండ కేసి చూసేసరికి, అటువేపు నుంచి నలుగురైదుగురు గణాచారి ముఠా వాళ్ళు పరిగెత్తుకు రావటం కనిపించింది.

"ఆ కొండ మీద కాపలావున్న వాళ్ళంతా తమ అనుచరుడి రక్షణకు యిటు పరిగెత్తుకొస్తున్నారు. మనం ఏ ఆటంకం లేకుండా కొండ మీదికి చేరవచ్చు. పరిగెత్తండి!" అంటూ కేశవుడు కొండ కేసి దౌడు తీశాడు.

కేశవుడు ఊహించినట్టు కొండ శిఖరం మీద శత్రువు లెవరూ లేరు. అతడు శిఖరం మీది నుంచి అవలి వైపుకు చూసి నిశ్చేష్టుడయాడు. అతడికి అక్కడ వెడల్పయిన లోయా, వింత వృక్షాలూ, వాటి మీద పక్షా



చాల్లా రెక్కలు చాచుకు నిలబడి వున్న గండభేరుండాలూ కనిపించినై.

"ఇదే, రాకాసిలోయ!" అన్నాడు కేశవుడు ఎంతో ఉత్సాహంగా.

"సందేహం లేదు. కాని, యీ శిఖరం మీది నుంచి లోయలోకి ప్రవేశించటం ఎట్లా? నిట్టనిలువుగా వున్న యీ రాళ్ళమీద ఎక్కడా కాస్త కాలు మోపేందుకూడా ఆస్కారం లేదే!" అన్నాడు జయమల్లు నిరాశగా.

"ఇదుగో, యిక్కడేవో అడవి లతల తీగలు వున్నవి. వీటి సాయంతో మనం లోయలోకి దిగవచ్చు," అన్నాడు కోయ గోమాంగ్ ఉత్సాహంగా.

ఆ తీగలు తమ బరువును మోసేంత బలంగా వున్నవో లేవో పరీక్షించేందుకు జయమల్లూ, కేశవుడూ వంగి వాటిని పట్టి చూస్తున్నంతలో, వెనక నుంచి పెద్ద రణగొణ ధ్వని వినబడింది.

"చూడండి, ఆ దుర్మార్గులు యిక్కడే వున్నారు. చుట్టుముట్టి ఈ పెలతో పొడవండి!" అంటూ ఒకడు పెద్దగా అరిచాడు. ఆ వెంటనే ఆయి దారుగురు గణాచారి ముఠావాళ్ళు పెడ బొబ్బలు పెడుతూ శిఖరం పైకి రాసాగారు.

"ఈ అడవి తీగలు పట్టుకుని లోయలోకి దిగటం తప్ప మనకు మార్గాంతరం లేదు. ఊం రండి!" అంటూ జయమల్లు బలమైన తీగ నొకదాన్ని పట్టుకుని శిఖరం మీది నుంచి లోయలోకి దిగసాగాడు. కేశవుడూ, గోమాంగ్ అతణ్ణి అనుసరించారు.

"ఆ తీగ ఎక్కడున్నదో చూసి, రాళ్ళతో దాన్ని నజ్జునజ్జు చేయండి! ఆ ముగ్గురు దుర్మార్గులూ కింది లోయలో రాళ్ళ మీద పడి పచ్చడి అయిపోతారు," అని గణాచారి ముఠా వాడొకడు కేకపెట్టాడు. ఆ వెంటనే వాడి అనుచరులు రాళ్ళు తీసుకుని తీగను నరకసాగారు. —(ఇంకా వుంది)








## 33

[ కేశవుడూ అతడి అనుచరుల్నీ, గణాచారి ముఠా వాళ్ళు పట్టుకో చూశారు. కాని, వాళ్ళు రాత్రివేళ వాళ్ళ కనుగప్పి, కొండశిఖరం చేరారు. అవతల, వాళ్ళకు ఒక భయంకరమైన లోయ కనిపించింది. వాళ్ళు అడవి తీగ నొక దాన్ని పట్టుకుని లోయలోకి దిగుతున్నంతలో, గణాచారి ముఠా వాళ్ళు వచ్చి, రాళ్ళతో తీగను నరికి వేయసాగారు. —తరవాత ]

తమకు ఆధారంగా వున్న అడవి తీగను గణాచారి ముఠా వాళ్ళు పైన నరికివేస్తున్న శబ్దం వింటూనే, కేశవుడితో పాటు జయమల్లూ, కోయగోమాంగ కూడా భయంతో కంపించి పోయారు. కాని, మరుక్షణంలో వాళ్ళకు ఎక్కడలేని గుండెధైర్యం కలిగింది.

"ఇన్ని కష్టాలు దాటి, యింత దూరం వచ్చి, యిక్కడ చావబోతున్నామంటే నేను నమ్మను," అన్నాడు కేశవుడు నిండు కంఠంతో.

"నీ వన్నది నిజం, కేశవా! నా కాలి కదో పట్టు చిక్కింది. మీరు తీగ మీద నుంచి సాధ్యమైనంత బరువు తగ్గించి, చేతి పట్టు కేమైనా దొరుకుతుందేమో చూడండి. వీలయితే, మనం తీగను ఏ రాతి కన్నా ముడి వేయటం మంచిది. అప్పుడు, పైన తెగినా, మనం ఒక్కసారిగా లోయలోకి పడిపోం," అన్నాడు జయమల్లు.

జయమల్లు మాట ముగించే లోపలే, ముగ్గురిలో పై నున్న కోయ గోమాంగ,







"ఆ దుర్మార్గులు తీగనరికేశారు!" అంటూ ఒక్కసారిగా అరిచి, తల కిందులైపోయాడు.

అతడితో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా పట్టు తప్పి, గాలిలో ఒకటి రెండు పల్టీలు కొట్టారు. కాని, వాళ్ళల్లో ఎవరూ తమ చేతిలో వున్న అడవి తీగను విడిచి పెట్టలేదు. ఆ జాగర్తే వాళ్ళను కాపాడింది. కను మూసి తెరిచేంత వ్యవధిలో వాళ్ళు తిరిగి రాళ్ళ కేసి గుంజబడ్డారు. ముగ్గురి శరీరాలూ, శిఖరం దిగువనున్న రాళ్ళను బలంగా తాకినై.

"తెగ నరకబడిన అడవి తీగ మన అదృష్టం కొందికి, దిగువను ఏ రాయినో చుట్టుకుని బిగుసుకుపోయింది," అన్నాడు జయమల్లు.

కేశవుడూ, గోమాంగ్ ఏదో జవాబివ్వ బోయేంతలో, కొండ శిఖరం మీది నుంచి గణాచారి ముఠా వాళ్ళు ఉత్సాహంగా, "ఆ దుష్టులు యీసరికి కింది లోయలోని రాళ్ళమీద పడి తునాతునియలై వుంటారు. మన పక్షి మాతల రెక్కలు నరుక్కు వెళ్ళే వాళ్ళందరికీ, యిదే చావు రాసిపెట్టివున్నది," అంటూ పెద్దగా కేకలు పెట్టారు.

ఆ కేకలకు లోయ అంతా ప్రతిధ్వనించింది. పెద్దపెద్ద చెట్ల మీద రెక్కలు దాచుకు నిలబడి వున్న గండభేరుండాలు గొంతులెత్తి కర్ణకఠోరంగా ఒక్కసారి అరిచినై. ఎక్కడో పులి ఒకటి రంకె వేసింది. ఈ భయంకర ధ్వనులను విని నిశ్చేష్టులైన కేశవుడూ అతడి అనుచరులు తెప్పరిల్లే లోపలే, ఒక మానవ కంఠం లోయలో నుంచి వినుక్కొంటున్నట్టు కటువుగా పలికింది: "కింకరా! ఏమిరా, ఆ రణగొణ ధ్వనులు? పులిరాజు కూడా మేల్కొన్నాడు!" అన్నదా కంఠం.

ఆ వెంటనే జవాబుగా మరో గొంతు, "జగభోజ గురో! ఆ గణాచారి సజ్జు ఎవర్నో చంపి రాకాసిలోయ లోకి తోసినట్టుంది. ఈ గత్తర కంతా అదే కారణం," అన్నది.







"ఆ వచ్చిన వాళ్ళు బ్రహ్మపురం రాజూ, వాడి గురువూ కాదుగదా? వాళ్ళే మధ్య మన చెవులపాలిట జోరీగల్లా తయారయ్యారు," అన్నాడు జగభోజి.

"వాళ్ళా! వాళ్ళిక్కడికి దారి తెలుసుకుని వచ్చే లోపల, మనం రాకన్నెను పెళ్ళాడి, ధనరాసులతో కూడా అంతర్ధాన మవుతాం. తరవాత వాళ్ళు యీ లోయలోని గండ భేరుండాలకూ, కొండ చిలవలకూ, క్రూర మృగాలకూ ఆహారం కావలిసిందే!" అన్నాడు కింకరుడు.

"ఆఁ, రాకన్నె! కింకరా, ఆ మాటే మరిచాను. అమావాశ్య యింకా పదమూడు రోజులున్నది. ఆ రాత్రిగాని నాకు ఆ కన్నెతో లగ్నం కుదరదు. ఇప్పుడు లోయలో రేగిన గడబిడకి ఆ అందాల హంస నిద్ర మేలుకుని కలవర పడుతున్నదేమో చూడు," అన్నాడు జగభోజి.



కింకరుడు పెద్దగా నవ్విన సవ్వడి అయింది. ఆ తరవాత వాడు పెద్దగా గొంతెత్తి, "గురో, ఆ కన్నె...కల్పకవల్లి... అందాల హంస కాదు, భయంకర బెబ్బులి! తన తండ్రి బ్రహ్మపురం రాజూ, ఆయన గురువూ కలిసి వచ్చి తనను కాపాడగలరనే యింకా భ్రమిస్తున్నది. అందుకే మిమ్మల్ని చులకన చేసి మాట్లాడుతున్నది. ఆవిడి క్కాస్త, ఈ రాకాసిలోయ అంటే బెదురు పుట్టటం అవసరం, మీరలా వూరుకోండి," అన్నాడు కింకరుడు.

ఆ తరవాత అంతా నిశ్శబ్దం. లోయ కింది భాగం నుంచి వచ్చిన యీ సంభాషణ అంతా విన్న కేశవుడూ, జయమల్లూ, కోయ గోమాంగ్ ఆశ్చర్యంతో, భయంతో కంపించి పోయారు. ఒకటి రెండు క్షణాలపాటు మాట్లాడదామన్నా ఎవరికీ గొంతు పెగిలింది కాదు. ఆఖరికి జయమల్లు కంపిస్తున్న కంఠ స్వరంతో మెల్లిగా, "విన్నావా, కేశవా?" అని అడిగాడు.









"మనం బ్రహ్మపురం వదిలి చాలాకాలమైంది. ఈ లోపల అక్కడ చాలా మార్పులు జరిగినట్టుంది. రాజకుమార్తె కల్పకవల్లి, ఈ రాకాసిలోయ ఎలా చేరింది? ఈ జగభోజి ఎవడు? కింకరు డనే వాడు వాడి నమ్మిడిలా వున్నాడు. మనం రాకుమారిని రక్షించగలమా, జయమల్లూ?" అన్నాడు కేశవుడు.

జయమల్లు కేశవుడి మాటలు విని జవాబిచ్చే స్థితిలో లేడు. అతడు, జగభోజికీ, కింకరుడికీ జరిగిన సంభాషణ వెనక వున్న రహస్యం ఏమిటో తెలుసుకునేందుకూ, 'పులిరాజు' అన్న జగ భోజి మాటల అర్థం కనుక్కొనేందుకూ ఆలోచిస్తున్నాడు.

"కేశవా! ఈ సంగతేమైనా నీకు గుర్తువున్నదా? మనం బ్రహ్మపురం దగ్గిర కొండల్లో వున్నప్పుడు, బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుణ్ణి నీ మీదికి ఆవాహన చేశాడు. అప్పుడు నీవు ఆ మైకంలో కొన్ని రహస్యాలు చెప్పావు. అవేమిటో తరవాత నేను నీకు చెప్పాను," అన్నాడు జయమల్లు.

కేశవుడు అనుమానంగా జయమల్లు కేసి చూస్తూ తలాడించి, "ఆ గొడవేమీ నాకు అంతగా గుర్తు లేదు. ఈ రాకాసిలోయలో ధనరాసులున్న వన్న సంగ తొక్కటే నాకు బాగా జ్ఞాపకం వున్న విషయం!" అన్నాడు.

"విన్నాను. మనకంటే ముందే యిక్కడికి మాంత్రికుడో ఎవరో చేరినట్టున్నది. వాడి స్వాధీనంలో మన బ్రహ్మపురం రాజు కూతురు కల్పకవల్లి వున్నది. వాడు, మనం వచ్చిన ధనరాసుల కోసమే యిక్కడ కాపలా వేశాడు," అన్నాడు కేశవుడు.

జయమల్లు ఏమీ మాట్లాడ లేదు. అతడు ఆలోచనలో పడ్డాడు. అదృష్టవశాత్తూ, వాళ్ళకు కొంచెం దిగువగా కొండ అంచు నుంచి బయటికి పొడుచుకు వచ్చిన రాళ్ళు కొన్ని కనిపించినై. శిగ మీది నుంచి నిశ్శబ్దంగా వాటి మీదికి జారి ముగ్గురూ, చీకట్లో చుట్టూ కలయ చూస్తూ కూచున్నారు.









అప్పటి వరకూ వాళ్ళిద్దరి సంభాషణా వింటూ, నిశ్చేష్టుడై కూచుని వున్న కోయ గేమాంగ్, హఠాత్తుగా ప్రాణం వచ్చిన వాడిలా కేశవుడి కేసి తల తిప్పి, "నా కళ్ళకు లోయ నావల ఎక్కడో దీపాల వెలుగు కనిపిస్తున్నది. చెవులకు ఏనుగులు ఘీంకరించిన ధ్వని వినబడుతున్నది." అన్నాడు.

"నా కలాంటి కాంతులు గాని, ధ్వనులు గాని వినిపించటం లేదు. నన్నేదో మత్తు ముంచేస్తున్నది. నాకీ రాకాసిలోయలోని బంగారమూ వద్దు వెండీ వద్దు. ప్రాణం విసిగిపోయింది. చావంటే నాకేం భయం లేదు—కాని, చచ్చే ముందు ఒక్కసారైనా మా అయ్యను చూడగలిగితే, ఎంత బాగుం డును!" అంటూ కేశవుడు కళ్ళు మూసు కుని, వెనక్కు చేరగిలబడి పోయాడు.

జయమల్లు కేశవుడి భుజం పట్టుకుని లాలిస్తూ, "నిరుత్సాహ పడకు, కేశవా! ఎన్నో భయంకర ప్రమాదాలను ధైర్యంగా ఎదుర్కొని, ఇయింది ఇక్కడికి చేరాం. జగపాజ, వాడి శిష్యుడు కింకరుడి సంభాషణ విన్న తరవాత నాకు మన కష్టాలు తీరే సమయం ఆసన్నమయిందని నమ్మకం కలుగుతున్నది. మనం, నీ ముసలి తండ్రినే కాదు, బ్రహ్మపుర రాజునూ, రాజ గురు వునూ—అందర్నీ చూడగలగవచ్చు. ఈ లోయలోని నిధులు మాత్రం మనవి. అవి సంపాయించే శక్తి మనకే వున్నది. వాటి మీది హక్కు కూడా మనదే. ఇందులో సంశయించటాని కేమీ లేదు," అన్నాడు.

"భవిష్యత్తు మన కనుకూలంగా వున్నదని, అంత నమ్మకంగా నీ వెలా చెప్ప గలవు?" అని అడిగాడు కేశవుడు.

జయమల్లు ఓ క్షణకాలం తల పంకిస్తూ వూరుకుని తరవాత, చిన్న గొంతుతో, "కాల భైరవుడు నిన్నావేశించినప్పుడు, నీవు బ్రహ్మ దండి మాంత్రికుడితో అన్న మాటలివి: 'వింధ్యారణ్యాల కవతల ఒక గొప్ప కొండ








లోయ వున్నది. అదే రాకాసిలోయ! ఆ లోయలో ఒక చోట ఎత్తయిన ఒక రావి చెట్టు, దాని కింద ఒక పాము పుట్ట...ఎండి మోడుగా వున్న చెట్టు వెన్నెల రాత్రి ఫల పుష్పాలతో నిండి పోతుంది...పులిరాజును చంపి, చర్మం వలిచి, దాన్ని...'ఆ తరవాత బ్రహ్మపుర రాజగురువు తన మంత్రశక్తితో నీ నోరు కట్టేశాడు," అని చెప్పాడు.

"అంతా బాగానే వున్నది. మనం రాకాసి లోయ చేరామన్న సత్యం ఒక్కటి తప్ప, తలిమ్మా మాటల్లో వున్న నిజమెంతో యింత వరకూ సూచనగా నైనా బయటపడలేదు," అన్నాడు కేశవుడు నిస్పృహగా.

"కాలభైరవుడు ఆవేశించినప్పుడు, నువ్వు చెప్పిన ప్రతి అక్షరం నిజమై తీరుతుంది. ఇంతకు ముందు జగఫోజి అన్న మాటల్లో 'పులిరాజుకూడా మేల్కొన్నాడు!' అన్న పదం అర్థం ఏమిటి? మనం సూర్యోదయం కాగానే లోయలోకి దిగి, ఏదో విధంగా ఆ పులిరాజును చంపబోతున్నాం. తరవాత దాని చర్మం వలిచి, దాన్ని..."

జయమల్లు మాట ముగించే లోపలే, వాళ్ళు కూర్చుని వున్న కొండరాళ్ళకు దిగువగా పెద్దపులి భయంకరంగా రంకె వేసింది. ఆ ధ్వని వింటూనే ముగ్గురూ తలలు వంచి కిందికి చూశారు. వాళ్ళకు నిప్పు రవ్వల్లా కణకణ లాడుతూ మెరుస్తున్న రెండు కళ్ళు లోయ అడుగున కనిపించినై.

"ఇదే పులిరాజు! ఆ మెరుస్తున్న కళ్ళు మనం చూడ గలుగుతున్నామంటే, అది మోర ఎత్తి, మన కేసే చూస్తున్న దన్న మాట!" అన్నాడు కోయ గోమాంగ్.

"మన నది గుర్తించింది, దాన్ని మనం గుర్తించాం, బావుంది! ఒకళ్ళ నొకళ్ళు చంపుకునేందుకు వెతుక్కోవలసిన శ్రమ తప్పింది. గోమాంగ్! నీ దగ్గిర విషం పూసిన అంబులు వున్నవి గదా?" అన్నాడు జయమల్లు.

"వున్నది. ఇప్పుడే పులి వేట ప్రారంభిద్దామంటావా, మల్లూ?" అని అడిగాడు కోయ గోమాంగ్.

"వేటకు యిది సరైన సమయం కాదు. ఈ చీకట్లో, మనం చంపిన పులిరాజును జగభోజి ఎత్తుకు పోవచ్చు. మనం దాన్ని కొంచెం రహస్యంగా చంపాలి. అది మనను విడిచి పారిపోతుందన్న భయం లేదు. మన వాసన పసి కట్టింది గనక మనం దానికి గుప్తు; దాని మెరిసే కళ్ళు చూశాం గనక, మనకు అది గుప్తు. ఎప్పుడు ఎవరు చంపి చర్మం ఒలుచుకోగలమో ఉదయం కాగానే చూద్దాం. ఆ తరవాత జగభోజి అంతు తేల్చాలి." అన్నాడు జయమల్లు నిబ్బరంగా. గోమాంగ్, జయమల్లులు సంభాషిస్తున్నంతసేపూ కేశవుడు నిశ్చలంగా కూచుని వున్నాడు. వాళ్ళిద్దరి సంభాషణా ఆగిపోగానే అతడు, జయమల్లు కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "మల్లూ, నాకేం మతి పోవటం లేదుగదా! మేలుకుని వుండే కలలు కంటున్నానేమో అని భయంగా వున్నది. లోయ కావలి నుంచి ఏమిటా ధ్వనులు? వింతగా వుందే!" అన్నాడు.

"నీకూ, ఏనుగుల ఘీంకారం లాటి ధ్వనులు వినబడుతున్నవా?" అని ప్రశ్నించాడు, జయమల్లు.



"ఏనుగులు చేసే ఘీంకారాలే కాదు, ఎక్కడో గంటల చప్పుడు కూడా వినబడుతున్నది. ఏమంటావ్, గోమాంగ్? నీ కలాటి ధ్వను లేమైనా వినబడుతున్నవా?" అని అడిగాడు కేశవుడు.

"ఇదంతా ఏదో మాయలా వుంది. నాకు గంటలు మోగుతున్న ధ్వనే కాదు, గాలి మోసుకొస్తున్నట్టు, ఏవో మాటలు కూడా వినబడుతున్నవి. నన్నడిగితే, యిదంతా ఏదో మంత్ర ప్రభావం వల్ల మనకు కలుగుతున్న భ్రమ అంటాను," అన్నాడు గోమాంగ్.

కోయ గోమాంగ్ మాటలు జయమల్లులో రకరకాల ఆలోచనల్ని రేకెత్తించినై. గోమాంగ్ అన్నట్టు ఈ రాకాసిలోయ అంతా మంత్రగ్రస్తమా? జగభోజి బ్రహ్మపుర రాజు కూతురు కల్పకవల్లిని, ఏవిధంగా యిక్కడికి తీసుకు రాగలిగాడు? ఈ లోయలో నుంచి కాలు బయటికి పెట్టకుండానే, వాడా కార్యం సాధించాడా?

జయమల్లు అంతు దొరకని యిలాంటి ప్రశ్నలకు సమాధానాల కోసం సతమతమవుతుంటే, కేశవుడు తన తండ్రి యీ సమయంలో యిక్కడ వుంటే, ఎంతో బావుండేదని ఆలోచిస్తున్నాడు. కోయ గోమాంగ్ తమ నాయకుడైన గడబంగ్ వస్తే, రాజకుమారి జగభోజి చెర నుంచి విముక్తురాలు కాగలదని యోచిస్తున్నాడు.

రాకాసిలోయకు యీవలి వైపున ఆ ముగ్గురు మిత్రులూ ఎవరి ఆలోచనల్లో వారుండగా, లోయకు ఆవల నున్న మైదానంలో బ్రహ్మపురం రాజూ, రాజగురువూ సైన్యం మధ్య తమ కోసం నిర్మించబడిన డేరాల్లో కూచుని ముందు కర్తవ్యం గురించి చర్చలు జరుపుతున్నారు. వాళ్ళను పట్టుకున్న సమస్య; సైన్యంతో రాకాసిలోయ లోకి దిగటమా? లేక కొద్దిమంది అంగరక్షకుల్ని వెంట తీసుకుని లోయలోకి ప్రవేశించటమా? అన్నది. —(ఇంకావుంది)






## 34

[గణాచారి ముఠావాళ్ళ బారినుంచి-బయటపడిన కేశవుడూ అతడి మిత్రులకు, రాకాసి లోయలో, జగభోజీ, కింకరుడూ జరిపిన సంభాషణ వినబడింది. వాళ్లకు పులిరాజు కూడా కనిపించింది. లోయ కవతల సైన్యంతో వచ్చి చేరిన బ్రహ్మపురరాజు, తన గురువుతో లోయలోకి ఎలా ప్రవేశించటం అన్న విషయమై సంప్రతిస్తున్నాడు. —తరవాత]

కొంత చర్చ జరిగిన మీదట బ్రహ్మపుర రాజు, "గురువర్యా! ఈ సరికే జగభోజి మన రాక తెలుసుకుని వుంటే, వాడు అమ్మాయితో సహా లోయ వదిలి పారిపోయే ప్రమాదం వున్నదని నేను భయపడు తున్నాను," అన్నాడు.

రాజగురువు కొంచెం ఆలోచించి, తల పంకిస్తూ, "మహారాజా! మీరు అలాంటి భయాలేమీ పెట్టుకోకండి. మన రాక జగభోజికి తెలియదనుకోవటం పొరపాటు. అడవిలో కల్పకవల్లిని వాడు పట్టుకున్నప్పుడు అన్న మాటలు, ఆమె చెలికత్తెలు స్పష్టంగానే విన్నారు. ఈ రాబోయే అమావాస్యకు గాని, వాడి దీక్ష నెరవేరదు. అప్పటివరకూ ఎన్ని ప్రమాదాలొచ్చినా, వాడు యీ రాకాసి లోయలోనే వుంటాడు. ఒక వేళ వాడు ఆఖరి నిమిషంలో భయపడి పారిపో దలిచినా, మనం కాపుంచిన, గురు మౌనానందుడూ, కోయ గడెజంగ్ వాడి ప్రయత్నం సాగనివ్వరు," అన్నాడు.



రాజగురువు అన్నట్టే గురు మౌనానందుడూ, కోయ గడేజంగ్ తమ తమ అనుచరులతో రాకాసిలోయ నుంచి పైకి ఎక్కి పారిపోయేందుకు వీలున్న దారులన్ని వేయి కళ్ళతో కాపలా కాస్తున్నారు. మౌనానందుడి అనుచరుల్లో ముఖ్యులు ఉదాలి, శ్వానకర్ణి; కోయ గడేజంగ్ అనుచరుల్లో ముఖ్యుడు, నరమాంస భక్షకుల నాయకుడైన చండ మండూకుడు.

బ్రహ్మపుర రాజు వెంట వీరే కాక పెద్ద సేన కూడా వున్నది. అందులో గజాశ్వదళాలు కూడా వున్నవి. కోయగోమాంగ్ తనకు వినబడుతున్నవని చెప్పే గంటల సవ్వడులు; ఆ గజసైనిక దళాల్లోని, ఏనుగుల మెడలకు వేలాడుతున్న కంచు గంటలు చేసే ధ్వనులు.

రాత్రి గడుస్తున్న కొందికీ, లోయకు కొంచెం ఎగువగా రాళ్ళ మీద కూచునివున్న కేశవుడూ అతడి మిత్రులకు, అన్నివైపుల నుంచి రకరకాల శబ్దాలు వినబడుతున్నవి. పిండారబోసినట్టుగా వున్న వెన్నెల కాంతిలో వాళ్ళకు, దిగువనున్న లోయ స్పష్టంగా కనబడుతున్నది. జయమల్లు లోయ కేసి కొంచెంసేపు పరీక్షగా చూసి, "కేశవా! ఈ వెన్నెల వెలుగులో యిక్కడ్నించి మనం లోయలోకి దిగటం ఏమంత కష్టంకాదు. నా ఉద్దేశం, ఆ పులిరాజును సూర్యోదయం లోపలె చంపి, దాని చర్మం వలిచి, నువ్వు ధరించటం మంచిదని. తెల్లవారితే, మన ఉనికి జగభోజకీ, వాడి అనుచరుడికీ తెలిసిపోవచ్చు," అన్నాడు.

"నువ్వన్నట్టు ఆ పని ఎంత త్వరగా ముగించుకుంటె అంత మంచిది. ఈ లోయ చుట్టూ ఎవరో చేరి, మన కంటె ముందుగా లోయలోకి దిగే ప్రయత్నంలో వున్నారని నా అనుమానం. వాళ్ళు శత్రువులో, మిత్రులో మనకు తెలుసుకునే అవకాశం లేదు," అన్నాడు కేశవుడు.









ఆ తరవాత ముగ్గురూ, కోయగోమాంగ్ దగ్గిరవున్న విషం పూసిన అంబులను సమానంగా పంచుకుని, ఎగుడు దిగుడుగా వున్న రాళ్ళ మీది నుంచి, అడవి తీగను ఆసరాగా పట్టుకుని, లోయలోకి దిగారు.

లోయ అంతా నిశ్శబ్దంగా వున్నది. ఉండి వుండి ఏదో ఒక మహా వృక్షం మీది నుంచి గండభేరుండపక్షి ఒకటి వికృతంగా అరుస్తున్నది. నల్లని చెట్ల నీడలూ, ఆ నీడల్లో అటూ యిటూ ఎగిరే మిణుగురుపురుగులూ తప్ప. పులిరాజు అక్కడ వున్న సూచనలేమీ వాళ్ళకు కనిపించ లేదు.

"పులిరాజు యీ ప్రాంతాలే ఎక్కడో మన కోసం పొంచి కూచుని వున్నదని, నా నమ్మకం. ఈ రాళ్ళ దగ్గిర వుండటం ప్రమాదం. ఆ కనబడే ఎండిన మోడు చెట్టు కేసి నడవండి," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు.

ఆ క్షణంలోనే ఆ ముగ్గురూ సంభ్రమాశ్చర్యాలతో నిశ్చేష్టులైయ్యారు. చూస్తూండగానే, ఆ వెన్నెల రాత్రి, అంతవరకూ ఎండి మోడుగా వున్న చెట్టు ఫలపుష్పాలతో నిండిపోయింది.

"కేశవా, మనం జయించాం! ఈ దాకాని లోయలోని ధనరాసులు మనవే. కాలభైరవుడు నిన్నావేకంది నప్పుడు చెప్పిన దొకటి నిజమైంది. ఇక మనకు కావలసింది. ఆ పులిరాజు...."

జయమల్లు మాట ముగించే లోపలే, ఆశ్చర్యంగా ఆ క్షణాన ఫలపుష్పాలతో నిండిపోయిన మోడు చెట్టు వెనక నుంచి, పులి పెద్దగా గాండ్రించిన చప్పుడైంది. మరు క్షణాన కేశవుడు విల్లు అటు కేసి ఎక్కుపెట్టాడు. పులి చెట్టు వెనక నుంచి భయంకరంగా మరోసారి అరిచి, పంజా పైకెత్తి, కేశవుడి కేసి లంఘించ బోయింది. కేశవుడు విషబాణాన్ని గురి చూసి, పులిరాజు రెండు కళ్ళ మధ్య తగిలేలా కొట్టాడు.





పులి ఒక్కసారి గోండ్రించింది. చాపచుట్టలా పక్కకు పడిపోయింది. కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ పరుగు పరుగున వెళ్ళి దాని కాళ్ళూ నడుమూ పట్టుకుని పైకి లేపనెత్తారు. జయమల్లు చిన్నగొంతుతో, "నిశ్శబ్దంగా సాధ్యమైనంత త్వరగా ఏదైనా గుహలోకి పదండి. జగభోజ మనం పులిరాజును చంపిన సంగతి యిప్పుడే గ్రహిస్తే ప్రమాదం. దీని చర్మం వలిచి, కేశవుడు ధరిస్తే తప్ప, మన దెబ్బ కక్కడ తిరుగు వుండదు," అన్నాడు.

ఆ ముగ్గురూ చచ్చిన పులిరాజును మోసుకుని, దాపుల నున్న ఒక గుహలోకి చేరేంతలో జగభోజ కంఠం కర్కశంగా వినిపించింది, "ఏమిరా శప్పా, కింకరా! ఈ పులిరాజు నాకు నిద్రలేకుండా చేస్తున్నాడు! పాపం, ఆ రాకన్న ఎంతగా బాధ పడుతున్నదో! ఎందుకా గాండ్రిపులూ గోండ్రింపులూ?" అని కేకపెట్టాడు.

"అంతా తెల్లవారి తెలుస్తుంది, గురో! ఆ రాజు ఆఖరున పెట్టిన కేక వింటే—అది గాండ్రింపుగానూ లేదు, గోండ్రింపుగానూ లేదు—గొంతులో ప్రాణ మేదో గురగుర మన్నట్టున్నది. మీరు యిక హాయిగా నిద్ర పోండి. ఉదయమే, చూసుకుందాం," అన్నాడు కింకరుడు.







గుహలో ప్రవేశించిన కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ కలిసి, శవాల మీద పులి రాజు చర్మం వలిచారు. జయమల్లు ఆ చర్మాన్ని కేశవుడికి నడుం దగ్గిర నుంచి తిప్పి, భుజం మీదుగా చుట్టాడు. కోయ గోమాంగ్ కేశవుడి యీ కొత్త వేషం చూసి, ఎక్కడలేని ఉత్సాహంతో, "కేశవా, యిప్పుడు నీ రూపం చూపరుల్లో భయం, భక్తీ కూడా రేకెత్తించేలా వున్నది. ప్రయత్నిస్తే నువ్వు మా కోయజాతి కంతా నాయకుడివి కాగలవు," అన్నాడు.



"అలాంటి ప్రయత్నాలు చేసే తరుణం యింకా రాలేదు." అంటూ జయమల్లు గుహలో నుంచి ఓమారు బయటికి తొంగి చూసి, "ఇక మనం యిక్కడ సాధించవలసింది ఒకే ఒక కార్యం వున్నది. కాలభైరవుడు చెప్పిన, ఆ పెద్ద రావిచెట్టూ, దాని పాదంలో వున్న పాముపుట్టా యీ లోయలో ఎక్కడున్నదో కనుక్కోవాలి," అన్నాడు.

"ఆ గుర్తుల్ని బట్టి మనం రావిచెట్టును కనుక్కోవచ్చు. అక్కడ వున్న ధనరాసుల్ని తవ్వుకు పోవటం కూడా వెంటనే చేద్దామంటావా?" అని అడిగాడు, కోయ గోమాంగ్ ఉత్సాహంగా.

జయమల్లు అతడి ప్రశ్నకు జవాబు చెప్పకుండా, చెవులు రిక్కించి వినసాగాడు. దూరంగా ఎక్కడో మనుషులు అటుకేసి నడిచి వస్తున్న సవ్వడి అస్పష్టంగా అతడికి వినిపిస్తున్నది.

"ధనం మాట తరవాత. ముందు రాజకుమార్తెను, ఆ జగభోజి బారి నుంచి కాపాడాలి. మనం, ఆమె రాజ్యపాలులం!" అన్నాడు కేశవుడు ఆవేశంగా.

జయమల్లు, కేశవుణ్ణి సమీపించి భుజం మీద చెయ్యివేసి, "కేశవా! కాస్త గొంతు తగ్గించి మాట్లాడు. ఈ లోయలో జగభోజి, కింకరులతో పాటు మరెవరో కూడా వున్నా







రని నా అనుమానం. జాగ్రత్తగా విను... ఏవైనా, అడుగుల చప్పుడులు..."

జయమల్లు మాట పూర్తి కాకుండానే, అల్లంత దూరం నుంచి పెద్దగా పిలుస్తున్న ఒక గొంతు వినబడింది: "సోదరా, జగభోజీ! నువ్వెక్కడ? నేను యిక్కడికి తిరిగి వచ్చాను. ఈ రాకాసిలోయలో నీ కంఠ ధ్వని, పులిరాజు రంకెలా విని, నా చెవులకు పట్టిన తుప్పు వదిలించు కుందా మను కున్నాను. కాని మీ రెండు గొంతులూ వినబడవేం?"

ఆ వెంటనే జగభోజీ గొంతు పెద్దగా జవాబిచ్చింది: "సోదరా! ఎవరు? బ్రహ్మదండేనా? ఆహా, ఎంత అదృష్టం! ఎన్నాళ్ళకు తిరిగి వచ్చావు!"

కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళకు బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు భయాశ్చర్యాలను కలిగించింది. సమయానికి యీ దుర్మార్గుడూ యీ లోయ చేరాడన్న మాట! ఇప్పు డేమిటి కర్తవ్యం?

బ్రహ్మదండి మాంత్రికుడు, జగభోజ నివసించే గుహను చేరిన గుర్తుగా, అటువైపు నుంచి, మాటల ధ్వనులు వినబడసాగినై. ఒకటి రెండు నిమిషాలు గడిచిన తరవాత, బ్రహ్మదండి గొంతుస్థాయి కాస్త పెంచి.







"సోదరా! నువ్వు, ఆ బ్రహ్మపుర రాకన్నె కల్పకవల్లిని అపహరించుకుని యిక్కడికి తేవటంలో పెద్ద ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నావు. బ్రహ్మపుర, కపిలపుర రాజ్యాల్లో నివసించే, అనాది ఆటవిక జనాలను వెంట బెట్టుకుని, ఆమె తండ్రి మన రాకాసి లోయను చుట్టు ముట్టాడు. నేను, నీ రక్షణకుగాను, పులుగురాయుడనే ఒక పక్షి తల వెధవతో కలిసి ఒక రహస్య సొరంగ మార్గాన యిక్కడికి వచ్చాను," అన్నాడు.

"నా క్షేమం గురించి, నువ్వు పడిన ఆదుర్దా చూసి, నాకు చాలా సంతోషం కలుగుతున్నది. మనం యిద్దరం ఎంత లేదన్నా, పాతిక ముప్పై సంవత్సరాలు, యీ లోయలో ఒకే గురువు దగ్గిర మంత్ర శాస్త్రం అభ్యసించాం. సరే, యింతకూ నువ్వెళ్ళిన పని, ఏమయింది?" అని అడిగాడు జగభోజి.

జగభోజి ప్రశ్నకు, బ్రహ్మదండి ఛీత్కారం చేసి, "మనం గురువు గురువు అనుకునే ఆ నీచుడు, చచ్చి ఎక్కడున్నాడో గాని—వాడు మనకు మనసిచ్చి మంత్ర శాస్త్రం బోధించ లేదు. బ్రహ్మపుర రాజ్యం లోని ఒకానొక కొండలో కాలభైరవుణ్ణి ప్రతిష్ఠాపన చేసి, మనకు కావలసిన జాతకుడు, కేశవు డనేవాణ్ణి పట్టుకుని, వాడి చేత యిక్కడ దొరికే ధనరాసుల విషయం చెప్పించే ప్రయత్నం చేశాను. కాని, నా పని పూర్తయే లోపలే, బ్రహ్మపుర రాజగురువు తన మంత్రశక్తితో అక్కడ వున్న అందరి నోళ్ళూ కట్టేశాడు," అన్నాడు.

ఆ తరవాత జగభోజీ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి లోయలోకి కొంత దూరం వెళ్ళి, అక్కడ చెట్ల కింద కూచుని వున్న పులుగురాయుణ్ణి, స్థూలకాయుణ్ణీ, జితశక్తివర్మలను కలుసుకున్నారు. ఆ సమయంలో తూర్పు దిక్కు కొంచెం తెలతెల్ల నవుతున్నది.

"ఇక మనం లోయ మధ్యకు పోదాం. ధనరాసులు నిక్షేపమై వున్న రావిచెట్టూ, ఆ పాము పుట్టా ఎక్కడున్నవో, నాకు తెలుసు!" అంటూ జగఘోజ ముందుండి దారి తీశాడు.

జగఘోజ, బ్రహ్మదండితో కలిసి గుహ విడిచి పోవటం; రాజకుమారికి కింకరుడి కాపలా సంగతి—అంతా కేశవుడూ అతడి స్నేహితులూ చూశారు. వాళ్ళకు చీకట్లో ఒక గుహ ముందు అటూ యిటూ పచారు చేస్తున్న కింకరుడి ఆకారం కనబడింది.

వాళ్ళు ముగ్గురూ, కింకరుడు కాపలా కాస్తున్న గుహ దగ్గిరకు వెళ్ళేసరికి, కింకరుడు గుహ ముందు బయట ఆగి, గుహలో వున్న కల్పకవల్లి నుద్దేశించి, "హే రాకుమారీ! బ్రహ్మపుర రాజ్యంలోని సరస్సు దగ్గిర చూడగానే, నిన్ను నేను ప్రేమించేశాను. నువ్వు మా గురువు జగఘోజని ఎలా ప్రేమించి వివాహమాడతావో, నాకర్థం కావటం లేదు. అడవిపంది కోరల్లా వున్న వాడి పళ్ళూ, దబ్బనాల్లా పైకి లేచిన వాడి కనుబొమలూ, నెత్తిన పింకకుళాయీ— ఏ కన్య అయినా వాణ్ణి ఎలా ప్రేమిస్తుంది? నన్ను, చూడు! ఈ తలలో వున్న ఈకలు రాజభేరుండానివి! వాటిని సంపాయించేందుకు నేను చేసిన సాహసం..."

కింకరుడు మాట మధ్యలోనే పెద్దగా అరవబోయి, ప్రాణం కడబట్టుతున్న వాడిలా కీచు మన్నాడు. దానికి కారణం, కేశవుడు ఉచ్చు బిగించి విసిరిన అడవితీగ, గురిగా వాడి కంఠానికి పడి బిగుసుకుపోవటం.

"కేశవా! వాడు ఊపిరాడక చచ్చేట్టున్నాడు. వాడితో మనకు కొంత పని వున్నది. ఆ ఉచ్చు కాస్త వదులు చెయ్యి," అంటూ జయమల్లు రాళ్ళ చాటు నుంచి ముందు కురికాడు. కేశవుడు, కింకరుడి మెడకు బిగుసుకు పోయిన ఉచ్చును వదులు చేశాడు. —(ముగింపు వచ్చే సంచికలో)






## 35

[కేశవుడూ వాళ్లు రాకాసిలోయలోకి దిగి, పులిరాజును చంపారు. అదే సమయంలో బ్రహ్మదండి మాంత్రికుడు అక్కడికి వచ్చి, జగభోజిని వెంటబెట్టుకుని, లోయ మధ్యకు బయలుదేరాడు. కల్పకవల్లి బంధింపబడిన గుహను కాపలా కాస్తున్న కింకరుడి మెడకు, కేశవుడు ఉచ్చు బిగించాడు. జయమల్లు గుహను సమీపించాడు. —తరవాత]

జయమల్లు గుహ ముందుకు వెళ్ళి, "ఓ రాకుమారి కల్పకవల్లీ! యివే నీకు మా నమస్సులు. ఇక్కడ వున్న ముగ్గురం కూడా మీ దేశ పౌరులమే. కేశవుడని పిలవబడే యువకుడు, మా నాయకుడు. నా పేరు జయమల్లు; గోమాంగ్ మా స్నేహితుడు. దుష్టుల సలహా విని, మీ తండ్రి మమ్మల్ని దేశద్రోహులుగా ప్రకటించినా, మేము ఎప్పటికీ దేశభక్తులమే. దుష్టులైన బ్రహ్మదండి, జగభోజి మాంత్రికులను సంహరించబోతున్నాం. మీ ఆజ్ఞ ఏమిటో సెలవివ్వండి!" అన్నాడు.

జయమల్లు యిలా అనగానే గుహలో చిన్న సవ్వడి అయింది. ఆ వెంటనే, ఉదయసూర్యుని కాంతిలో, ధగధగా మెరిసిపోతూ, పదహారు పదిహేడేళ్ళ జవ్వని గుహలో నుంచి బయటికి వచ్చింది. ఆమె రూపలావణ్యాలు కేశవుడి కళ్ళకు మిరు







మిట్లు కొల్పినై. అతడు జంత్రపు బొమ్మలా రాకుమారి కేసి చూస్తూ నిలబడిపోయాడు.

కల్పకవల్లి గుహ నుంచి బయిటికి వచ్చి, కేశవుడి కేసీ, అతడి చేతిలో బందీగా వున్న కింకరుడి కేసీ ఓమారు చూసి, జగభోజి బలవంతంగా తన తల మీద ముడివేసిన దంతపు కిరీటాన్ని లాగి, దూరంగా విసిరి వేస్తూ, "మీ సహాయం వల్ల నేను ఈ దుష్టుల బారి నుంచి బతికి బయటపడ్డాను. మీ రాజ భక్తి నాకు తెలియంది కాదు. బ్రహ్మదండి కల్పించిన కట్టు కథలు నమ్మి, నా తండ్రి మిమ్మల్ని అనుమానించారని నాకే కాదు, రాజ్యంలో వున్న చాలా మందికి కూడా తెలుసు. మీరు, నన్ను కాపాడిన వాళ్ళు గనక, మిమ్మల్ని ఆజ్ఞాపించే హక్కు నాకు లేదు. నాకూ, ఒక ఆయుధం యివ్వండి. లోయలోకి వెళ్ళిన ఆ దుష్టుల్ని వేటాడేందుకు, నేనూ వస్తాను," అన్నది.

కేశవుడు మారు మాటాడకుండా, తన దగ్గిర వున్న కత్తిని కల్పకవల్లికి అందిస్తూ, "రాకుమారీ! ఈ కత్తి మీరు తీసుకోండి, ఈ బాణాలు నాకు చాలు!" అన్నాడు.

జయమల్లు కేశవుడి చేతిలోంచి అడవి తీగ ఉచ్చును అందుకుని, కింకరుడి కేసి పళ్ళు కొరుకుతూ చూసి, "కింకరా! నీకు, నీ ప్రాణ మంటే ఎక్కువ తీపా? లేక నీ గురువు రక్షణ ఎక్కువ తీపా?" అని అడిగాడు.

"మహాగురో, నన్ను చంపకండి! నా కీ భూప్రపంచంలో, నా ప్రాణాని కన్న ఎక్కువ మధురమైందీ, విలువైందీ మరేం లేదు," అన్నాడు కింకరుడు ఏడుపు గొంతుతో.

"అయితే, నువ్వు ఆ ధనరాసులున్న రావిచెట్టు దగ్గిరకు దారి తియ్యి. మోసం చెయ్య ప్రయత్నించావో, నీ గొంతుకు ఉరి బిగుసుకుంటుంది," అన్నాడు జయమల్లు.

"మహాప్రసాదం, గురుదేవరా! ఆ చెట్టు దగ్గిరకు సూటిగా వెళ్ళే దారి తియ్యి





మన్నారా? చుట్టు తిరిగి వెళ్ళే దారి తియ్యమన్నారా?" అని అడిగాడు కింకరుడు.

"ఏ దారైనా తియ్యి. నీ గురువుకూ, వాడి వెంట వున్న పిశాచాలకూ మాత్రం మనం అక్కడికి వస్తున్న సూచన తెలియకూడదు," అన్నాడు జయమల్లు.

"ధన్యుణ్ణి, గురుప్రభో! అలాగే చేస్తాను. మీ పనైన తరవాత మాత్రం, నా గొంతు బిగించి చంపకండి," అంటూ కింకరుడు దారి తీశాడు.

ఆ తరవాత వాడు వాళ్ళను లోయ మధ్యకు తీసుకుపోయాడు. అక్కడ ఒక చెట్టు కింద వాడాగి, దూరంగా కనిపిస్తున్న ఒక ఎత్తయిన రావిచెట్టును జయమల్లుకు వేలితో చూపుతూ, "అదే, రాకాసిలోయలో అంతులేని ధనరాసులున్న రావిచెట్టు. దాని పాదంలో ఒక పాము పుట్ట వున్నది. నేనూ, నా పాత గురువూ దానిని ఎప్పుడో గుర్తించి, ఆ ధనరాసుల మీద హక్కున్న జాతకుడి కోసం ఎదురుచూస్తున్నాం," అన్నాడు.

గోమాంగ్ యిచ్చిన కత్తి తీసుకుని, కేశవుడు రావిచెట్టు కేసి బయలుదేరాడు. జయమల్లూ తతిమ్మా వాళ్ళంతా, అతడికి కొంచెం వెనకగా చెట్లచాటున నక్కుతూ కదిలారు. కింకరుడి మెడకు బిగించి వున్న



తీగను లాగి పట్టుకుని, కోయగోమాంగ్ అతడి వెన్నంటి నడుస్తున్నాడు.

కేశవుడు రావిచెట్టును సమీపించాడు. ఆ చెట్టు మొదట్లో ఒక పెద్ద పుట్ట వున్నది. చెట్టు పైన వున్న గండభేరుండపక్షులు కేశవుడు అక్కడికి రావటం చూస్తూనే, రెక్కలు టపటపలాడిస్తూ, కర్ణకఠోరంగా అరిచినై. కేశవుడు పుట్ట దగ్గిరకు వెళ్ళి, కత్తితో దాని మీద గట్టిగా రెండుసార్లు కొట్టాడు. ఆ వెంటనే ఒక పెద్ద కలుగులో నుంచి మహాసర్పం ఒకటి పడగ విప్పి బుసలు కొడుతూ బయటికి వచ్చింది. ఒకవేళ ఆ సర్పం తన మీదికి వస్తుందేమో అన్న అనుమానంతో





కేశవుడు కత్తి ఎత్తి పట్టుకుని, దాని కేసి ఒకడుగు వేశాడు. సర్పం బుసలు కొట్టటం మాని తల వంచుకుని పుట్ట మీంచి దిగి, దూరంగా పోసాగింది. రావిచెట్టు మీద వున్న గండభేరుండాలు కొన్ని వికృతంగా అరుస్తూ, దాని మీదికి దూకినై.

మహాసర్పం పెట్టే బుసలూ, దానిని తన్నుకుపో చూస్తున్న గండభేరుండాలు చేసే రొదా ఓకిబుకాలం చూసి, కేశవుడు తన కత్తితో పుట్టను తవ్వసాగాడు. ఒకటి రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది. హఠాత్తుగా దాపులనున్న చెట్ల వెనక నుంచి కలకలం బయలుదేరింది. కొరడా ఝళ్ళు మన్నట్టు పెద్ద ధ్వని అయింది. కేశవుడు ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశాడు.

బ్రహ్మదండి మాంత్రికుడూ, జగభోజీ— వాళ్ళ వెనకగా పులుగురాయుడూ, స్థూలకాయుడూ, జితశక్తివర్మలూ చెట్లచాటు నుంచి పెద్దగా అట్టహాసం చేస్తూ బయటికి వచ్చారు. కేశవుడు కంట బడగానే, బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా నవ్వుతూ, "వత్సా కేశవా! నిన్ను కోటీశ్వరుణ్ణి చేయడానికి నే నెన్ని అవస్థలు పడ్డాను! మొత్తం మీద, ఈ చెట్టు పాదంలో వున్న నిధి నిక్షేపాలకు హక్కుదారువైన జాతకుడివి రానే వచ్చావు. కాలభైరవుడు చెప్పిన దంతా సత్య



మైంది. ధనాన్ని కాపలాకాసే మహాసర్పం, అంతా నీ పరం చేసి పక్కకు తప్పుకున్నది. ఇక నువ్వత్తం తొలుగు," అంటూ కేశవుడి కేసి రాసాగాడు. జిత శక్తివర్మలు కత్తులు దూశారు. స్థూలకాయుడు కొరడా ఎత్తి పట్టుకున్నాడు. పులుగురాయుడు చెట్టు మీద వున్న గండభేరుండాల కేసి ఆశగా చూశాడు.

కేశవుడు కత్తి తీసుకుని లేచి నిలబడి, బ్రహ్మదండినీ, అతడి అనుచరవర్గాన్నీ చూస్తూ, "మీరంతా, వున్న చోటునే ఆగండి. ఒక్కడుగు ముందుకు వేశారో, నిలువునా నరికేస్తాను," అన్నాడు, రౌద్రం వుట్టి పడుతున్న గొంతుతో.

ఆ మాటలకు బ్రహ్మదండీ, జగభోజీ పొట్టలు పట్టుకుని నవ్వారు. "మా గరుడ వంశం వాళ్ళ దెబ్బ వీడికి తెలీదు!" అన్నాడు పులుగురాయుడు.

"నా పూర్వ జానిస యింత ధైర్యంగా మాట్లాడుతున్నాడంటే, అందు కేదో మంచి కారణమే వుంటుంది. ఇక్కడ జరగబోయే రక్తపాతంలో నాకు భాగం వద్దు," అంటూ స్థూలకాయుడు, కొరడాను భుజానికి తగిలించుకున్నాడు.

జిత శక్తివర్మలు ముందుకు వస్తూ, "ఒకళ్లం వీడి తలా, ఒకళ్ళం వీడి కాళ్ళూ— ఒక్క వేటుకు నరికేద్దాం," అన్నారు.





కేశవుడు జిత శక్తివర్మల కేసి ఒకడుగు వేసేంతలో, "గురు మౌనానందుడికీ, జై!" అన్న కేకలు వినిపించినై. ఆ మరుక్షణం లోనే ముసలివాడూ, బిడాలీ శ్వాసకర్ణి కొద్ది మంది తమ అనుచరులతో, చెట్లచాటు నుంచి బయిటికి వచ్చారు. వాళ్ళను చూస్తూనే, "హాఁ కాలభైరవా!" అంటూ బ్రహ్మదండి మరో వైపుకు పరిగెత్తబోయాడు. అటు నుంచి, జయమల్లు తన అనుచరులతో చెట్లచాటు నుంచి బయిటికి వచ్చి, బ్రహ్మదండి బలగాన్ని చుట్టు ముట్టాడు.

చేత కత్తిబట్టి ముందుకు వస్తున్న రాకుమారి కల్పకవల్లిని చూస్తూనే, జగభోజి, "అరే, మోసం! నా కాబోయే భార్య గుహ నుంచి ఎలా బయటపడగలిగింది? ఆ ద్రోహి కింకరు డెక్కడ?" అంటూ అరిచాడు.

"కింకరు డిక్కడే వున్నాడు, గురో! గొంతుకు ఉరిబిగిస్తే, అన్ని రహస్యాలూ వీళ్ళకు చెప్పి, యిక్కడికి వెంటబెట్టుకొచ్చాను. ప్రాణం తీపి అలాంటిది గురో!" అంటూ కింకరుడు, కోయగోమాంగ్ పక్క నుంచి కేక పెట్టాడు.

అదే సమయంలో కల్పకవల్లి కత్తితో బెబ్బులిలా ముందుకురికి, జగభోజి కంఠాన్ని ఒక్క వేటుతో నరుకుతూ, "పాపీ! నీకు యిదే తగిన శిక్ష," అన్నది.

జగభోజి చావు చూస్తూనే, బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా మూలిగి, "వత్సా, కేశవా! శిష్యా, జయమల్లూ! నన్ను చంపకండి. నే నేమైనా పాపాలు చేసివుంటే— అదంతా మీ యిద్దరి మంచికే చేశాను. ఇక్కడున్న ధనరాసులన్నిటికీ వారసులు, మీరు," అంటూ బావురుమన్నాడు.

ఈ లోపల కేశవుడు, తన తండ్రి కేసి పరిగెత్తి, "అయ్యా, ఎన్ని జన్మలో మరి చూస్తాననుకో లేదు," అంటూ కావిలించుకున్నాడు. ముసలివాడు మాట్లాడేందుకు గొంతు పెగలక, కళ్ళవెంట ఆనందబాష్పాలు





రాల్చారు. ఆ తండ్రి కొడుకుల ప్రేమ చూసి కల్పకవల్లి, ఎంతో ఆనందపడింది.

బిడాలి, శ్వానకర్ణి, కేశవుడి దగ్గిరకు వచ్చి, "కేశవా! నువ్వూ, నీ మిత్రులూ రెక్కల మనుషులను హత మార్చటానికి, మాకు చేసిన సహాయానికి కృతజ్ఞతగా, నీ తండ్రికీ, అతడి అనుచరులకూ, మా చేత నైనంత సహాయం చేశాం," అన్నారు. కేశవుడు ఆ అడవిమనుషుల నాయకు లిద్దర్నీ ఎంతో ప్రేమతో కౌగిలించుకున్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడూ, పులుగు రాయుడూ, బానిసల యజమాని స్థూల కాయుడూ బంధించబడ్డారు. కింకరుడు తమకు చేసిన సహాయానికి సంతోషించి, అతడి మెడకు బిగించిన ఉరితాడు తొలగిం చాడు కొయగోమాంగ్.

కల్పకవల్లి, అక్కడ చేరిన వారందరికీ పరిచయం చేయబడింది. ఆ తరవాత కొంత సేపటికి బిడాలి, శ్వానకర్ణి వాళ్ళ అను చరులు తెచ్చిన వార్త విని, బ్రహ్మపుర రాజూ, రాజగురువూ అక్కడికి వచ్చారు.

కేశవుడు, రాజుకూ, రాజగురువుకూ, రావిచెట్టు మొదట్లో వున్న పాము పుట్ట చూపుతూ, "ఆ పుట్ట తవ్వితే, తమకు అంతులేని ధనరాసులు లభించగలవు.



అందులో నాకు పాలు యివ్వవలసిందని, అడగబోవటంలేదు, మహారాజా!" అన్నాడు.

రాజు, తన కుమార్తె కేసీ, కేశవుడి కేసీ ఓమారు చూసి, వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు ప్రేమగా చూసుకోవటం గ్రహించి, చిరు నవ్వు నవ్వుతూ, "కేశవా, నీ కేదో నా మీద విరోధ భావం వున్నట్టు కనబడుతున్నది. నిన్నూ, నీ తండ్రినీ, నీ స్నేహితులనూ దేశ ద్రోహులుగా ప్రకటించటంలో, నేను పొర బాటు చేశానని గ్రహిస్తున్నాను. నా ఒక్కగా నొక్క కుమార్తె కల్పకవల్లి అపహరణ సంగతి తెలిసిన తరవాత, నేను రాజ్యంలో చేయించిన చాటింపు విషయం నీకు తెలియ





నట్టుంది. ఆమెను తిరిగి తెచ్చి నాకు ఒప్ప చెప్పిన వ్యక్తికి, ఆమె నిచ్చి వివాహం చేయటమే గాక, అర్ధ రాజ్యమిస్తానని కూడా ప్రకటించాను," అన్నాడు.

రాజగురువు, ఒక చేత్తో కేశవుడి భుజాన్నీ, మరొక చేత్తో జయమల్లు భుజాన్నీ పట్టుకుని, "మీరు పడిన కష్టాలకు మహారాజు కన్న, నేనే ఎక్కువ బాధ్యుణ్ణి. బ్రహ్మదండి వెంట యిద్దరు సైనికుల్ని పంపటం ద్వారా, అతడు రాజభక్తుడనీ, మీరు రాజద్రోహులనీ—అనవసరమైన అపవాదు కలిగించాను. ఏది ఏమైనా మీరు మీ శక్తిసామర్థ్యాల వల్ల అన్ని కష్టాలనూ ఎదుర్కొని జయించటమే గాక, రాకాసిలోయలోని ధనరాసుల్ని బ్రహ్మపురరాజ్య పరం చేశారు. ఆ ధనం వల్ల రాజ్యంలోని ప్రజలంతా సుఖపడతారు," అన్నాడు.

ఆ తరవాత సైనికులు రావిచెట్టు మొదట్లో వున్న పుట్ట అయిదారడుగులు తవ్వే సరికి, వాళ్ళకు పెద్ద భూగృహం ఒకటి కనిపించింది. అందులో వున్న వెలలేని రత్న మణిమాణిక్యాలూ, బంగారం, వెండీ చూసి అందరూ దిగ్భ్రాంతులయారు. ఆ ధనమంతా సైన్యం వెంట వచ్చిన ఏనుగుల మీదా, బళ్ళ మీదా ఎక్కించబడింది.

తరవాత అందరూ బ్రహ్మపురం చేరారు. రాకుమారి కల్పకవల్లితో, కేశవుడి వివాహం మహా వైభవంగా జరిగింది.

ముసలివాడు ఏ చీకూ చింతా లేకుండా తన కొడుకు కేశవుడి వద్ద వుంటూ, శేషజీవితాన్ని హాయిగా గడిపాడు. కొంత కాలానికి రాజు వృద్ధాప్యంలో మరణించగా, కేశవుడు బ్రహ్మపుర రాజ్యానికి రాజై, జయమల్లు మంత్రిగా, కోయగోమాంగ్, చిన్న గడేజంగ్‌లు సేనానాయకులుగా తనకు అన్నిటా సహాయపడుతూండగా, చాలా కాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.

—(అయిపోయింది)



